శ్రీ ర స్తు.

# విషవైద్యచిన్తామణి

## ఆంధ్రతాత్పర్యసహితము.

---


వైద్యజ్యోతిషవిద్యాపారంగతుండగు

శ్రీ బొద్దికూరపాటి వేంకటరంగకవిచే

విరచితము.

సంస్కృతప్రాకృతాంధ్రవిద్యావిశారదులగు

శ్రీమాన్ ఉత్పల వేంకటనృసింహాచార్యులవారిచేఁ

బరిష్కృతము.





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

బ్రకటితము.

1919.

Printed by
V. RAMASWAMY SASTRULU & SONS
at the "VAVILLA" PRESS,
MADRAS.—1920.

శ్లో. వావిల్లాభిదవంశవార్ధిశశిన శ్శ్రీవేఙ్కటేశ్వరస్య శ్రీ
రామస్వామిసుధీ సుతస్య సకల స్వామ్యేన సంయోజితః,
నానాతంత్రసముద్ధృతో విష చికిత్సాభిఖ్యచిన్తామణి
ర్జీయాదారవిచంద్రతారమఖిల శ్రేయోభివృద్ధిందదత్.

# విషయసూచిక.

# విషయసూచిక

పాఠకమహాశయులారా !

☞ 140-వ పేజీలోనున్న చతుర్థమయూఖ మనునది తప్పు; తృతీయమయూఖములోని దేగాన నిదియుఁదృతీయమయూఖమేయగును.



# విషవైద్యచిన్తామణి.



## పీఠిక.

మంగళాచరణాదికము

శ్లో. శ్రీసీతాహృదయాధీశ ముమాధీశసమర్చితం,
రాగాదిరోగవిచ్ఛేద మాద్యం వైద్యం నమామ్యహమ్. 1

తాత్పర్యము. కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యాదులగు నసాధ్యలక్షణములుగల రాగాదిరోగముల నున్మూలింపఁ గలయాదివైద్యుఁడును, నిరంతరగౌరీశ్వర పూజితుఁడును, లక్ష్మీస్వరూపురాలగు సీతాదేవికి మనోవల్లభుఁడు నగుశ్రీరామచంద్ర పరబ్రహ్మమును నమస్కరించుచున్నాను.

శ్లో. అనేకకోటిబ్రహ్మాండ సృష్టిస్థిత్యంతకారిణీం,
సౌభాగ్యలహరీం భక్త్యా సీతాదేవీం నమామ్యహమ్. 2

ఆకాశమధ్యమునందు వానివానినియతగతులు దప్పక సంచరించుచు రసగోళముల వలె ప్రకాశించుచుండు ననేకకోటిబ్రహ్మాండములసృష్టి స్థితి లయములకుఁ గారణభూతురాలును, దేవదానవమనుష్యాదుల సౌభాగ్యమహాతరంగస్వరూపిణియు నగుసీతాదేవిని ప్రణుతించుచున్నాను.

శ్లో. మృత్యుంజయం మహాదేవం శేషవాసుకికంకణం,
హరం గరధరం సోమం తం నమామ్యభవం భవమ్. 3

భవుఁడును, అభవుఁడును, విషమును ధరించినవాఁడును, హరుఁడును, వాసుకి శేషులను సర్పరాట్కంకణములు కలవాఁడును, మహాదేవుఁడును, మృత్యువును జయించినవాఁడు నగుపార్వతీసమేతుఁడయిన పరమేశ్వరుని నమస్కరించుచున్నాను.

శ్లో. చేటీకృతాఖిలస్వర్వధూటీం విశ్వంభరాకటీం,
కంఠీరవకసద్ఘోటీం వందే ఉమాం సర్వమంగళామ్. 4

సమస్తదేవతాస్త్రీలు పరిచారికలుగాఁ గలదియు, భూమండలమువంటి జఘన భాగము గలదియు, సింహవాహనముగలదియు, సర్వమంగళ యను నామాంతరముకలదియు నగు పార్వతీదేవికి నతు లొనరించుచున్నాను.

శ్లో. భారతీదృక్చకోరేందుం భర్మగర్భం పితామహం,
ఫుల్లపద్మాసనాసీనం నమామి చతురాననమ్. 5

కాంచనగర్భము గలవాఁడును, సమస్తలోకములకు పితామహుఁడును, వికసించిన కమలపీఠము నధివసించువాఁడును, సరస్వతీదేవియొక్క నేత్రము లను చకోరములకు చంద్రునివంటివాఁడును, నాలుగుముఖములు గలవాఁడు నగు బ్రహ్మదేవునకు ప్రణామము లొనరించుచున్నాను.

శ్లో. వాణీం ప్రసవలిడ్వేణీం చంద్రికాభశరీరిణీం,
వీణాపుస్తకవత్పాణిం భజామి రమణీమణీమ్. 6

తుమ్మెదలవలెనల్లనైన జడగలదియు, వెన్నెలవలె శుభ్రమైన శరీరచ్ఛాయగలదియు, వీణాపుస్తకములను ధరించిన పాణిపద్మములు కలదియు, స్త్రీలలో రత్నమువంటిదియునగు సరస్వతీదేవిని భజించుచున్నాను.

శ్లో. స్తంబేరమాననం సౌమ్యం సర్వపూజ్యం సనాతనం,
వందారుజనమందారం విఘ్నరాజం నమామ్యహమ్. 7

ఏనుఁగుముఖము గలవాఁడును, మంచిమనస్సు గలవాఁడును, సర్వకార్యములందు నెల్లరచే నర్చింపఁబడువాఁడును, పురాణపురుషుఁడును, నతులగు శ్రితులకు పారిజాతప్రాయుఁడును, అంతరాయముల కధీశుఁడు నగువిఘ్నేశ్వరునకు మ్రొక్కు లిడుచున్నాను.

శ్లో. సుధాసముద్రసంభూతం దేవతాప్రాణరక్షకం,
సర్వవ్యాధిప్రశమనం రాకాచంద్రనిభాననమ్. 8
అమృతాభయసంయుక్తహస్తం శస్తం కృపానిధిం,
ధ్యాయే ధన్వంతరిం దేవం భిషక్ఛాస్త్రాధిదైవతమ్. 9

కలశపాథోధియం దుద్భవించినవాఁడును, దేవతులప్రాణసంరక్షకుఁడును, సర్వవ్యాధుల నిర్మూలించువాఁడును, పూర్ణచంద్రునివంటిముఖము కలవాఁడును, అమృతము నభయము (లేక, తిప్పతీఁగయును కరక కాయయును) గలహస్తములు గలవాఁడును, జగత్ప్రసిద్ధి గలవాఁడును, దయాసముద్రుఁడును వైద్యవిద్య కధిదైవతమైనవాఁడు నగు ధన్వంతరిని ధ్యానించుచున్నాను.

శ్లో. శ్రీవేంకటనృసింహాఖ్య మాయుర్వేదవిశారదం,
నమామ్యఖండవిజ్ఞానజనకం జనకం మమ. 10

ఆయుర్వేదపరిపూర్ణవేదియు, వైద్యజ్యోతిషకవితావిద్యాధ్యయనమునకు నాచార్యుండును, అవాఙ్మానసగోచరమగు వేదాంతవిద్యాజ్ఞానమందు జనకమహారాజువంటివాఁడును, మదీయజనకుఁడు నగు వేంకటనృసింహార్యునకు దండప్రణామంబు లాచరించుచున్నాను.

## —— ప్రతిజ్ఞ. ——

శ్లో. శ్రీబొద్దికూరపాట్యన్వవాయాంబుధినిశాకరః,
ధీమాన్ వేంకటకృష్ణాఖ్యో వైద్యశాస్త్రవిశారదః. 11
తస్యాత్మజో భిషక్శాస్త్రపారీణ స్సర్వశాస్త్రవిత్,
శ్రీవేంకటనృసింహాఖ్యో వైద్యవిద్యాపురందరః. 12
పుత్త్రి స్తస్య ధరామరాంఘ్రిరజసాఽస్తోకస్ఫురన్మస్తకో
లక్ష్మీనాథపదారవిందమకరందాస్వాదనేందిందిరః,
వైద్యజ్యోతిషమంత్రతంత్రచతుర శ్శాంతః ప్రశస్తః కవిః
సోఽహం వేంకటరంగనామకభిషక్త్రివిధవైద్యాధికః. 13
యావనాంగ్లేయభైషజ్యక్రియాతంత్రవిదామయా,
మంత్రతంత్రప్రయోగాదీన్ శాస్త్రత స్స్వానుభూతితః.
యోగాన్ విషహరాన్ జ్ఞాత్వా విషవైద్యం నిగద్యతే. 14

బొద్దికూరపాటివంశాంబునిధిచంద్రుఁడును వైద్యశిఖామణియునగు వేంకటకృష్ణాభిధానుని కుమారుఁడును ఆయుర్వేదపారంగతుఁడును, సమస్తశాస్త్రవేత్తయును వైద్యవిద్యయందు నింద్రసమానుఁడునగు వేంకటనృసింహాఖ్యుని కుమారుఁడును, ధరామరచరణరాజీవరజోవిరాజితోత్తమాంగుండును, శ్రీమన్నారాయణచరణారవిందమకరందాస్వాదనేందిందిరుండును, వైద్యజ్యోతిషమంత్రతంత్రశాస్త్రములయందు నైపుణ్యము గలవాఁడును, శాంతుఁడును, ప్రశస్తుఁడును, కవియును, త్రివిధవైద్యముల నెఱిఁగినవాఁడును, ఆయుర్వేదయావన (యూనాని), ఆంగ్లేయవైద్యముల సైతము తెలిసినవాఁడును, వేంకటరంగనను నామధేయముగల నేను మంత్రతంత్రవైద్యకశాస్త్రములందుఁగల యనుభవముచేత విషహరములైన యోగముల గ్రహించి ప్రస్తుత మొకవిషవైద్యశాస్త్రమును రచించుచున్నాను.

శ్లో. శ్రీమత్పుష్పగిరీశశంకరమఠీయాస్థానవైద్యోత్తమై
రాయుర్వేదకళాప్రచారచతురై ర్భేజే మదీయాన్వయః,
తస్మాత్తాదృశవంశజేన నిఖిలాయుర్వేదవిద్యాజుషా
గ్రంథోఽయం క్రియతే మయా విషచికిత్సాసారసర్వంకషః. 15

అస్మద్వంశ్యులందఱు పారంపర్యముగ పుష్పగిరిజగద్గురుశంకరమఠీయాస్థాన వైద్యులై యున్నారు. నేనట్టివంశపరంపరలో జనియించినవాఁడ నగుటవలనను, ఆయుర్వేదవైద్యరహస్యముల నెఱిఁగినవాఁడ నగుటవలనను విషవైద్యమందు పారభూతమగు నీశాస్త్రమును రచియింపఁబూనినాఁడను.

శ్లో. ఇంద్రజాలేఽశ్వికల్పేఽపి చోడ్డీశే బ్రహ్మగారుడే,
శ్యామారహస్యతంత్రే చ గదాసంజీవనే తథా. 16
రసార్ణవే కామరత్నే తథా చ హారమేఖలే,
ప్రోక్తం పూజ్యై ర్మహద్భిశ్చ వైద్యశాస్త్రవిశారదైః. 17
యత్తత్సర్వం సముద్ధృత్య దధ్నో ఘృత మివాదరాత్,
మానవానాం హితార్థాయ విషవైద్య మిహోచ్యతే. 18

ఇంద్రజాలవిద్యాతంత్రము, అశ్వికల్పము, ఉడ్డీశము, బ్రహ్మగారుడము, శ్యామారహస్యతంత్రము, గదాసంజీవనము, రసార్ణవము, కామరత్నము, హారమేఖల మొదలైనవైద్యశాస్త్రములందు మహాత్ములును, పూజ్యులును, వైద్యవిశారదులునగుమహర్షులచేఁ జెప్పంబడి అస్మదాదుల కనుభవసిద్ధములగు ముఖ్యయోగములను దధిని దఱచి ఘృతమును సాధించినట్లు మనుజుల శ్రేయముకొఱకు నీవిషచికిత్సాశాస్త్రమును రచించుచున్నాను.

శ్లో. వర్షైః పంచసహస్రకైః కలియుగే యాతే వికార్యాహ్వయే
వర్షే మాధవనామమాసి విహితో గ్రంథక్రియోపక్రమః,
త్వేవోపక్రమయుక్తవైద్యకకళాగ్రంథాంశ్చ దృష్ట్వాపృథక్
సర్వేషాం భిషజాం హితాయ భవతీ త్యాలోచ్య సర్వోత్తమః. 19

కలియుగశతాబ్దములు అయిదువేలు సంఖ్యగల వికారినామసంవత్సరము చైత్రమాసమునందు, వైద్యకశాస్త్రముల నవలోకించి సమస్త వైద్యులయొక్క హితము నాలోచించి సర్వోత్తమమైన విషచికిత్సాశాస్త్రమును ప్రారంభించినాఁడను.

శ్లో. విషవైద్య మిదం శాస్త్రం చింతామణిసమాహ్వయం,
భిషగ్వేంకటరంగాఖ్యకవినా క్రియతేఽధునా. 20

తా. ఈశాస్త్రమునకు విషవైద్యచింతామణి యని పేరు. ఇది వైద్యుఁడగు బొడ్డు కూరపాటి వేంకటరంగమను పేరు గలకవిచే నిపుడు రచియింపంబడుచున్నది.

---

శ్రీ ర స్తు.

# విషవైద్యచిన్తామణి.

## సర్వవిషసామాన్యలక్షణోపచారాదినిరూపక

# ప్రథమమయూఖము.

---

### విషోత్పత్తివివరణము.

శ్లో. విషస్య సంభవం వక్ష్యే గుణా నపి చ కారణం,
లక్షణాని చ వేగాంశ్చ చికిత్సాశ్చ పృథగ్విధాః. 21

తా. విషోత్పత్తి వివరణము, అది పుట్టిన కారణము, దాని గుణములు, లక్షణములు, వేగములు, దాని చికిత్సలు చెప్పుచున్నాను.

శ్లో. క్షీరాబ్ధిమథనే పూర్వం ప్రాగేవామృతసంభవాత్,
పురుషః కశ్చి దుత్పన్న స్తేజస్వీ భీషణాకృతిః. 22
పింగకేశ శ్చతుర్దంష్ట్రో వహ్నిదీప్తవిలోచనః,
లోకో విషణ్ణ స్తం దృష్ట్వా తేన సోఽభూ ద్విషాహ్వయః. 23
హుంకారా ద్బ్రహ్మణ స్సోఽయం త్యక్త్వా మాయామయం వపుః,
స్వరూపం సంశ్రయామాస స్థావరం చైవ జంగమం,
స్థావరస్థం తయో ర్మధ్యే వీర్యే త్వత్యుల్బణం స్థిరమ్. 24

క్షీరసముద్రమథనకాలమందు అమృతోత్పత్తికి ముందు తీక్ష్ణతేజస్సుగలవాఁడును, భయంకరాకారము గలవాఁడును, పసుపురంగు వెండ్రుకలు కలవాఁడును, నాలుగుకోరలు కలవాఁడును, అగ్నిసన్నిభమగు చూపులు కలవాఁడును నగునొక్క పురుషుఁ డావిర్భవించెను. దానిని జూచి జగత్తు విషణ్ణస్థితి నవలంబించెను. అందువలననే వానికి విషపురుషుఁ డనుపేరు గలిగెను. బ్రహ్మదేవుఁడు వానిని జూచి హుంకార మొనర్ప నాతఁడు తన భీకరమాయాస్వరూపమును వదలి కొన్ని స్థావరజంగమములందు తనస్వరూపమును ప్రవేశపెట్టినందున స్థావరజంగమవిషము లేర్పడెను. అందు స్థావరవిష మమోఘవీర్యము కలదై ప్రజ్వలించెను.

### విషసామాన్యలక్షణములు.

శ్లో. అష్టవేగం దశగుణం చతుర్వింశత్యుపక్రమం,
త ద్విద్యా త్స్వంబుయోనిత్వా త్సక్లేదం గుడవద్గతమ్. 25

పూర్వోక్తస్థావరజంగమస్వరూపమగు విషము ఎనిమిదివేగములు, పదిగుణములు, ఇరువదినాలుగు చికిత్సాక్రమములు కలదియై యుండును. అది జలమందుఁ బుట్టిన దగుటవలన వర్షాకాలమునందు బెల్లమువలె జిగటకలదియై యుండును.

### విషభేదములు.

శ్లో. స్థావరం జంగమం చైవ కృత్రిమం యోగజం తథా,
చతుర్విధై ర్విషై రేభిః ప్రాణినాం ప్రాణనాశనమ్. 26

స్థావరవిషమనియు, జంగమవిషమనియు, కృత్రిమవిషమనియు, యోగజవిషమనియు, నిటుల విషములు నాలుగు భేదములు కలవియై ప్రాణులకు ప్రాణోపద్రవము కలుగఁజేయుచున్నవి.

### విషాశ్రయసంఖ్య.

శ్లో. దశాధిష్ఠాన మాద్యం తు ద్వితీయం షోడశాశ్రయం,
తృతీయం చ చతుర్థం చ బహురూపేణ కల్పితమ్. 27

మొదటిది యగుస్థావరవిషమునకు పదియాశ్రయములును, రెండవదియగు జంగమవిషమునకు పదునాఱాశ్రయములును కలిగియున్నవి. మూఁడవదియగు కృత్రిమవిషమును, నాల్గవదగుసంయోగజవిషము ననేకవిధములచేఁ గల్పింపఁబడుచున్నవి.

### స్థావరవిషదశాశ్రయములు.

శ్లో. మూలం పత్రం ఫలం పుష్పం త్వక్ క్షీరం సార ఏవచ,
నిర్యాసో ధాతవః కందః స్థావర స్యాశ్రయా దశ. 28

వేరునందును, ఆకులందును, ఫలములందును, పువ్వులందును, పట్టయందును, పాలయందును, చేవయందును, బంకయందును, ఖనిజములందును, దుంపలయందును స్థావరవిషముండును.

### స్థావరవిషాశ్రయముల కుదాహరణము.

శ్లో. మూలే విషం వాజిమారేః పత్రే చ విషపత్రిణః,
ఫలే కర్కోటకస్యాపి పుష్పే వేత్రస్య కథ్యతే. 29
త్వచానిర్యాససారేషు కరంభాద్యాః ప్రకీర్తితాః,
స్నుక్ క్షీరే విష మాఖ్యాతం హరితాలాదిధాతుషు.
వత్సనాభస్య కందే చ సర్వ మూహ్య మిదం క్రమాత్. 30

వేరునందు గన్నేరుచెట్టునకును, ఆకులయందు విషపత్రివృక్షమునకును, ఫలములందు ఢావరడంగి వృక్షమునకును, పువ్వులందు పేము (అనఁగా : బెత్తము) తీఁగకును,

పట్టబంక చేవ యనువానియందు దుష్టుపు ముష్టి కానుగు జల్లేడు మొదలగువృక్షముల కును, పాలయందు జెముడునకును, ధాతువులందు (ఎలిక) పాషాణ మణిశిలాదులకును, దుంపలయందు వత్సనాభిజాతు లిరువదియైదింటికిని, విషము కలిగియుండు నని తెలియవలయును.

## జంగమవిషషోడశాశ్రయములు.

శ్లో. దృష్టినిశ్వాసదంష్ట్రాశ్చనఖమూత్రమలాని చ,
శుక్రం లాలా ముఖ స్పర్శ దంశ సంస్రావ మర్దితం.
గుదాస్థిపిత్తశూకాని దశ ష ట్జంగమాశ్రయాః. 31

జంగమవిషమనఁగా: జంతుజాలములయందుండు విషమునకు పేరు. ఈజంగమ విషమునకు పదునాఱాశ్రయములు కలవు. అది యెట్లనిన: కొన్నిటికి దృష్టియందును, కొన్నిటికి శ్వాసమునందును, కొన్నిటికి కోఱలందును, కొన్నిటికి గోళ్లయందును, కొన్నిటికి మూత్రమునందును, కొన్నిటికి మలమునందును, కొన్నిటికి రేతస్సునందును, కొన్నిటికి జొల్లునందును, కొన్నిటికి నోటియందును, కొన్నిటికి స్పర్శమునందును, కొన్నిటికి దంతములందును, కొన్నిటికి రజస్సునందును, కొన్నిటికి మర్దనమునందును, కొన్నిటికి పురీషద్వారమందును, కొన్నిటికి శల్యములందును, కొన్నిటికి పిత్తమునందును, కొన్నిటికి తోకముల్లునందును ఈవిధముగ పదునాఱుస్థలముల విషము కలిగియుండును.

## జంగమవిషజంతు వివరణము.

శ్లో. దివ్యాహీనాం శ్వాసదృష్ట్యో ర్భూసర్పాణాం తు దంష్ట్రయోః,
వ్యాఘ్రాదీనాం తు దంష్ట్రాసు నఖేషు చ వదంతి హి. 32
గౌళ్యాదీనాం తు విణ్మూత్రే ఆఖ్వాదీనాం తు రేతసి,
అళర్కాణాం చ లాలాయాం దంశే చైవావమర్దనే. 33
గుదే ముఖే చ విణ్మూత్రే చిత్రశీర్షాదికస్యచ,
శల్యేషు రాజిలాదీనాం పిత్తే శకులమత్స్యయోః.
శూకేషు చోచ్చిటింగానాం వృశ్చికాదేశ్చ షోడశ. 34

దృష్టులందును శ్వాసలందును దేవసర్పములకును, కోఱలందు భూసర్పముల కును, కోఱలందును గోరులందును పులిమొదలైనచతుర్దంష్ట్రిలు గలచతుష్పాజ్జంతువుల కును, మలమూత్రములందు బల్లి, నలికీచు మొదలైనజంతువులకును, రేతస్సునందు ఎలుకలు, పందికొక్కులు మొదలైనవానికిని, జొల్లునందును కోఱలయందును పిచ్చికుక్క మొదలైన నాలుగుకోఱలు నాలుగుకాళ్లు గల వెఱ్ఱెత్తినజంతువులకును, జొల్లు స్పర్శము రజస్సు శుక్రము దంతములు మర్దనము గుదము నోరు మలము మూత్రము అనువాని

యందు తొండ, ముంగిస, రెండుతలలశిఖండి, సాలెపురుగు, బొరియపరిట, జెఱ్ఱి, అగ్ని మండలము, జలమండలము, పులికోను, తాటిజెఱ్ఱి, మిడుత, చిమట, ఉడుత, మెఁదలగు జంతువులకును, ఎముకలయందు రెండుతలలశిఖండి, దాసరిపాము, జెఱ్ఱిపోతు అనువానికిని, పిత్తకోశమునందును తోఁకయందును బేడిసచేఁప, (తేక, ఏఁడుచేఁప) మొదలైనవానికిని, తోఁకముల్లునందు మండ్రగబ్బ, తేలు, అడుతేలు, కందిరీగలు, తుమ్మెదలు, దోమలు, ఈఁగలు మొదలైనవానికిని, ఇట్లు జంగమ విషమునకు పదునాఱాశ్రయములు కలిగియుండును.

## కృత్రిమవిషలక్షణము.

శ్లో. స్త్రియం పుమాన్ వశీకర్తుం పుమాంసం వా నితంబినీ,
కీటై రుపమలై శ్శుక్రశోణితాభ్యాం నఖై రపి.
కేశాదిభి శ్చ యత్కుర్యా త్తత్కృత్రిమవిషం మతమ్. 35

జీవజంతువులను, ఉపమలములను, శుక్ర శోణిత మూత్రములను, నఖకేశాదులను కూర్చి తయారు చేసి స్త్రీపురుషు లొండొరులు పరస్పరమోహబద్ధులగుట కన్నపానములలో కలిపి భక్షింపఁజేయునది కృత్రిమవిష మనఁబడును. ఇందువలన పరస్పరవశీకరణము కలుగుటకు మాఱుగా కాలాంతరమున కాసశ్వాసజ్వరమలబంధక్షయాదులు కలిగి మరణము సంభవించును.

## సంయోగజవిషలక్షణము.

శ్లో. భక్షణార్హపదార్థానాం సంయోగా ద్యోగజం విషం,
తేన పంచత్వ మాప్నోతి మానవ స్తు న సంశయః. 36

మనము నిరంతరము భుజించునట్టిభోజ్యవస్తువుల నొకదానితో నొకటి చేర్చినందువలన విషస్వభావము గలవియై యవి భక్షించినమానవులకు మరణము సంప్రాప్తించును. ఇదియు సంయోగజవిష మనంబడును.

## విషాష్టవేగవివరణము.

శ్లో. తృణ్మోహద న్తహర్ష ప్రసేకవమధుక్లమా భవంత్యాద్యే,
వేగే రసప్రదోషా దసృక్ప్రదోషా ద్ద్వితీయే చ. 37
వైవర్ణ్యం భ్రమవేపథుమూర్ఛాజృంభాంగచిమిచిమాతమకాః,
దుష్టపిశితా త్తృతీయే మండలకం[illegible]శ్వయథుకకోఠాద్యాః. 38
వాతాదిజా శ్చతుర్థే ఛర్ది ర్దాహాంగశూలమూర్ఛాద్యాః,
నీలాదీనాం తమస శ్చ దర్శనం పంచమే వేగే. 39
షష్ఠే హిక్కాభంగః స్పందస్య తు సప్తమే ఒష్టమేమరణమ్.

విషముయొక్క ప్రథమవేగమందు రసధాతువు దూష్యమై లాలాస్రావము, వమనము, దాహము, మోహము, పండ్లుతిమ్మిరిగొనుట, ఆయాసమును కలుగును. ద్వితీయ వేగమున రక్తము దూష్యమై కంపము, వైవర్ణ్యము, ఆవులింతలు, శరీరమందు తిమ్మిరి, చీకట్లు కమ్ముట, తలతిరుగుట, మూర్ఛయు సంభవించును. తృతీయవేగమున మాంసము దూష్యమై దురద, వాపు, దద్దులు, వలయాకారములగు చిడుములు ఏర్పడును. చతుర్థవేగమున మచ్చలు, జిల, వాపు, వాయువికారమును పొడసూపును. పంచమవేగమున దృష్టి నశించును. షష్ఠవేగమందు ఎక్కిళ్లు కలుగును. సప్తమవేగమందు దేహమంతయు విశీర్ణత, శైథిల్యము నేర్పడును. అష్టమవేగమందు మరణము కలుగును.

అన్యచ్చ.—

శ్లో. విషస్య ప్రథమే వేగే రసధాతుః ప్రదుష్యతి,
ప్రసేకవమితృణ్మోహదంతహర్షక్లమా గుణాః. 40
ద్వితీయే దూషితం రక్తం భవేత్కంపో వివర్ణతా,
జృంభోఽంగహర్షస్తమకో భ్రమో మూర్ఛాచ జాయతే. 41
కండూశోఫాః ప్రజాయంతే తృతీయే మాంసదోషతః,
తత్ర తత్ర ప్రజాయంతే కోఠా మండలకానిచ. 42
చతుర్థే శూలదాహాంగచ్ఛర్ది మూర్ఛాదయోగుణాః,
పంచమే తిమిరాలోకష్షష్ఠే హిక్కా ప్రజాయతే.
విజ్ఞేయస్సప్తమే భంగో మృతిమే వాష్టమే విదుః. 43

ఈశ్లోకమునకుఁ గల తాత్పర్యము పైశ్లోకమందే వివరింపఁబడియున్నది.

## —≈ విషదశగుణవివరణము. ≈—

శ్లో. లఘు రూక్ష మాశు విశదం వ్యవాయి తీక్ష్ణం వికాసి సూక్ష్మంచ,
ఉష్ణ మనిర్దేశ్యరసం దశగుణ ముక్తం విషం తద్జ్ఞైః. 44

లఘువు (భారములేనిది), రూక్షము (చమురులేనిది), ఆశు (త్వరగావ్యాపించునది) విశదము (బుద్బుదములేనిది), వ్యవాయి (ప్రసరించునది), తీక్ష్ణము (అగ్నివలె జ్వలించునది), వికాసి (అల్లుకొనునది), సూక్ష్మము (అల్పస్వరూపము కలది), ఉష్ణము (వేఁడివీర్యము కలది), అనిర్దేశ్యరసము (స్ఫుటముగాని రసము కలది), ఇట్లు పదిగుణములు విషమునకు కలిగి యుండును.

## —≈ ఓజస్స్వరూపము. ≈—

శ్లో. ఓజసో విపరీతం తత్ లఘ్వాద్యై రన్వితం గుణైః,
వాతపిత్తోత్తరం నృణాం సద్యో హరతి జీవితమ్. 45

విషం హి దేహం సంప్రాప్య ప్రాగ్దూషయతి శోణితం,
కఫపిత్తానిలాన్ శ్చాను సమాన్ దోషాన్ సహాశయాన్.
తతోహృదయ మాస్థాయ దేహోచ్ఛేదాయ కల్పతే. 46

మనుష్యుఁడు జీవించియుండుటకు నోజోధాతు వనునది శరీరమును పోషించుచుండుటయే కారణమై యుండును. ఓజస్సనఁగా: మనుష్యునకు ప్రాణాధారమై వృక్షమునకు చేవవలె సర్వదేహాశ్రితమై యుండును. దీనికి సత్వ మని నామాంతరము. దీని తారతమ్యముచేత నే మనుజులకు బలాబలతారతమ్యము కలుగుచున్నది. అట్టిరోజస్సునకు పదిగుణములు కలిగియున్నవి. విషము వానికి విపరీతములగు పదిగుణములుకలది గాన నోజోనాశనము చేసి మనుష్యుని చంపును. ఓజస్సునకుఁ గలపదిగుణము లెవ్వియనఁగా.

## ఓజస్సుయొక్క పదిగుణములు.

శ్లో. గురు స్నిగ్ధం చిరతరం పిచ్ఛిలం స్థిరమందకం,
ముకుళం స్థూలశీతం చ రసైస్సర్వై స్సమన్వితం.
ఓజోదశగుణోపేతం నరాణాం జీవకారణమ్. 47

భారముగలది, చమురుగలది, శాశ్వతమైనది, బుద్బుదములుగలది (అనఁగా: చిక్కగనుండునది.), కదలనిది, అగ్నిబలమును క్షీణింపఁ జేయునది, వ్యాపించనిది, బరువైనది, చల్లనివీర్యము కలది, సమస్తరసములు స్ఫుటముగాఁ గలది. ఇట్టిపదిగుణములు కలిగి రోజస్సు మనుజులకు జీవకారణమై యుండును. ఇందులకు విపరీతగుణములు విషమునకు కలిగియున్నవి.

| ఓజోగుణములు. | విషగుణములు. |
|---|---|
| 1. గురువు=భారమైనది. | 1. లఘువు=భారము లేనిది. |
| 2. స్నిగ్ధము=చమురు గలది. | 2. రూక్షము=చమురులేనిది. |
| 3. చిరతరము=శాశ్వతమైనది. | 3. ఆశుకరం=తత్ క్షణమే ప్రసరించునది. |
| 4. పిచ్ఛిలము=చిక్కగా నుండునది, జిగట గలది. | 4. విశదము=పలచగ తేలికగనుండునది. |
| 5. స్థిరము=కదలనిది. | 5. వ్యవాయి=వ్యాపించునది. |
| 6. మందము=అగ్నిబలమును క్షీణింపఁ జేయునది. | 6. తీక్ష్ణము=అగ్నిని జ్వలింపఁ జేయునది. |
| 7. ముకుళితము=వ్యాపింపనిది. | 7. వికాసి=వ్యాపించునది. |
| 8. స్థూలము=లావైనది. | 8. సూక్ష్మము=సూక్ష్మాకారముగలది. |
| 9. శీతలము=చల్లనివీర్యము గలది. | 9. ఉష్ణము=వేఁడిమిగలది. |

10. సర్వరసోపేతము=సర్వరసములు స్ఫుటము గలది. 10. అనిర్దేశ్యరసము=స్ఫుటముగాని రసముం గలది.

ఇట్లు ప్రాణధారణమునకు కారణములగు నోజోగుణములు పదింటికి విరుద్ధమగు పదిగుణములు విషమునకు కలిగియుండును. కావున నిది మనుజునిచంపుటకు కారణమై యున్నది.

## విషనివర్తకచతుర్వింశతిచికిత్సావివరణము.

శ్లో. మంత్రారిష్టోత్కర్తననిష్పీడనచూషణాగ్నిపరిషేకాః,
అవగాహరక్తమోక్షణవమనవిరేకోపధానాని, 48
హృదయావరణాంజననస్యధూమలేహౌషధప్రశమనాని,
ప్రతిసారణం ప్రతివిషం సంజ్ఞాసంస్థాపనం చ లేపశ్చ, 49
మృతసంజీవన మేవ చ వింశతి రేతా శ్చతుర్భి రభ్యధికా,
తా ఉపయుక్తా యత్ర చ యథా చ యోజ్యా శ్శృణోతు తావచ్మి.

1 మంత్రము, 2 అరిష్టము (సంస్కరింపంబడినతక్రము), 3 కోయుట, 4 పిడుచుట, 5 కర్ణమలాదులచే దూషింపఁజేయుట, 6 కాల్చుట, 7 అభిషేచనము, 8 స్నానము (అనఁగా: నీటిలో ముంచుట, లేక, బిందెలతో నెత్తినజలము పోయుట.) 9 జలూకాదులచే రక్తమును తీయించుట, 10 వమనము 11 విరేచనము, 12 కొన్నిటిని తలక్రింద పెట్టియుంచుట, 13 హృదయస్థకఫమునకు భంగము కలుగకుండునట్లు ఘృతపానాదికము, 14 అంజనము, 15 నస్యము, 16 ధూమపానము, 17 అవలేహనము, 18 ఓషధులను ధరింపించుట, 19 శమనౌషధముల నుపయోగించుట, 20 విషమును దింపునోషధుల నిచ్చుట, 21 విషమునకు ప్రతివిషము నిచ్చుట, 22 తెలివితప్పునట్లు చేయుట, 23 లేపము, 24 మృతసంజీవనము; ఇట్లు ఎక్కడెక్కడ నివి యుపయుక్తము లగునో యవి చెప్పుచున్నాను వినుము.

## విషదశగుణకార్యములు.

శ్లో. రౌక్ష్యా ద్వాత మశైత్యా త్పిత్తం సౌక్ష్మ్యా దసృ క్ప్రకోపయతి,
కఫ మవ్యక్తరసత్వా దన్నరసాం శ్చాతివర్తతే శీఘ్రం. 51
కించ వ్యవాయికత్వా దాశు వ్యాప్నోతి కేవలం దేహం,
తీక్ష్ణత్వా న్మర్మఘ్నంప్రాణఘ్నం చాపి తద్వికాసిత్వాత్. 52
దురుపక్రమం లఘుత్వా ద్వైశద్యా త్స్యాదశక్తిగతిదోషం,
దోషస్థానప్రకృతిః ప్రాప్య న్యతమం హృదం విదారయతి 53

సూక్ష్మమగుటచే వాతము నుద్రేకింపంజేయును. ఉష్ణమగుటచే పిత్తము నుద్రేకింపంజేయును. సూక్ష్మమగుటచే రక్తమును వ్యాపింపంజేయును. అవ్యక్తముగానిరసము గల్గ

దగుటచే కఫమును నుద్రేకింపంజేయును, రసములనన్నిటిని చెడఁగొట్టును.వ్యవాయి యగుటచే శీఘ్రముగ దేహమందంతటను వ్యాపించును. తీక్ష్ణమగుటచే మర్మములను పీడించును. వికాసియగుటచే ప్రాణములను పోఁగొట్టును. లఘువగుటచే చికిత్సచేయుట కశక్యమై యుండును. విశదమగుటచే నసాధ్యమైన శమనదోషములు (అనఁగా: వాతాదికమును.) స్థానమును, దేహమును, ప్రకృతులను చెఱిచి దేహమును కోయును.

## స్థానాంతరగతవిషకార్యములు.

గ. స్యాద్వాతికస్య వాతస్థానే కఫపిత్తలింగ, మీాషత్తు తృణ్మూర్ఛారుచి మోహగలగ్రహచ్ఛర్దిఫేనాదిపిత్తాశయస్థితం పైత్తికస్య, కఫవాతయోః ద్విషం తద్వత్ తృట్కాసజ్వరవమథుక్లమదాహతమోతిసారాది, కఫదేశగతం చ కఫస్య దర్శయే ద్వాతపిత్తయోః శ్చేత్తత్ లింగశ్వాసగలగ్రహకంఠూలాలావమథ్వాది. 54

వాతప్రకృతి గలవానికి వాతస్థానమందు చేరి కొంచెము కఫపిత్తలింగములుకలదై విషముండును. పిత్తప్రకృతిగలవానికి పిత్తాశయమును జెంది కఫవాతలింగములు కలదై దాహము, దగ్గు,జ్వరము, వమనము, మత్తిలి, కన్నులు చీఁకట్లు కప్పుట,అతిసారము అనునవి కలదై యుండును. కఫప్రకృతిగలవానికి కఫస్థానగతిమై కఫవాతపిత్తలింగములు కలదై శ్వాసము, గళగ్రహము, శరీరము, జిల, నోటజొల్లు, వమనము కలుగచేయును.

## విషాష్టవేగోపచారములు.

గ. దంశాత్తు విషం దష్ట స్యావిసృతం వేణికాం భిషగ్బధ్వానిష్పీడయే ద్భుశందంశముద్ధరేన్మర్మవర్జంవాతందంశంవాదూషీముఖేనయువచూర్ణపాంశుమూర్ణేనప్రచ్ఛన్నవేధజలూకాభ్యంగైస్రావ్యంతతో రక్తం రక్తేవిషప్రదుష్టేదుష్టే ప్రకృతిఃతత స్త్యజేత్ప్రాణాః. (?) 55

కాటుపైముందుగా కట్టుగట్టి రక్తమును పిండి వేయవలయును. మర్మస్థానమును విడిచిపెట్టి కాటును గీచి యెత్తివేయవలయును. యవచూర్ణము గాని, మట్టిదుమ్మును గాని నోటిలో వేసికొని యెంగిలితో తడిపి కాటుమీాఁద నుమ్మి వేయవలయును. జలగలచే రక్తమును స్రవింపఁజేయవలయును. రక్తము దూషితమైనయెడల ప్రకృతి దూష్యమగును. ప్రకృతి దూష్యమైనయెడల ప్రాణములు పోవును.

శ్లో. తస్మా త్ప్రాఘుర్షణై రసృగవర్తమానం ప్రవర్తనీయం స్యాత్,
త్రికటుగృహధూమరజనీపంచలవణచోరకైః (?) స్సవార్తాకైః.

ఘర్షణ మతిప్రవృత్తే వటాదిభి శ్చాపి శీతలై ర్లేపః,
ఏవం కృతే హి రక్తం విషయుక్తం సత్వరం బహి స్సరతి. 56

పైప్రకారములచే రక్తస్రావము కానియెడల గీరులచే స్రవింపంజేయవలెను. త్రికటుకములు, కరుదువ్వ, పసుపు, పంచలవణములు, చౌరీలవణము, వంకాయ వీనిచే గట్టిగా రాచినయెడల రక్తమువచ్చును. రక్తము హెచ్చుగా వచ్చినపిమ్మట వటాదులగు చల్లని పదార్థములచే లేపము చేయవలెను. విషముతో కూడియున్న రక్తము జాఱిపోవును.

అన్యత్.—

శ్లో. శీతై స్స్కందతి తస్మి న్స్కన్నే యాతి వ్యయం హి విషవేగః,
విషవేగా న్మదమూర్ఛావిషాదహృదయద్రవాః ప్రవర్తంతే.
శీతై శ్ఛిన్నర్తయే త్తా న్యానద్ధేహేతుగోమహర్ష స్స్యాత్,
తరు రివ మూలచ్ఛేదా ద్దంశచ్ఛేదా న్న వృద్ధి ముపయాతి. 57

రక్తము జాఱినట్లయిన విషవేగముతగ్గిపోవును. మదమూర్ఛావిషాదహృదయద్రవములు విషవేగముచే ప్రవర్తిల్లును. వానిని శీతలోపచారములచే రోమహర్షము కలుగువఱకు నుపచరించి పోఁగొట్టవలయును. మూలభేదముచే వృక్షమువలె దంశభేదముచే విషనాశన మగును.

## విషద్వితీయవేగోపచారము.

శ్లో. ఆదూషణ మానయనం జలస్య సేతు ర్యథా దిష్టః,
త్వఙ్మాంసగతో దాహో దహతి విషం స్రావణం హరతి రక్తాత్.
పీతం వమనై స్సద్యో హరే ద్విరేకై ర్ద్వితీయే తు,
ఆదౌ హృదయం రక్ష్యం తస్యావరణం పిబే ద్యథాలాభం,
మజ్జాపయోమధుఘృతం గైరిక మథ గోమయరసం వా. 58

మంటిపెళ్లను నమలి యెంగిలితో చిక్కగా పదనుచేసి గాయముమీఁద నుమ్మివేయుట జలమునకు సేతువువలె ప్రతిబంధక మగును. తోలుకాలి మాంసమువఱకు స్పృశించినకాల్పు విషమునుదహించును. స్రావమువలన రక్తమునుండి విషమునుజార్చును. పానము చేయఁబడినవిషమును ముందు వమనములచేతను, పిమ్మట విరేచనములచేతను, హరింపఁజేయవలెను. విషపీడితునకు ముందు హృదయమును రక్షింపవలయును. హృదయమునకు రక్షకమగునట్లు లభించినంతవఱకు మజ్జ, తేనె, పాలు, నెయ్యి, గైరికము, గోమయరసము, వీనిని పానము చేయింపవలెను.

అన్యచ్చ.—

శ్లో. ఇక్షుం సుపక్వ మథవా కాకం నిష్పిష్య తద్రసం వమయేత్,
ఛాగాదీనాం వాఽసృగ్భస్మ మృదం వా పిబేదాశు. 59

బాగుగ ముదిరిపండిన చెఱుకును తినవలయును. కాకిదొన్దనైనను తినవలయును. మేఁక మొదలగువాని రక్తమునైనను త్రాగవలయును. విభూతినిగాని మట్టిపెళ్లనుగాని నీటిలో కల్పి త్రాగవలయును.

—విషతృతీయవేగోపచారము.—

శ్లో. క్షారోదకం తృతీయే శోఫహారై ర్లేఖనం సమధ్వంబు,
గోమయరసం చతుర్థే వేగే సకపిత్థమధు పిబేత్సర్పిః,
కాకాండశిరీషాభ్యాం స్వరసే నాశ్చ్యోతనాంజనే నస్యమ్. 60

మూఁడవ వేగమునందు క్షారముచే, మధూదకయుక్తములైన శోఫహారములగు ద్రవ్యములచే లేఖనక్రియలను చేయవలయును. (లేఖనము అనఁగా: లోపలనుండు దోషములను గీచివేయునట్టి చికిత్సాశోధన విశేషమని తెలియవలెను.) చతుర్థవేగమునందు గోమయరసము, వెలగపండుతో కూడిన తేనె, నెయ్యి, వీనిని త్రాగింపవలెను. కాకిగ్రుడ్లలోని రసము (జన), శిరీష రసము, వీనిచేత నేత్రప్రాణాంజనములను నస్యమును చేయింపవలెను

—పంచమషష్ఠవేగోపచారములు.—

శ్లో. స్యాత్పంచమేఽథ షష్ఠే సంజ్ఞాసంస్థాపనే క్రమాత్కార్యే,
గోపిత్తయుక్త రజనీ మంజిష్ఠా మరిచ పిప్పలీపానం.
విషపానం దష్టానాం విషపీతే దంశనం వాంతే,
శిఖివిత్తార్థయుతం స్యాత్పలాశబీజం మృతోఽప్య మృతః. 61

పంచమషష్ఠవేగములందు గోపిత్తము, పసుపు, మంజిష్ఠి, మిరియాలు, పిప్పళ్లు, వీనిని కషాయము చేసి సంజ్ఞాసంస్థాపనములైన పిమ్మట పానము చేయించవలెను. కఱవఁబడిన జంగమవిషార్తునకు స్థావరవిషపానమును, స్థావరవిషార్తునకు జంగమవిషదంశనమును ప్రాణరక్షకములు. మోదుగవిత్తులచూర్ణమును నెమలిచేఁదులో కలిపి పుచ్చుకొనుట యమృతపానమగును. చచ్చినవారు కూడ బ్రతికెదరు.

—విషసప్తమాష్టమవేగోపచారములు.—

శ్లో. వార్తాకఫాణితాగారధూమగోపిత్తనింబుకం,
గోపిత్తమర్దితం కృత్వా గుళికాః కారయే ద్బుధః.
సురసాగ్రంధీ రజనీద్వితయం మధుకం చ కుష్ఠకంచాపి,
పిష్ట్వా శిరీషపుష్ప స్వరసైర్వా వాయసాండకరసైర్వా.

కాకాండసురసాగవాక్షీపునర్నవావాయసీశిరీషఫలైః,
ఉద్బుద్ధవిషజలమృతే లేపౌషధనస్యపానాని. 62

వంకాయ, కలకండ, కరిదూపము, అవుచేదుకట్టు, వేపవేరు అనునవి అవుచేఁదుతో నూఱి మాత్రలు చేసియైనను, తులసివేరు, గ్రంధితగరము, కూరపసుపు, మానిపసుపు, అతిమధురము, చెంగల్వకోష్టు అనునవి దిరిసెనపువ్వులరసముతోను, కాకిగుడ్లజినతోను నూఱి మాత్రలు చేసియైనను, తులసివేరు, పిన్నపాపరవేరు, తెల్లగజ్జెరువేరు, గురిజవేరు, దిరిసెనపుకాయలు, వీనిని కాకిగుడ్లజినతో నూఱి మాత్రలుఁ చేసియైన నుంచుకొని, విషముచే చచ్చినవారికి, ఉరిపెట్టుకొని చచ్చినవారికి, నీటిలో పడి చచ్చినవానికి లేపనము, నస్యము చేయించిన స్మృతి కలుఁగును. పిమ్మట నీయౌషధమునే పానము చేయిఁచిన యెడల నిస్సంశయముగ బ్రతికెదరు.

## శంకావిషలక్షణము.

శ్లో. స్పర్శా ద్భీరో ర్భుజంగస్య భవే ద్వాతః కదాచన,
కురుతే కుపిత శ్శోఫం సర్వాంగాభిహతాహ్వయం,
ధ్వాంతే కేనాపి దష్టస్య సర్పదంశభ్రమా ద్భవేత్, 63
దాహమూర్ఛాజ్వరచ్ఛర్దిగ్లానిమోహాతిసారకృత్,
శంకావిష మితి ఖ్యాతం విషోద్వేగప్రదాయకం. 64

భయస్వభావము గలవానికి సర్పస్పర్శమువలన వాతము కుపితమై యొకానొక సమయమందు శోఫము కలుగఁజేయును. దానికి సర్వాంగాభిహత మని పేరు. దుర్గమమగు నంధకారమునందు దేనిచేతనైన కఱవఁబడినవానికి పాముకాటుశంకచే విషభయము, జ్వరము, ఛర్ది, మూర్ఛ, దాహము, ఆయాసము, తెలివితప్పుట, అతిసారము ఈగుణములలో కొన్నిగాని అన్నియుఁగాని కలుగును. దీనినే శంకావిషమని చెప్పెదరు.

## దూషీవిషలక్షణము.

శ్లో. ప్రాగ్వాతాజీర్ణశీతాభ్రదివాస్వప్నాహితాశనైః,
దుష్టం దూషయతే ధాతూ నతో దూషీవిషం స్మృతమ్. 65

పురోవాత అజీర్ణ శీత మేఘ దివాస్వప్న అహితాహార విహారములచే దూషింపఁబడినదై, కారణాంతరములచే బయల్పడకుండిన మందవీర్యబహుకాలభుక్తవిషము, నిష్కారణముగ తత్క్షణము ద్రేకించి ధాతువుల దూషింపఁజేయును. ఈకారణములచే నిది దూషీవిష మనఁబడును.

అన్యచ్చ.—

శ్లో. దూషీవిషం తు శోణితదుష్టకిటిభకోఠాదిరక్తలింగం చ(?). 66

శోణితదోషముచే దుష్టమైన దద్దురులు, పొడలు, మొదలైన రక్తచిహ్నములు గలిగిన దూషీవిష మని తెలియవలయును.

అన్యచ్చ.—

శ్లో. జీర్ణం విషఘ్నౌషధిభి ర్హతంవా
దావాగ్నివాతాతపశోషితం వా,
స్వభావతో వా స్వగుణై ర్వియుక్తం
దూషీవిషాఖ్యాం విష మభ్యుపైతి. 67

విషము జీర్ణమైనను, విషఘ్నౌషధములచేఁ గొట్టఁబడినదైనను, దావాగ్నివాతాతపములచే నెండింపంబడినదైనను, స్వభావముచేతనే దుర్బలమైనదైనను, దూషీవిష మని చెప్పఁబడును. (మరణము కలుగచేయక దేహమునందు దౌర్బల్యము కారణముగ దాఁగి యున్నవిషము దూషీవిషమని తాత్పర్యము.)

అన్యచ్చ —

శ్లో. వీర్యాల్పభావా దవిభావ్య మేత త్కఫావృతం వర్షగణానుబంధి,
తేనార్దితో భిన్నపురీషవర్ణో దుష్టాస్రరోగతృడరోచకార్తః. 68

దూషీవిషము దుర్బలమైన దగుటచే నూహింప శక్యము కాదు. అనేకసంవత్సరము లనుబంధించి యుండును. దీనిచే పీడింపఁబడిన మనుష్యుఁడు విరేచనబంధము కలవాఁడును, శరీరకాంతి చెడినవాఁడును, దుష్టరక్తరోగము కలవాఁడును, దాహముచేతను, అరుచిచేతను పీడింపఁబడినవాఁడును నై యుండును. ఈలక్షణములు గలవానిని దూషీవిషార్తుఁడని తెలియవలెను.

## దూషీవిషచికిత్స

శ్లో. దూషీవిషార్తం సుస్విన్నమూర్ధ్వం చాధశ్చ శోధితం,
దూషీవిషారి మగదం లేహయే న్మధునా ప్లుతం, 69
పిప్పలీ ధ్యామకం మాంసి లోధ్ర మేలా సువర్చికా,
కుటన్నటం నతం కుష్ఠం యష్టిచందన గైరికం,
దూషీవిషారినామాఽయం నేద మన్యేన వార్యతే. 70

దూషీవిషార్తుఁ డగుమనుష్యుని చెమట కలుగునట్టుచేసి వమనవిరేచనములను చేయించి దూషీవిషాంతకమగు నౌషధమును తేనెలో ముంచి సేవింపచేయవలయును. పిప్పళ్లు, కామంచిపూరి, జటామాంసి, లొద్దుగచెక్క, ఏలకులు, సురేకారము, తుంగగడ్డలు, గ్రంధితగరము, కోష్ఠు, అతిమధురము, చందనము, కావిరాయి ఇవి చూర్ణించి తేనెతో కలిపి సేవించిన దూషీవిషము శమించును.

అన్యచ్చ.—

శ్లో. కృత్వా కుర్యా త్కటభీం కటుకోటఫలాప్రధమనం చ,
ఘ్రాణాక్షికర్ణజిహ్వాకంఠసిరోధేషు కర్మన స్తః. 71

వెక్కుడుతీగె, కటుకరోహిణి, పెద్దబీర, వీనికషాయము గాని చూర్ణమును గాని సేవించిన ముక్కు, కన్నులు, చెవులు, నాలుక, కంఠము, వీనియందు కలిగిన నిరోధము శాంతించును.

శ్లో. దూషీవిషేఽథ రక్తస్థితే సిరాకర్మ పంచవిధం,
శ్లేష్మజ మేవం కల్ప్యం భిషగ్విదా సర్వదా లక్ష్యం. 72
స్థానజయేనచపూర్వం స్థానస్థస్యావిరుద్ధం చ,
విషదూషితకఫమార్గః స్రోతస్సంరోధరుద్ధవాయుశ్చ. 73
మృతయివ చేన్మర్త్యః స్యా దసాధ్య లింగై ర్విహీనశ్చ,
చర్మకషాయాః కల్కం బిల్వసమం మూర్ధ్ని కాకపద మస్య. 74

దూషీవిషము రక్తగతమై స్రోతోమార్గముల నడ్డగించి శ్లేష్మాధిక్యమును కలుగఁజేసినప్పుడు అయిదువిధములైన రక్తమోక్షణోపాయముల నాచరించి పిమ్మట మారేడుపట్ట, పుల్లవెలగపట్ట, కషాయము చేసి త్రాగించినట్లైన మరణాసన్నుఁడైన దూషీవిషరోగి సైతము నిశ్చయముగ జీవించును.

### దిగ్ధవిషలక్షణము.

శ్లో. విషదిగ్ధేన విద్ధస్తు ప్రతామ్యతి ముహుర్ముహుః,
వివర్ణభావం భజతే విషాదం చాశు గచ్ఛతి. 75
క్లైరి వావృతం చాస్య గాత్రం చిమచిమాయతే,
శ్రోత్రపృష్ఠశిరస్కంధ సంధయస్స్యుస్సవేదనాః. 76
కృష్ణదుష్టాస్రువిస్రావి తృష్ణామూర్ఛాజ్వరదాహవాన్,
దృష్టికాలుష్యవమథుశ్వాసకాసకరః క్షణాత్. 77
ఆరక్తపీతపర్యంతః శ్యావమధ్యోతిరుగ్వ్రణః,
శూయతే పచ్యతే సద్యో గత్వా మాంసం చ కృష్ణతాం. 78
ప్రక్లిన్నం శీర్యతేఽభీక్ష్ణం సపిచ్ఛిలపరిస్రవం,

దిగ్ధవిషమనఁగా విషలిప్తమైనశస్త్రములయొక్క గాయములలో ప్రవేశించిన విషమునకు పేరు. ఈవిషదష్టుఁడు మాటిమాటికిని వాడిపోవును. వివర్ణతను బొందును. దుఃఖితుఁ డగును. శరీరము పురుగులచే నావృతమైనటువలె చిమచిమ మనును. శ్రోణి, పృష్ఠము, శిరస్కంధములు, సంధులు, వీనియందు వేదన గలుగును. వ్రణమునుండి

నల్లనిదుష్టమైనరక్తము, దాహము, మూర్ఛ, జ్వరము, తృష్ణ, దృష్టిభంగము, వాంతి, శ్వాస, కాస కలుగును. రక్తపీతశ్యామలవర్ణములు గలపీడతో గూడుకొనినవ్రణములు కలుగును. తత్క్షణమే కాని పక్షము, మాసము జరిగినపిమ్మటఁగాని మచ్చలతోఁ గూడిన దేహము కలవాఁడగును. ద్రవమై మాంసము నశించుచుండునట్లు చేయును.

### దిగ్ధవిషచికిత్స.

శ్లో. కుర్యా దమర్మవిద్ధస్య హృదయావరణం ద్రుతం. 79
శల్య మాకృష్య తప్తేన లోహేనాథ దహేద్వ్రణం,
అథవా ముష్కకశ్వేత సోమత్వక్తామ్రవల్లిచ. 80
శిరీషార్గ్లధ్రనఖ్యాశ్చ క్షారేణ ప్రతిసారయేత్,
శుకనాసా ప్రతివిషా వ్యాఘ్రీమూత్రైశ్చ లేపయేత్. 81
కీటదష్టచికిత్సాం చ కుర్యాత్తస్య యథార్హతః,
వ్రణేతు పూతిపిశితే క్రియా పిత్తవిసర్పవత్. 82

మర్మమునువిడిచి తక్కినస్థలములయందు విషదిగ్ధబాణముచే కొట్టఁబడినవానికి హృదయరక్ష (అనఁగా ఘృతపానాదికము) ముందుగా చేయవలెను. శల్యమును తీసివేసి వ్రణమును తప్తమైన ఇనుముతో దహింపవలయును. ముక్కపు (ముష్కమనెడి) చెట్టువేరు, తెల్లపుల్లతీఁగె, తమలపాకుతీఁగె, దిరిసెనపుపట్ట, గద్దగోర్లు, వీనిని కాల్చి అందలి క్షారమును దీసి పట్టింపవలయును. దుండిలపువేరు, అతివస, వాకుడువేరు, ఇవియైనను నీటితో నూఱి పట్టింపవలయును. వీనినే కీటకదంశములయందును ఉపయోగింపవలయును. దుర్గంధము గలమాంసముతోఁ గూడినవ్రణమునకు పిత్తవిసర్పమునకువలె చికిత్స చేయవలెను.

### ప్రయోగవిషలక్షణము.

శ్లో. సౌభాగ్యార్థం స్త్రియో భర్త్రే రాజ్ఞే వారాతిచోదితాః,
గరమాహారసంపృక్తం యచ్ఛంత్యాసన్నవర్తినః. 83
నానాప్రాణ్యంగశమల విరుద్ధౌషధిభస్మనాం,
విషాణాం చాల్పవీర్యాణాం యోగో గర ఇతి స్మృతః. 84
తేన పాండుః కృశోఽల్పాగ్నిః కాసశ్వాసజ్వరార్దితః,
వాయునా ప్రతిలోమేన స్వప్నచింతాపరాయణః. 85
మహోదరయకృత్ప్లీహీ దీనవాగ్దుర్బలోఽలసః,
శోఫవాన్ సతతాధ్మాతః శుష్కపాదకరక్షయీ. 86
స్వప్నే గోమాయుమార్జార నకులవ్యాళవానరాన్,

ప్రాయః పశ్యతి శుష్కాంశ్చ వనస్పతి జలాశయాన్. 87
మన్యతే కృష్ణ మాత్మానం గౌరో గౌరం చ కాలకః,
వికర్ణ నాసానయనం పశ్యే త్తద్విహతేంద్రియః. 88
ఏతై రన్యైశ్చ బహుభిః క్లిష్టో ఘోరై రుపద్రవైః,
గదార్తో నాశ మాప్నోతి కశ్చి త్సద్య శ్చికిత్సితః. 89

స్త్రీలు భర్తృవశ్యమునకుఁగాని, శత్రుప్రేరితులు రాజునకుగాని, దగ్గరనుండు వారు ఆహారములోఁ గలిపి విషములను పెట్టెదరు. అనేకప్రాణులచేతను, ఉపమలములచేతను, విరుద్ధమైన ఓషధులచేతను, భస్మములచేతను, మందవీర్యములగు విషములచేతను, తయారుచేయఁబడినది గర మని చెప్పఁబడును. దానిచే మనుష్యుఁడు తెల్లఁబడి చిక్కిపోయి మందాగ్నికలవాఁడై, కాసశ్వాసజ్వరములచే పీడింపఁబడుచు, ప్రతికూలమగు వాతముచే స్వప్నచింతాపరాయణుఁడై, యుదరము పెరిగి యకృత్ప్లీహబాధితుఁడై, దీనవాక్కులు గలవాఁడై, బలముతగ్గి అలసుఁడై, శరీరము వాచి కడుపుబ్బి(అధ్మానించి) కాలుసేతు లెండి క్షయరోగము కలవాఁడై, స్వప్నమందు నక్క, పిల్లి, ముంగిస, పాములు, కోఁతులు, ఎండినచెట్లు, ఎండినపొలములు చూచుచుండును. తెల్లనివాఁడు తనను నల్లనివానిఁగాను, నల్లనివాఁడు తెల్లనివానిఁగాను దలఁచును. ఇంద్రియపటుత్వము తగ్గి, తనకు ముక్కు, చెవులు, కన్నులు, లేనట్లు భ్రాంతి పడును. ఇవియు మఱికొన్నియు నగునుపద్రవములచే పీడితుఁడై యొకానొకఁడు తత్క్షణము చికిత్స చేయించుకొని స్వస్థుఁడగును ఈవిషము వస్తుసంయోగబలము ననుసరించి చిరకాలమునకు కూడఁ జంపును. ఒకానొకప్పుడు చంపక, శోపపాండు, ఉదర, ఉన్మాద, అర్శః ప్రభృతిరోగములను కలుగఁజేయును.

## గరవిషచికిత్స.

శ్లో. గరార్తో వాంతవాన్ భుక్త్వా తత్పథ్యం పానభోజనం,
శుద్ధహృ చ్ఛిలయే ద్ధేమసూత్రస్థానవిధిం స్మరన్. 90
శర్కరామాద్రసంయుక్తం చూర్ణం తామ్రసువర్ణయోః,
లేహః ప్రశమయ త్యుగ్రం సర్వయోగకృతం విషం. 91

గరపీడితుఁడు వమనము చేయించుకొని పథ్యమైన పానమును భోజనమును సేవించుచు శుద్ధమైన హృదయము గలవాఁడై, సూత్రస్థానములోఁ జెప్పినప్రకారము బంగారము నభ్యసింపవలయును. తామ్రముయొక్కయు సువర్ణముయొక్కయు భస్మమును శర్కరతోను తేనెతోను కలిపి నాకుచుండినయెడల నది సమస్తగరములను నశింపజేయును.

అన్యచ్చ.—

శ్లో. మూర్వామృతా నతకణా పటోలీచవ్యచిత్రకాః,
వచాముస్తవిడంగాని తక్రం కోష్ణాంబుమస్తుభిః,
పిబేద్రసేనవాఽమ్లేన గరోపహతపావకః. 92

చాగగడ్డలు, తిప్పతీఁగ, గ్రంధితగరము, పిప్పళ్లు, చేదుపొట్ల, చవ్యము, చిత్రమూలము, వస, తుంగగడ్డలు, వాయువిళంగాలు వీనిని చూర్ణించి మజ్జిగలోఁ గాని కించిదుష్ణోదకముతో గాని పెరుగుమీఁది నీళ్లతోఁ గాని పుల్లనిరసముతోఁ గాని త్రాగినట్లయిన గరవిషము నశించును.

అన్యచ్చ.—

శ్లో. పారావతామిషశఠీ పుష్కరాహ్వం శ్రుతం హితం,
గరతృష్ణారుజాకాస శ్వాసహిధ్మాజ్వరాపహం. 93
విషప్రకృతికాలాన్న దోషదూష్యాదిసంగమే,
విషసంకట ఉద్దిష్టం శతస్యైకో త్ర జీవతి. 94
క్షుత్తృష్ణోకర్మ దౌర్బల్య క్రోధశోకభయాశ్రమైః,
అజీర్ణవర్చోద్రవతః పిత్తమారుతవృద్ధిభిః. 95

పావురాయిమాంసము, తక్కోలాలు, పుష్కరమూలము, వీనికషాయము గరము, జ్వర, కాస, శ్వాసములను పోగొట్టును. విషము అందుకు తగినదే. ప్రకృతి, కాలము, దూష్యము, రసరక్తాదికము ఇవియన్నియు చేరినయెడల విషసంకట మని పేరు. అందులో నూటికొకఁడు బ్రతుకును. ఆకలి, దప్పి, వేఁడిమి, నిస్సత్తువ, కోపము, దుఃఖము, భయము, ఆయాసము, అజీర్ణవిరేచనము, వాతపిత్తోద్రేకము ఇవి ప్రాణాపాయమునకు కారణము లగును.

### స్థానాంతరగతవిషవేగచికిత్సాక్రమము.

శ్లో. ఇతిప్రకృతిసాత్మ్యర్తు స్థానవేగబలాబలం,
ఆలోచ్య నిపుణం బుద్ధ్యా కర్మానంతర మాచరేత్. 96

ఇట్లు ప్రకృతి, సాత్మ్యము, ఋతువు, స్థానము, వేగము, వీనిబలాబలములను నిపుణముగ యోచించి పిమ్మటనే చికిత్స నారంభింపవలెను.

### శ్లేష్మస్థానగతవిషస్వరూపోపచారము.

శ్లో. శ్లైష్మికం వమనై రుష్ణరూక్షతీక్ష్ణైః ప్రలేపనైః,
కషాయకటుతిక్తైశ్చ భోజనై శ్శమయే ద్విషం. 97

శ్లేష్మస్థానగతమైనవిషమును వమనము, ఉష్ణము, రూక్షము, తీక్ష్ణము అయిన లేపనములవల్లను, ఒగరు, కారము, చేదుగల భోజనాదులవల్లను, విషమును శమింపఁ జేయవలెను.

## పిత్తస్థానగతవిషోపచారము.

శ్లో. భోజనై ర్ఘృతసంయుక్తై స్తిక్త స్స్వాదుకషాయకైః,
శీతలై శ్శైకలేపైశ్చ పైత్తికం నిర్హరేద్విషం 98

చేదు, తీపి, ఒగరుగల భోజనద్రవ్యములతో నెయ్యిని చేర్చి సేవింపచేయుచు చల్లనిసేకములు, పట్లు మొదలైనవానివలనను పిత్తస్థానగతవిషము హరించును.

## వాతస్థానగతవిషోపచారములు.

శ్లో. స్వాదుస్నిగ్ధామ్లలవణై ర్భోజనై ర్ఘృతసంయుతైః,
మాంసాశనై స్తథా లేపై ర్వాతికం నిర్హరేద్విషం. 99

మధురము, జిడ్డు, పులుసు, ఉప్పు, రసములు గలభోజనపదార్థములను నెయ్యి, మాంసము, అనువానితో భుజింపఁజేయుచు విషహరమైనలేపనముల నుపయోగించిన యెడల వాతస్థానగతమైనవిషము హరించును.

## సర్వస్థానగతవిషోపచారములు.

శ్లో. విష స్యోపక్రమ స్సర్వో న ప్రశస్తో ఘృతం వినా,
సమస్తా స్వ ప్యవస్థాసు వాయౌ ముఖ్యం విశేషతః. 100

ఘృతములేనిస్రంసనము గాని, లేపముగాని, తింతగినయౌషధము గాని ప్రశస్తము కాదు. అన్నివిషయములలో నన్ని అవస్థలయందు ఘృతముతో సమమైన యౌషధము లేదు. విశేషించి వాతస్థానగతమైనవిషమునకు ముఖ్యమని తెలియవలెను.

## స్థానాంతరగతసాధ్యాసాధ్యవిషములు.

శ్లో. సుసాధ్యం శ్లేష్మికం ప్రోక్తం యత్నసాధ్యం చ పైత్తికం,
కృచ్ఛ్రసాధ్య మసాధ్యం వా వాతికం విష ముచ్యతే. 101

యత్నములేకయే శ్లేష్మికవిషమును సాధింపవచ్చును. పైత్తికవిషమును ప్రయత్నముచే సాధింపవచ్చును. వాతస్థాన విష మత్యంతకష్టసాధ్యము. అసాధ్యము నని తెలియవలెను.

## ఆశయగతవిషరోగహేతువులు.

శ్లో. మూర్ఛా స్వమః గద్గదవాగ్విముహ్యేత్
భవే చ్చ దూష్యోదరలింగజుష్టః,
ఆమాశయస్థే కఫవాతరోగీ పక్వాశయస్థే ఉసిలపిత్తరోగీ. 102

విష ముదరమందు ప్రవేశించి దూష్యమైనచో మూర్ఛ, వమనము, గద్గదస్వర మేర్పడును. ఆమాశయగతమైనచో వాతరోగి యగును. పక్వాశయగతమైన వాతపిత్త రోగి యగును.

## ధాతుగతవిషలక్షణము.

శ్లో. భవే న్నరో ధ్వ స్తశిరోరుహాంగో విలూనపక్షః సయథా విహంగః,
స్థితం రసాదిష్వథవా విచిత్రాన్ కరోతి ధాతుప్రభవాన్ వికారాన్.

విషము రసాదిధాతులయందు చేరియున్నైన బొచ్చుఊడిపోయి ఱెక్కలు విఱిగినపక్షివలె నెత్తిబొచ్చు ఊడిపోయి అంగశైథిల్యమేర్పడి ధాతుగతవికారములు కలుగును.

## చికిత్సావిధము.

శ్లో. మంత్రై ర్ధరణీబంధావమార్జనం కార్యమాత్మరక్షా చ,
దోషస్య విషం యస్య స్థానే స్యా దం జయే త్పూర్వం. 104

దోష మేస్థానగతమై యున్నను, ముందుగ కన్నుల కంజనము వేసి, మణిమంత్రపథతీర్థస్నానరక్షాబంధనములు చేయవలయును.

## త్రిదోషస్థానగతవిషోపచారము.

శ్లో. వాతస్థానే స్వేదో దధ్నా నతకుష్ఠే కల్కపానం చ,
పానావగాహసేకాశ్చ పిత్తస్థే,
క్షారాగదః కఫస్థాన గతే స్వేద స్తథాసిరోవేధః. 105

విషము వాతస్థానగతమైనచో స్వేదాపచరణ మాచరించి, గ్రంధితగరము, చెంగల్వకోష్టు, పెరుగుతో నూఱి కల్కము చేసి త్రాగింపవలెను. జలపానము, స్నానము, జలసేకము, పిత్తస్థానగతమైన విషమున కుపచరింపవలయును. కఫస్థానగతమైనవిషమునకు స్వేదకర్మ, సిరావేధ, క్షారౌషధసేవయును చేయించవలెను.

## విషగ్రస్తుల జ్వరాదిచికిత్స

శ్లో. ఋషభక జీవకభార్గీ మధుకోత్పలధాన్య కేసరాజాజ్యాః,
ససితగిరికోలమజ్జాః పేయా శ్వాసజ్వరాదిహరాః. 106

ఋషభకము, జీవకము, గంటుభారంగి, అతిమధురము, కలువగడ్డ, ధనియాలు, నాగకేసరములు, జీలకఱ్ఱ, అడవిరేగుపండ్లవిత్తులలోనిపప్పు, ఇవిగంజికాచి అందులో చక్కెర కల్పుకొని పుచ్చుకొనుచుండిన విషగ్రస్తులకు శ్వాస, జ్వరములు, హరించును.

అన్యచ్చ.—

శ్లో. హింగు చ కృష్ణాయుక్తం కపిత్థరస మగ్ర్యలవణం చ,
సమధుసితః పాతవ్యో జ్వరహిక్కాశ్వాసకాసహా శ్లేషాః. 107

ఇంగువ, పిప్పళ్లు, వెలగపండుగుజ్జు, సైంధవలవణం, ఇవిచూర్ణించి, తేనె, చక్కెరతో లేహము చేసి పుచ్చుకొనినట్లైన విషార్తులకుగల, జ్వరము, ఎక్కిళ్లు, దగ్గు, ఆలత నెమ్మదించును.

→ విషగ్రస్తులకు ధూపౌషధచికిత్స. ←

శ్లో. కోలాస్థ్యంజనలాజోత్పలమధుఘృతై ర్వమూర్వాం,
బృహతీద్వయాఢకీపత్ర ధూపవర్తిస్తు హిక్కాఘ్నీ. 108

రేగువిత్తులలోనపప్పు, సుర్మారాయి, వరిపేలాలు, కలువదుంప, తేనె, ఘృతము, ములక, వాకుడు, కందిఆకులు, ఇవి నూరి వత్తిగాచేసి ధూపము వేసినట్లయిన విషార్తులకు కలిగెడుయెక్కిళ్లు నెమ్మదించును.

అన్యచ్చ.—

శ్లో. శిఖిబర్హా బలాకాస్థీని సర్షపాశ్చందనే చ ఘృతయుక్తం,
ధూమో గృహశయనాసనవస్త్రాదిషు శస్యతే విషనుత్. 109

నెమలియీకెలు, తెల్లకొంగయెముకలు, ఆవాలు, చందనము, ఇవి నూరి నేతిలో కలిపి యింటియందును, పడకలకును, కూర్చుండు పీటలకును, ధరించువస్త్రములకును పొగ వేసినట్లైన విషము హరించును.

అన్యచ్చ.—

శ్లో. ఘృతయుక్తే నతకుష్ఠే భుజగపతిశిరః శిరీషపుష్పం చ,
ధూమాగద స్స్మృతోఽయం సర్వవిషఘ్నః శ్వయథుహృచ్చ. 110

గ్రంథితగరము, కోష్టు, త్రాచుపాముతల, దిరిసెనపుపువ్వులు, ఇవి చూర్ణించి నేతిలో కలిపి పొగవేసినట్టయిన సమస్తవిషబాధలును హృదయశోభము హరించును.

అన్యచ్చ.—

శ్లో. జతుశ్వేతపత్ర గుగ్గులుభల్లాతక కకుభపుష్పసర్జరసాః,
శ్వేతా ఏవ వధూమఉరగాఖుకీటవస్త్రక్రిమినుదగ్ర్యః. 111

లక్క, మిరియపుతీగె ఆకు, తెల్లగుగ్గిలము, జీడిగింజలు, మద్దిపువ్వులు, ఏపెబంక, జాజిపువ్వులు, ఇవి సమాంశములు చూర్ణించి పొగవేసినట్లైన పాము, ఎలుక, విషపురుగులు, చీరపేలు, మొదలైనవానివిషములు హరించును.

## విషవ్యాపకలక్షణము.

శ్లో. విష మేకైకం దోషం సందూష్య హరత్యసూ నేవం,
క్షరతి విష తేజసాసృకతితభాని నిరుధ్య మారయతి జంతూన్. 112
శీతం మృతస్య హృది దష్టవిద్ధయో ర్దంశదేశే స్యాత్,
నీలౌష్టదంతశైథిల్య కేశపతనాంగభంగవిక్షేపాః. 113
శిశిరై ర్న లోమహర్షో నాభిహతే దండరాజీ చ,
క్షతజం క్షతాచ్చ నాయా త్యేతా న్యేతాని మరణలింగాని. 114
ఏభ్యోఽన్యథా చికిత్స్యం తేషాం శ్లోపక్రమాన్ శృణు మే,

ప్రతివిషము వాతపిత్తకఫములను దూషింపఁ జేసి ప్రాణములను హరించును. విషప్రతాపముచే రక్త మొక్కొక్క స్థలమునకు జాఱిపోవును. అది స్రోతోమార్గ ముల నరికట్టి ప్రాణులను చంపును. విషము త్రాగి చచ్చినవానికి హృదయమునందు విషము నిలిచి హృదయచలనము నాపి వేయును. కాటుచేఁ జచ్చినవానికి విషము కాటునందే నిలుచును. పెదవులు నల్ల నగును. దంతములుశిథిల మగును. రోమములు రాలి పోవును. అవయవములు విఱిగి పోవుచున్నట్లుండును. తలత్రిప్పు కలుగును. ఎంత శైత్యోపచారములు చేసినను రోమాంచ మంకురింపక యుండును. దెబ్బ కొట్టిన దేహమునందు దద్దుకట్టదు. కోసినను కోసినతావునుండి విషము రాకపోవును. ఇవి మరణచిహ్నములు. ఇవి లేకుండినయెడల చికిత్స చేయవచ్చును.

## పశుపక్ష్యాదులకు విషవేగలక్షణము.

శ్లో. వేగాన్ చతుష్పదాదీనాం స్యా చ్చతుర్విధః పక్షిణాం త్రివిధాః. 115
సీద త్యాశ్వాసేన హి చతుర్థే ధ్యాయతి విహగః ప్రథమే వేగే
ప్రభ్రామ్యతి ద్వితీయే, స్రస్తాంగశ్చ తృతీయే విషవేగే యాతి
పంచత్వం. 116

చతుష్పాజ్జంతువులకు విషవేగము నాలుగువిధములుగ నుండును. పక్షులకు మూఁడువిధములుగ నుండును. మృగములు ప్రథమవేగములో కంపించును. రెండవ వేగములో మైకము కలుగును. మూఁడవవేగములో నాహారము గ్రహింపదు. నాలుగవవేగములో శ్వాసాధిక్యమై మృతినందును. పక్షులు ప్రథమవేగములో ధ్యానిం చును. ద్వితీయవేగములో పరిభ్రమణమును చెందును. తృతీయవేగములో స్రస్తాంగ ములై చచ్చును.

### విషవృద్ధిహేతువులు

శ్లో. తిలపుష్పఫలాఘ్రాణభూబాష్పఘనగర్జితైః,
హస్తిమూషికవాదిత్రనిస్వనైర్విషసంకటైః. 117
పురోవాతోత్పలామోదమదనైర్వర్ధతే విషం,

నువ్వుపువ్వులను, కాయల నాఘ్రాణించుటవలనను, తొలకరివర్షములకు వేచెడు భూమియావిరివలనను, ఉరుములవలనను, గజగర్జితములవలనను, మూషికములవలనను, భేరీభాంకరణాదిధ్వనులవలనను, విషసంకటములవలనను, తూర్పుగాలివలనను, వసంతాగమమువలనను, విష ముద్రేకించి మనుజుల చంపు నని తెలియవలెను.

### విషక్షైణ్యహేతువులు.

శ్లో. సర్పత్యంబుధరాపాయే తదగస్త్యో హి న స్తి చ. 118
ప్రయాతి మందవీర్యత్వం విషం తస్మాద్ఘనాత్యయే,

వర్షఋతువు గడచినపిదప శరదృతువునందు అగస్త్యనక్షత్ర ముదయించును. అప్పుడు దానిప్రకాశమువలన ప్రపంచమునందు గలస్థావరజంగమకృత్రిమాది విషము లల్పవీర్యములై క్షీణించును.

### స్థావరజంగమవిషముల కత్యద్భుతచికిత్స.

శ్లో. జంగమం స్యా దధోభాగ మూర్ధ్వభాగం తు మూలజం. 119
తస్మా ద్దంష్ట్రవిషం మూలా ఘ్నంతి మూలం చ దంష్ట్రజమ్,

జంగమవిషము క్రిందినుండి పైకెక్కును. స్థావరవిషము పైనుండి క్రిందికి ప్రాకును. గావున సర్పదష్టుని వత్సనాభి తినిపించినను, స్థావరవిషార్తునకు పాముచే కఱపించినను విషఅన్యోన్యయుద్ధమువలన విషశాంతియై యారోగ్యము కలుగును.

### సమస్తవిషహారులగు పక్షులు.

శ్లో. ఖగాశ్చ శారికాక్రౌంచశిఖిహంసశుకాదయః. 120
జంగమస్థావరవిషాన్ హరంతి చ న సంశయః,

గోరువంకలు, కొంగలు, నెమళ్లు, హంసలు, చిలుకలు, అనునీపక్షులయొక్క స్పర్శాలింగనాదులవలన స్థావరజంగమవిషములు నశించును.

### విషహారమణులు, మూలికలు.

శ్లో. వజ్రం మరకతం సారం పిచుకో విషమూషికా. 121
కర్కేతనం మణి స్సర్పా ద్వైడూర్యగజమౌక్తికం,
ధార్యం గరమణి ర్యాశ్చ వరౌషధ్యో విషాపహాః. 122

వజ్రము, గరుడపచ్చ, సారమనుమణి, గురుగుచేరు, తెల్లగినియ, కర్కేతము, వైడూర్యము, ఏనుగకుంభస్థలమునందుఁ బుట్టినముత్యము; అనువీనిని ధరించినందువలన విషభీతి దొలంగు నని తెలియవలెను.

అన్యచ్చ.—

శ్లో. సర్పాభిహతే యుంజ్యాత్తథో శంకావిషార్దితే,
కర్కేతనం మరకతం వజ్రం వారణమౌక్తికం. 123
వైడూర్యం గర్దభమణిం పిచుకం విషమూషికాం,
హిమవద్గిరిసంభూతసోమరాజీం పునర్నవామ్. 124
తథాద్రోణాం మహాద్రోణాం మానసీం సర్పజం మణిం,
విషాణి విషశాంత్యర్థం ధరే ద్విషహారం పరం. 125

కర్కేతనమనుమణి, గరుడపచ్చ, వజ్రము, గజకుంభజమౌక్తికము, వైడూర్యము, గర్దభమణి, గురుగుచెట్టు, విషమూషిక, హిమవత్పర్వతమునందుఁ బుట్టినకారుగ్రచ్చచెట్టు, తెల్లగలిజేరు, ద్రోణ మను పేరుగలవిషము, లేక తుమ్మిచెట్టు, పెద్దతుమ్మిచెట్టు, మానసియను నోషధీవిశేషము, సర్పమణి, వీనిని ధరించినట్లైన శంకావిషము, స్థావరజంగమవిషములు హరించును.

## —— మంత్రౌషధచికిత్సలు. ——

## (విషచంద్రోదయము.)

శ్లో. తద్వన్నధూకమధుకపద్మకేసరచందనైః,
అంజనం తగరం కుష్ఠం హరితాలం మనశ్శిలా. 126
ఫలినీత్రికటుస్పృక్కా నాగపుష్పం సకేసరం,
హరేణుమధుకం మాంసీ రోచనా కాకమాలికా. 127
శ్రీవేష్టకం సర్జరసః శతాహ్వాం కుంకుమం బలా,
తమాలపత్రతాళీసే భూర్జోశీరే నిశాద్వయం. 128
కన్యోపవాసినీ స్నాతా శుక్లవాసా మధుద్రుతైః,
ద్విజా నథర్వ్రసైః పుష్పైః కల్పయే దగదోత్తమం,
వైద్య శ్చాత్ర తదా మంత్రం ప్రయతాత్మా పఠే దిమం. 129

"నమః పురుషసింహాయ నమో నారాయణాయ చ,
యథాఽసౌ నాభిజానాతి రణే కృష్ణపరాజయం,
ఏతేన సత్యవాక్యేన అగదో మే ప్రసిధ్యతు."(మూలమంత్రము.)

నమో వైడూర్యమాతే హులు హులు రక్ష మాం సర్వవిషేభ్యః, గౌరీ గాంధారీ చండాలీ మాతంగీ స్వాహా. పిష్టేచ ద్వితీయో మంత్రః హరిమాయా స్వాహా.

అశేషవిషభేతాళగ్రహకార్మణపాప్మని,
మారకవ్యాధిదుర్భిక్షయుద్ధాశనిభయేషు చ. 130
పానసస్యాంజనాలేపమణిబంధాదియోజితః,
విషచంద్రోదయో నామ శాంతిస్వస్త్యయనం పరం. 131

ఇప్పపువ్వు, అతిమధురము, పద్మకేసరములు, చందనము, రసాంజనము, గ్రంధి తగరము, కోష్టు, తాళకము, మణిశిల, ప్రేంకణము, త్రికటుకములు, పక్కవేళ్లు, పొన్నచెక్క, నాగకేసరములు, రేణుకలు, వట్టివేళ్లు, జటామాంసి, గోరోజనము, కామంచివేళ్లు, శ్రీవేష్టకము, దేవదారుబంకతో చేయబడిన ధూపద్రవ్యము, ఏపె బంక, సదాపాకు, కుంకుమపువ్వు, జిబిలిక, కానుగచెక్క, తాళీసపత్రి, భుజపత్రి, వట్టివేళ్లు, కూరపసుపు, మ్రానిపసుపు, ఈవస్తువులను స్నాతయై యుపవాసము చేసి దుకూలమును ధరించినకన్యకచేత తేనెతో మర్దనము గావించి బ్రాహ్మణార్చనభోజనములను గావించి పూర్తి చేయవలయును. అప్పుడు వైద్యుడు క్రిందఁ జెప్పినమంత్రమును పఠించుచుండవలయును. ఓకృష్ణ సత్యమైనవాక్యబలముచే నాకీయౌషధమెప్పుడును పరాజయము లేకుండునటుల చేయవలయు నని ధ్యానించుచు నుపయోగింపవలయును. ఇందువలన భూతభేతాళబ్రహ్మరాక్షసనాగాదిదోషములును మారకహేతువులైన అశేషవిషబాధలును, దుర్భిక్షబాధలు, అపజయములు, నాశనమగును. ఈ యౌషధమును పాన లేపన ధారణ నస్యాదులు చేయించవలయును.

### మృతసంజీవనీకల్పము.

శ్లో. స్పృక్కాప్లవధ్యామకకాంచీశైలేయరోచనాస్తగరం. 132
ధ్యామకకుంకుమమాంసీ సురసాగ్రైలాలకుష్ఠఘనాః,
బృహతీశిరిషపుష్పం శ్రీపుష్పం రజనీద్వయహింగుపిప్పలీలాక్షాః.
జలముద్గపర్ణిచందనమధుకమదనసింధువారాశ్చ,
శంపాకలోధ్రమయూరకగంధఫలీనాకులీవిడంగం చ. 134
పుష్యే స్సంభృత్యసమం పిష్ట్వా గులికా విధేయా స్యుః,
సర్వవిషఘ్నో జయకృ ద్విషభృతసంజీవనో జ్వరనిహంతా. 135
భృతవిషజం త్వలక్ష్మీకార్మణమంత్రాగ్న్యశల్యరక్ దోషాన్,
దుస్స్వప్నస్త్రీదోషా నకాలమరణాంబుచౌరభయం. 136

ధనధాన్యకార్యసిద్ధిః శ్రీపుష్ట్యాయు ర్వివర్ధనో ధన్యః,
మృతసంజీవన యేష ప్రాగమృతా ద్భిర్విహ్మేణా విహితః. 137

స్పృక్క యనునోషధి, తుంగముస్తలు, ధనియాలు, నందివర్ధనము, రాతి పువ్వు, గోరోచనము, గ్రంధితగరము, కామంచిపూరి, కుంకుమపువ్వు, జటామాంసి, లక్ష్మీతులసి, నూగుదోస, కోష్టు, భద్రముస్తలు, వాకుడు, దిరిసెనపుపువ్వు, అశ్వత్థ పుష్పము, కూరపసుపు, మానిపసుపు, ఇంగువ, పిప్పళ్లు, లక్క, ఎఱ్ఱకలువ, పిల్లపెసర, శ్రీగంధము, ఇప్ప, మ్రంగకాయలోనిగుజ్జు, నల్లవావిలి, ఏల, లొద్దుగు, ఉత్తరేణు, ప్రేంకణము, సర్పాక్షి, వాయువిళంగాలు ఈ వస్తువులయొక్క పువ్వులు సైతము దొరకినమట్టుకు వేసి నూతి మాత్రలుచేసి యుపయోగించవలెను. ఇందువలన సమస్త విషములు హరించును. ఇందువలన జ్వరాద్యనేకోపద్రవములు యోగమునందు చెప్పిన విధముగ శమించును. ఈయోగాపధమును మృతసంజీవనీకల్ప మని చెప్పెదరు.

## ⟶ గంధహస్తికల్పము. ⟵

శ్లో. స్యా ద్వార్తాకబీజపూరజ్యోతిష్మత్యాదిభిః పుష్పైః,
దారుర్వ్యోషహరిద్రాకరవీరకరంజసురసైస్తు. 138
శ్వేతాం వచాం విడంగం హింగ్వమృతాం కుష్ఠసైంధవే లశునం,
సర్షకపిత్థమధ్యం టుండూకకరంజిబీజాని బృహతీ శిరీషపుష్పం ద్వే
రజనీ వంశలేఖం చ సమంపిష్ట్వా హ్యాజస్య మూత్రేణ గోశ్వాపిత్తేన
సప్తకృత్వః,
వ్యత్యాసభావితో ఽయం నిహంతి శిరసి స్థితం విషం క్షిప్రం. 140
సర్వజ్వరభూతగ్రహావిషూచికాజీర్ణమూర్ధార్తి,
ఉన్మాదాపస్మారా కాచపటలనీలికాశిరోదోషాన్. 141
క్షయదార్బల్యమదాత్యయపాండుగదాంశ్చాంజనాత్తథామేహాన్,
లేపా ద్దిగ్ధాక్షతలీఢదష్టవిషపీతవిఘాతీ. 142
అర్శ స్స్వరుద్ధేషు చ గుదలేపో యోనిలేపనం స్త్రీణాం,
మూఢే గర్భే దష్టే లలాటలేపః ప్రతిశ్యాయే. 143
దద్రుకండూకీటిభే కుష్ఠే శ్విత్రేషు చ విచర్చికాదిషు లేపః,
గజ ఇవ తరూ న్విషదా నిహం త్యగదగంధహస్త్యేషః. 144

వంగచెట్టు, మాదీఫలపుచెట్టు, మాల్కంగిణీచెట్టు వీనిపువ్వులు, దేవదారు, త్రికటుకములు, పసుపు, గన్నేరు, కానుగు, తులసి, తెల్లవస, వాయువిడంగములు, ఇంగువ, తిప్పతీగె, కోష్టు, సైంధవలవణము, తెల్లగడ్డలు, ఆవాలు, వెలగకాయ, దుండి

గపువేరు, కానుగవిత్తులు, వాకుడు, దిరిసెనపుపువ్వులు, కూరపసుపు, మానిపసుపు, వెదురుప్పు, ఇవి సమాంశములు కూర్చి మేకపంచితము, అవుపిత్తము, గుఱ్ఱపుపిత్తము, అనువానిచే నేడేసిదినములు మర్దనచేసి, మాత్రలుచేసి కాని, మైనముగా నుంచుకొని కాని, యీయౌషధమును, విషగ్రస్తులకు శిరముపై నుంచినట్లైన తత్క్షణమే విషనాశన మగును. అటులనే చేసిన జ్వరము, గ్రహపీడ, విషూచ్యాజీర్ణము, శిరోవ్యధ, ఉన్మాదము, అపస్మారము, కాచ, పటలనీలిక లను నేత్రవ్యాధులు, క్షయము, దౌర్బల్యము, మదాత్యయము, పాండువు అనువ్యాధులు, అంజనము వేయుటచే నశించును. ఈయౌషధమును లేపనము చేసినట్లయిన దిగ్ధ, క్షత, ప్రయోగ, దూషీవిషములు శమించును. స్త్రీలు యోని గుదములకు లేపనముచేసికొనిన మూలవ్యాధి, బద్ధగుదము, మూఢగర్భము అనునవి శమించును. పురుషులకును, బద్ధకోష్ఠము, అర్శస్సు శాంతించును. లలాటమున లేపనముచేసిన పడిసెము హరించును. సేవించుచు లేపనము చేసికొనుచుండిన దద్రుకులు, జిల కలిగినకిటిభి, శ్విత్రిక, విచర్చికము అనుకుష్ఠములు శమించును. ఏనుగలు వృక్షములను గూల్చినటుల సమస్తవిషముల నీయౌషధము కూల్చును. గాన దీనికి గంధహస్తికల్ప మని పేరు.

## మహాగంధహస్తికల్పము

శ్లో. తత్రాగురుముస్తైలానిర్యాసః పంచచందనం స్పృక్కా,
త్వఙ్నలదోత్పలవాలకహరేణు కోశీరవన్యనఖాః. 145
సురదారుకనక కుంకుమద్యామకకుష్ఠప్రియంగు చ స్తగరం,
పంచాంగాని శిరీషా ద్వౌక్షైలాంమనశ్శిలాజాజ్యః. 146
శ్వేతకటభీకరంజౌ రక్షోఘ్నం సింధువారికా రజనీ,
సురసరసాంజనగైరికమంజిష్ఠా నింబనిర్యాసః. 147
వంశత్వగశ్వగంధా హింగుదధిత్థామ్లవేతసంలామజ్జాః,
మధుమధుకసోమరాజీ వచారుహో రోచనా చ గవాం. 148
అగదోఽయం వైశ్రవణా యాఖ్యాతః త్ర్యంబకేణ షష్ట్యంకః,
అప్రతిహతప్రభావః ఖ్యాతో మహాగంధహస్తీతి. 149
పిత్తేన గవాం పోష్యే గులికాః కార్యాస్తు పుష్యయోగేన,
పానాంజనప్రలేపైః ప్రసాధయే త్సర్వకర్మాణి. 150
పైల్యం కండూతిమిరం రాత్ర్యంధం కాచమద్బుదం పటలం,
హంతి సతతం ప్రయోగా ద్ధిత మితి పథ్యాశినాం పుంసాం. 151
కుష్ఠం కటిభం శ్విత్రిం విచర్చికాం చోపహంతి నృణాం,

విషం మూషికలూతానాం సర్వేషాం పన్నగానాం చ. 152
ఆశు విషం నాశయతి సశూల మధ కిర్మజం సర్వం,
ఏతేన లిప్తగాత్రః సర్పాన్గృహీతం భక్షయేచ్చ. 153
విషం కాలాతీతోఽపి నరో జీవతి కించి న్నిరాతంకః,
ఆరుద్ధే గుదలేపయోని లేపశ్చ మూఢగర్భాణాం. 154
మూర్ధా త్రిషు చ లలాటే ప్రలేపమాహుః ప్రధానతమం,
భేరీమృదంగపటహాభత్రాణ్యమునా తథా ధ్వజపతాకాః. 155
లిప్తాని విషనిరస్త్యైః ప్రధ్వనయే ద్దృశ్యయే న్మతిమాన్,
యత్ర చ సన్నిహితోఽయం న తత్ర బాలగ్రహా న రక్షాంసి చ.
కార్మణభేతాలా సహంతి నాథర్వణాం మంత్రాః,
సర్వగ్రహా న తత్ర ప్రభవంతి న చాగ్నిశస్త్రనృపచౌరాః 157
లక్ష్మీం చ తత్ర భవతి యత్ర మహాగంధహస్త్యస్తి,
పిష్యమాణ ఇమం చాత్ర సిద్ధ మంత్ర మదీరయేత్. 158
మమ మాతా జయా నామ విజయో నామమే పితా,
సోఽహం జయో జయా పుత్రో విజయోఽథ జయామి చ. 159
నమః పురుషసింహాయ విష్ణవే విశ్వకర్మణే,
సనాతనాయ కృష్ణాయ భవాయ విభవాయ చ. 160
తేజోన్నపాకవౌ న్నాస్య త్తేజో బ్రహ్మేంద్రయో ర్యమే,
యథాహం నాభిజానామి వాసుదేవ పరాజయం. 161
మాతుశ్చ పాణిగ్రహణం సముద్రస్య చ శోషణం,
అనేన సత్యవాక్యేన సిధ్యతా మగదో హ్యయం. 162
హిలిమిలిసంస్పృష్టే రక్షస్సర్వభేషజేతు మే స్వాహా.

కృష్ణాగరు, తుంగముస్తలు, ఏలకులు, పంచనిర్యాసములు, శ్రీగంధము, స్పృక్క యనుగ్రంథ్యము, లవంగపట్ట, జటామాంసి, కలుసగడ్డ, నాగుదోస, రేణుకలు, వట్టివేళ్లు, నఖము, పిప్పలు, దేవదారు, నల్లకుంకుమొత్త, కుంకుమపువ్వు, కామంచిపూరి, కోష్ఠు, ప్రేంకణము, గ్రంథితగరము, దిరిసెనపుపంచాంగములు, త్రికటుములు, మణిసిల, జీలకఱ్ఱ, తెల్లగినియ, కానుగ, మొగబీర, నల్లవావిలి, పసుపు, తులసి, రసాంజనము, కావిరాయి, మంజిష్ఠి, వేపబంక, వేఱుచెక్క, పెన్నేరుగడ్డ, ఇంగువ, వెలగ, చుక్కకూర, లక్క, అతిమధురము, ఇప్ప, కాయగచ్చ, వస, తెల్లగలిజ, గోరోచనము అను ఈఅఱువదియంగములు (అనఁగా ఓషధులను) పుష్యమినక్షత్రయోగమందు సమాంశములు కూర్చి ఖల్వమున నునిచి, యిందు చెప్పఁ

బడిన "మమమాతా" యనుమంత్రమును, వైద్యుఁడు పఠించుచు, ఆవు చేదుకట్టుతో మృదువుగా మర్దన చేసి మాత్రలను చేసి, నీడను తడియార్చి యుంచుకొని యుపయోగింపవలయును. ఈ ఆఱుపదియంగములు గల యౌషధము పూర్వ మీశ్వరునిచే కుబేరున కుపదేశింపఁబడినది.

ఈ యౌషధము పానలేపననస్యాంజనాదివిధులచే నుపయోగింపనగును. పథ్యముతో పానాంజనముల కుపయోగించిన పిల్లము, జిల, పగటిచీఁకటి, రేచీఁకటి, కాచబిందు, అర్బుదము, పటలము లను నేత్రవ్యాధులు శాంతించును. విషమజ్వరములు, అజీర్ణములు, శీతపిత్తపుగాదర, విషూచి, తీట, కిటిభకుష్ఠ, శ్విత్రిక, విచర్చికము లనుకుష్ఠములు నశించును. అన్నిపాములవిషములు, మూషిక, లూతాది సర్వజంతువిషములు తక్షణమే శమించును. శరీరమునకు రాచుకొని విషము తినినను, చేతులకు రాచుకొని పాములను పట్టుకొనినను, విషబాధ కలుగదు. కర్ణవ్యాధులగు పరిణామశూల మొదలగునవి శమించును. గుదయోనిలేపనములచే బద్ధగుదము, మూఢగర్భము మొదలగువ్యాధులు నశించును. లలాటమునకు రాచినచో శిరోవ్యధలు తొలఁగును. నగారా, ఢంకా, తుడుము, తప్పెట, ఘంజా, మద్దెల, డోలు, మొదలైన వాదిత్రములకు రాచి వాయించిన నాధ్వనులచే సర్వవిషోద్రేకము లడఁగి పోవును. ఛత్రధ్వజపతాకములకు రాచిన వాని నీడ గాలి సోకినట్లైన విషబాధ లుడుఁగును. భూతబేతాళ బ్రహ్మరాక్షసనాగాదిగ్రహదోషములు, బాలగ్రహదోషములు తొలంగును. చోరాగ్నినృపశస్త్రభీతులు, దారిద్ర్యము, దౌర్భాగ్యము, నశించును ఇవి మహాగంధహస్తి యనురసాయనకల్పము దివ్యౌషధము.

గద్యమ్ — ఇతి శ్రీమద్ధరాత్మజామనోరమణకరుణాకటాక్షవీక్షణాసాదితభైషజ్యవిద్యాప్రవీణేన బొడ్డికూరిపాటి వేంకటకృష్ణవైద్యసుధాకరపౌత్రేణ వేంకటనృసింహాభిషక్పురందరపుత్రేణ వైద్యజ్యోతిషకవిత్వవిద్యాపారీణేన దృక్సిద్ధిక్రియాసంగ్రహ ధాతుమారణ శోధనవిధాననాడ్యజ్ఞానదుర్వాదనిర్వాపణాదిగ్రంథరచనాధురీణేన వేంకటరంగాభిధానభిషగ్వరేణ విరచితే విషవైద్యచింతామణౌ సర్వవిషసామాన్యలక్షణోపచారకథనం నామ ప్రథమో మయూఖః సమాప్తః.

శ్రీ ర స్తు.

# విషవైద్యచింతామణి.

స్థావరవిషచికిత్సానిరూపక

## ద్వితీయమయూఖము.

---

శ్లో. శ్రుత్యంతవీథీనటనం గౌతమీశాపమోచనం,
సోమార్చిత మహం వందే కౌసలేయపదద్వయం. 1

ఉపనిషద్వీథులయందు సంచరించునదియు, అహల్యాశాపవిమోచనము చేసినదియు, పార్వతీసహితుఁడగు పరమేశ్వరునిచే నిరంతరార్చ నొందునదియు నగు శ్రీరామచంద్రచరణారవిందయుగళమును ధ్యానించుచున్నాను.

శ్లో. అతః పరం ప్రవక్ష్యామి స్థావరం విషలక్షణం,
నానావిధచికిత్సాశ్చ మంత్రతంత్రక్రియాదికాః. 2

తా. ప్రథమమయూఖానంతరము స్థావరవిషలక్షణము, తదుపశాంతికరములగు మంత్రతంత్రక్రియాదులగు ననేకవిధచికిత్సలను జెప్పుచున్నాఁడను.

### ⟶ స్థావరవిషసామాన్యలక్షణము. ⟵

శ్లో. స్థావరం తు జ్వరం హిక్కాం దంతహర్షం గళగ్రహం,
ఫేనవమ్యరుచిశ్వాస మూర్ఛాశ్చ జనయే ద్విషం 3

స్థావరవిషము, జ్వరము, ఎక్కిళ్లు, పండ్లుగిట్టుకొనిపోవుట, గొంతుకనడచుట, కఫమును నురుఁగువలెఁ గ్రక్కుట, అరుచి, ఆయాసము, స్పృహ తప్పుట మొదలయినగుణములను కలుగఁజేయును.

### ⟶ స్థావరవిషసప్తవేగలక్షణము. ⟵

శ్లో. స్థావర స్యోపయుక్తస్య వేగే పూర్వే ప్రజాయతే,
జిహ్వాయా శ్యావతా స్తంభో మూర్ఛా త్రాసః క్లమో వమిః. 4
ద్వితీయే వేపథు స్స్వేదో దాహః కంఠే చ వేదనా,
విషం చామాశయం ప్రాప్తం కురుతే హృది వేదనాం. 5

తాలుశోషస్తృతీయేతు శూలం చామాశయే భృశం,
దుర్బలే హారితే శూనే జాయతే చాస్యలోచనే. 6
పక్వాశయగతే తోదహిధ్మాకాసాంత్రకూజనం,
చతుర్థే జాయతే వేగే శిరస శ్చాతిగౌరవం. 7
కఫప్రసేకో వైవర్ణ్యం పర్వభేదశ్చ పంచమే,
సర్వదోషప్రకోపశ్చ పక్వాధానే చ వేదనా. 8
షష్ఠే సంజ్ఞాప్రణాశశ్చ సుభృశం చాతిసార్యతే,
స్కంధపృష్ఠకటీభంగో భవే న్మృత్యుశ్చ సప్తమే. 9

స్థావరవిషముయొక్క ప్రథమవేగమందు నాలుక నల్లఁబడుట, నీలుగుకొని పోవుట, మూర్ఛ కలుగుట, భయము, ఆయాసము, వమనము ఏర్పడును; ద్వితీయ వేగమునందు శరీరము పసుపురం గెత్తుట, చెమర్చుట, దాహము, కంఠమునందు నొప్పి, విషము ఆమాశయగతమై ఱొమ్మునొచ్చుట, దవడలు లోపలి కీడ్చుకొనుట, కలుగును. మూఁడవవేగమునందు ఆమాశయములో వేదన గలుగుట, దౌర్బల్యము, శరీరమంతయు నొప్పి, ముఖము కన్నులు మంటపుట్టుట, విషము పక్వాశయగతమై దడ, కడుపుబ్బుట, పేగులు గుడగుడ మనుట కలుగును. నాలుగవవేగమునందు తల బరువెత్తుట, కఫమును గ్రక్కుట, శరీరము రంగుమాఱుట, కాలుచేతుల వ్రేళ్లగణుపులు శూలించుట కలుగును. అయిదవవేగమునందు విషము పక్వాశయమునందుఁ జేరి, సమస్తదోషములను ప్రకోపింపఁ జేసి వేదన కలిగించును. ఆఱవవేగమునందు అత్యంతము సంజ్ఞాజ్ఞానము నశించి అతిసారము కలుగును. ఏడవవేగమునందు మెడలు, వెన్ను, నడుము నిలుపలేక సడలి వ్రేలఁబడి మృతి కలుగును.

### స్థావరవిషసప్తవేగోపశమనచికిత్స.

శ్లో. ప్రథమే విషవేగేతు వాంతం శీతాంబుసేచితం,
సర్పిర్మధుభ్యాం సంయుక్త మగదం పాయయే ద్ద్రుతం. 10
ద్వితీయే గదపానం తు హితం నస్యం తథాఽంజనం,
చతుర్థే స్నేహసంయుక్త మగదం ప్రతియోజయేత్. 11
పంచమే మధుకక్వాథ మాక్షికాభ్యాం యుతం హితం,
షష్ఠేఽతిసారవ త్సిద్ధి రవపీడస్తు సప్తమే. 12
మూర్ధ్ని కాకపదం కృత్వా సాసృగ్వాపి సితం క్షిపేత్,

స్థావరవిషప్రథమవేగమునందు శరీరముపైన శీతోదకమును ధారగా పోసి తడిపి వమనము చేయింపవలెను. పిమ్మట నెయ్యి తేనె చేర్చఁబడిన యౌషధము నీయవలెను. ద్వితీయవేగమునందు వమనవిరేచనౌషధముల నీయవలెను. తృతీయవేగమునందు నస్యము అంజనము వేసి మందు త్రాగింపవలెను. చతుర్థవేగమునందు చమురులతో గల్పినమందు త్రాగింపవలెను. పంచమవేగమందు అతిమధురకషాయములో తేనె చేర్చి త్రాగింపవలెను. ఆఱవవేగమునందు రెండుమాఱులు నిరూహవస్తి (ఎనిమాసిరంజి) చేయవలెను. ఏడవవేగమందు శిరమున స్వస్తికమువలె కత్తితో గీచి, మాంసము నెత్తి నెత్తురు కార్చవలెను.

అన్యచ్చ.—

శ్లో. కోశాతక్యాగ్నికః పాఠా సూర్యవల్ల్యమృతాభయా. 13
శేలుః శిరీషః కిణిహీహరిద్రద్వౌద్రసాహ్వయా,
పునర్నవే త్రికటుకం బృహత్యౌ శారిబా బలా. 14
ఏషాం యవాగూం నిర్యూహే సితాం సఘృతమాక్షికం,
యుంజా ద్వేగాంతరే సర్వవిషఘ్నం కృతకర్మణః. 15

బీరవిత్తులు, చిత్రమూలము, విషబొద్ది, సురుగుడువేఱు, తిప్పతీఁగె, కరకకాయబెరడు, విరిగిచెట్టుపట్ట, దిరిసెనపుపట్ట, నల్లగంటెనవేరు, మానిపసుపు, లావుకపక్షిమాంసము, తెల్లగలిజేరు, త్రికటుకములు, వాకుడు, సుగంధపాల, ముత్తవపులగము, ఈవస్తువులు వక్కముక్కగా నలియఁగొట్టి నీళ్లు పోసి గంజి కాచి అందులో తేనె నెయ్యి పోసి కల్పి త్రాగించిన స్థావరవిషముయొక్క యేడువేగములు శమించును.

### ⟶ స్థావరవిషములలో మొదటిదగు వత్సనాభిభేదములు. ⟵

శ్లో. బహావో వత్సనాభాశ్చ ముస్తకం పుష్కరం విషం,
క్రూరం శఠం కర్మఠం చ హారిద్రా కాలకూటకం. 16
ఇంద్రం వజ్రం చైవ వీరం హారీతం గాలవం విషం,
శృంగీ కర్కటశృంగీ చ మేషశృంగీ హాలాహాలం. 17
శాకూటం వజ్రశృంగీ చ అంజనం పుండరీకకం,
శంకోచం మధుపాకం చ మనూరం రోహిణం తథా. 18
పంచవింశతిభి ర్భేదైః విజ్ఞేయం స్థావరం విషం,

వత్సనాభము, ముస్తకము, పుష్కరము, క్రూరము, శఠము, కర్మఠము, హారిద్రకము, కాలకూటము, ఇంద్రము, వజ్రము, వీరము, హారీతము, గాలవము, శృంగకము, కర్కటశృంగకము, మేషశృంగము, హాలాహాలము, కాకూటము, వజ్రశృంగము, అంజనము, పుండరీకము, శంకోచము, మధుపాకము, మసూరము, రోహిణము అని వత్సనాభిజాతు లిరువదియైదువిధముల కందజాతివిషములై యున్నవి.

## ఇరువదియైదువిషములలో తొమ్మిది యగు మహావిషముల పేళ్లు.

శ్లో. కాలకూటో వత్సనాభః శృంగకశ్చ ప్రదీపనః. 19
హాలాహాలో బ్రహ్మపుత్రో హారిద్రః సక్తుక స్తథా,
సౌరాష్ట్రిక ఇతి ప్రోక్తా విషభేదా అమీ నవ. 20
క్షీరాబ్ధిమథనే కాలే విషాః ప్రాదుర్భవాః పురా,

కాలకూటము, వత్సనాభము, శృంగకము, ప్రదీపనము, హాలాహాలము, బ్రహ్మపుత్రము, హారిద్రకము, సక్తుకము, సౌరాష్ట్రికము అను తొమ్మిదివిధము లగుమహావిషములు పూర్వము క్షీరసముద్రమథనకాలమునం దుద్భవించెను. వీనియొక్క సంయోగదోషదమువలన తక్కినవిశేషవిషములన్నియు నేర్పడినవి. వానిలక్షణములు:-

(1) కాలకూటవిషము:—తెల్లగను, దానిపైన నెఱ్ఱనిచుక్కలను గలిగి బురద వలె మృదువుగ నుండును; అశ్వత్థవృక్షాకృతి గలయొకవృక్షంబున నుండుబంక నే కాలకూటవిష మనియెదరు; ఇది అహిచ్ఛత్రము, మలయము, కొంకణము, శృంగి బేరము, అనుపర్వతములందు విశేషముగ నుత్పత్తి యగును.

(2) వత్సనాభము:—వావిలాకువంటియాకులు గలదియై వచనాగాకృతి గలదియై యుండును. దానిసమీపంబున వృక్షమైనను, తీగయైనను మొలవకుండును; ఇది ద్రోణపర్వతంబునం బుట్టును.

(3) శృంగకవిషము:—గోశృంగాకారము గలదియై యందు రెండుకొమ్ములు గలిగి యుండును; దీనిని ఆవుకొమ్మునకుం గట్టి పాలుపిండినయెడల, పాలురాక రక్తమే వచ్చును; దీనియాకులు అల్లపుఆకువలె నుండును. ఇది రేటియొడ్డునందలి బురదలో విశేషముగ నుండును; ఇది బ్రాహ్మ్యదేశమునం దుద్భవించును.

(4) ప్రదీపనవిషము:—నిగనిగయనునిప్పువలె నుండును; దీనియాకు లీతాకుల వలె నుండును. దీనిని మనుజులు వాసనఁజూచిరేని, శరీరం బంతయు మంటలు బుట్టి తోడనే మృతి నొందుదురు. ఈవిషము సముద్రతీరములయం దుండును.

(5) హాలాహలవిషము:—తాటిచెట్టువలె నుండు నొకచెట్టుయొక్కగడ్డలు; దీనియాకులు నీలవర్ణముగను, ఫలములు ఆవుచన్నులవలెను, గడ్డలును ఆవుచన్నులఁ బోలి తెల్లఁగ నుండును. దీనిచుట్టుప్రక్కల వృక్షంబేనియు గడ్డియేనియు మొలవకుండును. ఏజీవజంతు వేని దీనిని మూర్కొనినతోడనే మృతినొందును.

(6) బ్రహ్మపుత్రవిషము:—బ్రహ్మపుత్రానదీతటముల నుత్పన్నమగును; దీని యాకులు మోదుగాకులను, ఫలములు మోదుగువిత్తులను బోలి యుండును; గడ్డలు లావుగ నుండును; ఇది రోగహరణరసరసాయనంబులందు సుప్రశస్తము.

(7) హారిద్రకవిషము:—పసుపుపైరుచేయునట్టిస్థలంబుల నుత్పత్తి యగును. దీనియాకులు పసుపుఆకులను, గడ్డలు పసుపుగడ్డలను బోలియుండును. ఇది రసాయనమునకు శ్రేష్ఠతరము.

(8) సక్తుకవిషము:—యవల ఆకృతిగలదియై తెల్లగనుండును; ఇది లోలపర్వతమునఁ బుట్టును.

(9) సౌరాష్ట్రికవిషము:—ఇది సురాష్ట్రదేశమందు జనించును; దీనిక్రింది వైపు తాబేలుతలవలె లావుగను, కృష్ణాగరువర్ణము కలదిగను, ఆకులు పాలచెట్ల ఆకులవలెను నుండును.

ఈ తొమ్మిదిమహావిషంబులును, తొల్లి క్షీరసముద్రమథనకాలంబున, నుత్పన్నంబు లయ్యె నని యాయుర్వేదవేత్తలు వచించెదరు.

### విషములలో క్రూరతరములు.

శ్లో. ఏతన్మధే హ్యతిక్రూరం శంకోచం కాలకూటకం. 21
శృంగీ ముస్తం వత్సనాభం పంచైతే విషసత్తమాః,

శంకోచము, కాలకూటము, శృంగికము, ముస్తకము, వత్సనాభము అనునవి విషములలో క్రూరతరములు.

### ఉపవిషముల పేళ్లు.

శ్లో. అర్కసేహుండదుత్తూర లాంగలీకరవీరకం. 22
గుంజాహిఫేనజైపాలం విషతిందుకబీజకం,
భల్లాతబీజ మిత్యేతే దశోపవిషజాతయః. 23

జిల్లేడు, జెముడు, ఉమ్మెత్త, నిరుపిప్పలి, గన్నేరు, గురిగింజలు, అభిని, నేపాళములు, ముష్టివిత్తులు, జీడిగింజలు, అను పదియు నుపవిషము లని తెలియవలయును.

### పంచపాషాణముల పేళ్లు.

శ్లో. గౌరీశంఖచ్చ దోడ్డిశ్చ ఇల్లిపాషాణమేవచ,
మహాకాలాఖ్యపాషాణ మేతత్పాషాణపంచకం. 24

గౌరిపాషాణము, శంఖపాషాణము, దోడ్డిపాషాణము, ఇల్లిపాషాణము, మహాకాలపాషాణము అని పాషాణము లైదువిధములు.

### పంచపాషాణముల యుత్పత్తి.

శ్లో. గౌరీం చ శంఖ మిల్లిం చ ఖనిజాతా మహీతలే,
దోడ్డితామ్రమలే నోత్థం మహాకాలం మహీతలే. 25
విషతిందుకబీజోత్థం సద్యః ప్రాణహరం పరం,

గౌరిపాషాణము, శంఖపాషాణము, ఇల్లిపాషాణము, ఈమూడును గనులయందుఁ బుట్టుచున్నవి. దోడ్డిపాషాణము రాగిచిలుము వల్ల నేర్పడుచున్నది. మహాకాలపాషాణము ముష్టివిత్తులసత్తువలన నుత్పత్తి చేయఁబడును. దీని నింగ్లీషుభాషలో (స్ట్రిక్నైన్) అని చెప్పెదరు. ఈయైదుపాషాణములు సద్యఃప్రాణహరణములు.

### పంచపాషాణముల వర్ణములు.

శ్లో. పీతాభం గౌరిపాషాణం శంఖం శంఖసమప్రభం. 26
దోడ్డిపాషాణకం నీలం ఇల్లి గృంజనసన్నిభం,
మహాకాలాఖ్యపాషాణం ఘనసారసమప్రభం. 27

గౌరిపాషాణము పసుపువర్ణముగను, శంఖపాషాణము శంఖసదృశవర్ణముగను, దోడ్డిపాషాణము రససిందూరపుపలుకులవంటి యాకృతి గలిగి నల్లనివర్ణముగను, ఇల్లిపాషాణము నీరుల్లిగడ్డవర్ణముగను, మహాకాలపాషాణము (ముష్టిపాషాణము) తెల్లగపచ్చకర్పూరపువర్ణముగ నుండును.

### ఉపపాషాణముల పేళ్లు.

శ్లో. సౌవీరం కునటీ తాళం మాక్షికం తుత్థకద్వయం,
అంజనానాం చతుష్కం చ ఉపపాషాణ మిష్యతే. 28

సౌవీరము, మణిసిల, తాళకము, కాకమాక్షికము, తారమాక్షికము, హేమమాక్షికము, పాలతుత్థము, మైలతుత్థము, అంజనచతుష్కము అనఁగా: శిలాంజనము, లేక సుర్మారాయి, స్రోతోంజనము, లేక ఎఱ్ఱసుర్మారాయి, సౌవీరాంజనము,

లేక తెల్లసుర్మారాయి, గరుడాంజనము, లేక పసుపుసుర్మారాయి అనునవి యుప
పాషాణము లని చెప్పంబడుచున్నయవి.

—— స్థావరవిషకార్యములు. ——

1. మూలవిషకార్యము —

శ్లో. ఉద్వేష్టనం మూలవిషే మోహః ప్రలపనం తథా,
శరీరవ్యథ, చిత్తభ్రమ, అరాటము, అనునవి మూలవిషకార్యములు.

2. పత్రవిషకార్యములు.—

శ్లో. జృంభణం వేదనం శ్వాసో నృణాం పత్రవిషై ర్భవేత్. 29
ఒడలువిఱుపు, ఆవేదన, అలఁత, అనునవి పత్రవిషకార్యములు.

3. ఫలవిషకార్యములు.—

శ్లో. శుష్కశోథః ఫలవిషైః దాహో ద్వేషశ్చ భోజనే,
శరీరము యెండుట, వాపుకలుగుట, దాహము కలుగుట, అన్నద్వేషము కలు
గుట ఈలక్షణములు ఫలవిషమువల్ల కలుగును.

4. పుష్పవిషకార్యములు.—

శ్లో. భవేత్పుష్పవిషైశ్ఛర్ది రాధ్మానం మూర్ఛనం తథా. 30
డోకు, పేగులుబ్బుట, మూర్ఛ అనునవి పుష్పవిషకార్యములు.

5. త్వక్సారనిర్యాస(పట్ట-చేవ-బంక)విషకార్యములు.—

శ్లో. ఆస్యదౌర్గంధ్యపారుష్య శిరోరుక్కఫసంస్రయాః,
నిర్యాసత్వక్సారవిషై రుపభుక్తై ర్భవంతి హి. 31
నోటియందు దుర్గంధము, కాఠిన్యము, తలనొప్పి, నోటినుండి నురుగుకారుట
అనునవి త్వక్సారనిర్యాసవిషకార్యము లగును.

6. క్షీరవిషకార్యములు.—

శ్లో. ఫేనాగమః క్షీరవిషై ర్విడ్భేదో గురుజిహ్వతా,
నోట నురుగు వచ్చుట, మలబంధము, నాలుక పిడుచ గట్టుట అనునవి క్షీర
విషకార్యము లగును.

7. కందవిషకార్యములు.—

శ్లో. కందజా న్యుగ్రవీర్యాణి యా న్యుక్తాని త్రయోదశ. 32
సర్వాణ్యేతాని కుశలై ర్జ్ఞేయాని దశభి ర్గుణైః,

వత్సనాభ్యాదికందవిషము లన్నియు, మారకలక్షణలక్షితములై యుగ్రవీర్యము కలవియై పదివిధము లగుగుణములచేత ప్రసిద్ధి చెందియున్నవి.

8. కందవిషములయొక్క పదిగుణములు —

శ్లో. రూక్ష ముష్ణం తథా తీక్ష్ణం సూక్ష్మ మాశు వ్యవాయి చ. 33
వికాశి విశద శ్చైవ లఘుపాకీ చ తే దశ,

శరీరమందు తాపము, ఉష్ణము, మంటలు, ధాతువుల నాకర్షించుట, హృదయనాడీ హస్తనాడీ చలనములను నిశ్వాసనోచ్ఛ్వాసనములను బంధించుట, వ్యక్తి తప్పిపోవుట, దేహము తెల్లబాఱుట, శరీరము గెండుబడుట, పండి శిథిల మగుట, తీవ్రవేదన గలుగుట అను నివి కందవిషకార్యము లగును.

9. వత్సనాభిభక్షణమువలన గలిగెడు గుణములు —

శ్లో. జిహ్వోష్ఠనాసవక్త్రేషు జాడ్యం చిమిచిమాయితం. 34
దంతహర్షరసాజ్ఞత్వే హను స్తంభం గళగ్రహం,
చక్షుర్హృదయరోధం చ లాలాస్రావం ముఖే తథా. 35
హస్తయోః పాదయో శ్చైవ ఉత్క్షేపోత్క్షేపణేన చ,
శరీరే సర్వనాడీషు కంపం చిటిచిటాయితం. 36
దీపజ్వాలాశ్చ తారాశ్చ ఉత్థిత శ్చ దగోచరం,
చక్షుర్గోచర మాసీనే తిమిరం చ పృథక్పృథక్. 37
గర మేతత్ప్రికారేణ బాధతే భక్షణా నృణాం,

నాలుక, పెదవులు, ముక్కు, నోరు, మొద్దుబారి చిమచిమలాడుట, దంతహర్షము కలుగుట, నాలుకకు రుచి తెలియకుండుట, హనుప్రదేశము స్తంభించి మొద్దుపడియుండుట, మెడను దింపుకపోవుట, కన్నులు చీకట్లు గ్రమ్ముట, ఊపిరి మ్రుడదికొనుట, నోటివెంట జొల్లు కాఱుట, చేతులు కాళ్లు చాచునప్పుడు ముడుచునప్పుడు శరీరమందలి నరములు పడఁకుచు చిటచిట మనుట, రాత్రియందు దీపజ్వాలలు గాని నక్షత్రములు గాని కూర్చుండి చూచినప్పు డగపడుచు నిలుచుకొని చూచినప్పు డగపడకపోవుట, చీఁకట్లు గ్రమ్ముచుండుట అనునీలక్షణములు వత్సనాభిభక్షణమువలన కలుగును.

10. వత్సనాభ్యాదివిషము లెంత పరిమితిభక్షించిన జీవులఁజంపును.—

శ్లో. వత్సనాభ్యాదికా స్సర్వే పంచవింశతిస్థావరాః. 38
గుంజాప్రమాణం భుక్తశ్చే త్పంచత్వం ప్రాణినాం ధ్రువం,

వత్సనాభి మొదలగు నిరువదియైదుస్థావరము లగుకందవిషములలో నేదియైనను గురిగింజప్రమాణము భక్షించినమాత్రమున నేప్రాణికిఁగాని ప్రాణహరణము తప్పక సిద్ధించు నని తెలియవలెను.

### వత్సనాభి శుద్ధిచేయుక్రమము.

శ్లో. విషం తు ఖండశః కృత్వా వస్త్రఖండే నిబంధయేత్. 39
గోమూత్రమధ్యే నిక్షిప్య స్థాపయే దాతపే త్ర్యహం,
గోమూత్రం తు ప్రదాతవ్యం నూతనం ప్రత్యహం బుధైః. 40
త్ర్యహేఽతీతే త ముద్ధృత్య శోషయే న్మృదు పేషయేత్,
శుద్ధ్యత్యేవం విషం చైవ యోగ్యం భవతి చార్తిజిత్. 41

వత్సనాభిని తునుకలుగ కత్తిరించి బట్టలో మూటఁగట్టి యొకకుండలో వైచి అది మునుఁగునటుల గోమూత్రము వైచి యెండలో నాననిచ్చి మరునాఁ డామూత్రమును పరిహరించి క్రొత్తగోమూత్రమును వైచి మరల నెండలో నాననిచ్చి మూఁడు దివసము లివ్విధముగ నొనరించి నాలుగవదినము శుద్ధోదకమువలన చక్కఁగ కడిగి యెండ నెండించిన శుద్ధియగును. పిదపచూర్ణము చేయునది. వత్సనాభికి నింతకన్న మేలైనశుద్ధి మఱియొకటి లేదు.

### వత్సనాభియొక్క గుణము.

శ్లో. గరహా రోగహారీ చ సర్వదోషహర స్తథా,
జ్వరశూలార్శకండూతి కుష్ఠవ్రణనికృంతనః. 42
శీతజ్వరహారీ సద్యస్సుఖదాయీ చ దీపనః,
శుక్రస్తంభకర స్సర్వసన్నిపాతనికృంతనః. 43
జంగమస్థావరగరనాశనో రసదీపనః,
రంజనో వ్రణహారీ చ వలీపలితనాశనః. 44
శ్వాసకాసహారీ రాజయక్ష్మపాండుభగంధరాన్,
దుర్నామోదరరోగాం శ్చ వత్సనాభి ర్వినాశయేత్. 45

శుద్ధి చేయఁబడినవత్సనాభి విషములను, సర్వదోషములను, వ్యాధులను, జ్వరములను, శూలలను, మూలవ్యాధులను, జిలలను, కుష్ఠవ్యాధులను, శీతజ్వరములను, సన్నిపాతములను, స్థావరజంగమవిషములను, వ్రణములను, వలీవ్యాధులను, పలితవ్యాధిని, శ్వాసకాసలను, క్షయవ్యాధులను, పాండువ్యాధులను, భగంధర

ప్రణములను, ఉదరవ్యాధులను, హరించి, ఆఁకలి, అగ్నిదీపనము, వీర్యవృద్ధి, వీర్యస్తంభనము, రసదీపనము సుఖమును కలుగఁ జేయును.

అన్యత్ :—

శ్లో. త దేవ యుక్తియుక్తం తు ప్రాణదాయి రసాయనం,
యోగవాహి త్రిదోషఘ్ని బృంహణీ వీర్యవర్ధనీ. 46
యే దుర్గుణా విషే శుద్ధివిహీనా త్ప్రభవంతి హి,
తస్మా ద్విషం ప్రయోగేషు శోధయిత్వా ప్రయోజయేత్. 47

శుద్ధి కాఁబడినవత్సనాభిని యుక్తియుక్తముగ నుపయోగించినట్లైన జరామరణములను బోఁగొట్టును. త్రిదోషములను హరించును. యోగవాహిత్వము నిచ్చును. శరీరవృద్ధి, వీర్యవృద్ధి కలుగఁజేయును. చక్కఁగా శుద్ధికానిదైన హీనసత్వముకలదియై సుగుణముల నిచ్చుటకు మాఱుగ దుర్గుణములను కలుగఁజేయును. గనుక వత్సనాభిని ప్రయోగించునప్పుడు చక్కఁగ శుద్ధియైనదానినే ప్రయోగింపవలయును.

## పంచపాషాణముల వికారనిదానము.

శ్లో. పాషాణభక్షణా త్కంఠే వ్రణం క్షోభం విదాహకం,
అతిసారం చ వమనం పీడా స్యా త్సర్వసంధిషు. 48
వహ్నివ క్షోభకం కుక్షౌ అరతి శ్శిథిలాంగతా,
నయనాభ్యంతరే యాతవిముక్త స్సర్వసంధిషు. 49
న హి ప్రతిక్రియా లోకే సత్యం పాషాణభక్షణే,
అల్పశ్చే న్నిధనం శీఘ్రం మాలస్య మధికా స్మృతిః. 50

పాషాణము లైదింటిలో నేది భక్షించినను, నాలుక మొదలు జీర్ణకోశము వఱకు గొంతునాళము వ్రణ మగుట, మంటగలుగుట, విదాహ మేర్పడుట, వాంతులగుట, విరేచనము లగుట, కీళ్లయందు పోట్లు గలుగుట, కడుపులో మంటలు పుట్టుట, ఏపదార్థమం దిచ్ఛ లేకుండుట, సర్వాంగములు శోషించుట, కీళ్లు సడలిపోవుట, కన్నులు గుంటలుపడుట, అను నిలక్షణములు కలుగును. పాషాణము తక్కువప్రమాణము భక్షించిన త్వరఁగా చంపును. అధికప్రమాణము భక్షించిన నాలస్యముగ చంపును; కేవలము తక్కువప్రమాణమైన చంపదు. పాషాణమున కీలోకమునందు వాస్తవముగ ప్రతిక్రియ లేదు.

## ధాతువిషకార్యములు.

శ్లో. హృత్పీడనం ధాతువిషై ర్మూర్ఛాదాహశ్చ తాలుని,
ప్రాయేణ కాలఘాతీని విషా ణ్యేతాని నిర్దిశేత్. 51

పాషాణ, తాళక, మణిశిల, సౌవీరాది ధాతువిషభక్షణమువలన హృదయ వేదన, మైకము, మాటిమాటికి నోరెండుట, వాంతులగుట, విరేచనములగుట, గొంతు వ్రణమగుట, అను నీలక్షణములు కలుగును; మఱియు నీధాతువిషములలో పాషాణాదులు సద్యఃప్రాణహారణములు. తాళకమణిశిలాదులు కాలాంతరప్రాణహారణములు.

## విషసామాన్యధర్మములు.

శ్లో. స్థావరం జంగమం చాపి కృత్రిమం చాపి యద్విషం,
సద్యో నిహంతి తత్సర్వం గుణైశ్చ దశభి ర్యుతం. 52

స్థావర, జంగమ, కృత్రిమవిషములలో నేదియైనను, పూర్వోదాహృతమైన పదిగుణముల కలదియై జీవులను జంపుటకు సమర్థమై యుండును.

## సౌవీరవిషనిదానము.

శ్లో. వ్రణం చ ముఖ మాద్యంతం దంతమూలాని ప్రశోషయేత్,
ఆహారకోశపర్యంతం గళే క్షోభం మహావ్రణం. 53
లాలాస్రావం జ్వరం చైవ ఖానేపానే నిరోధనం,
వ్యధాచ సర్వసంధిషు తీక్ష్ణం తాపం చ విస్మృతిః. 51
పతితం పిశితం వక్త్రా దేవం సౌవీరభక్షణే;

నోరు వ్రణమగుట, చిగుళ్లు వాచుట, జీర్ణకోశపర్యంతము గళము వ్రణమగుట, మంటపుట్టుట, జొల్లుకారుట, జ్వరమేర్పడుట, అన్నపానములకు నిరోధము గలుగుట, కీళ్లు నొప్పులుపుట్టుట, విదాహమేర్పడుట, తాపముగ నుండుట, భ్రమ కలుగుట, నోటినుండి మాంసపుకండ లూడిపడుట, ఈలక్షణములు సౌవీరభక్షణముచే కలిగియుండును.

## మణిశిల, తాళక, మాక్షిక, తుత్థద్వయ, అంజన చతుష్టయ, విషనిదానము.

శ్లో. అశుద్ధ కునటీతాళ మాక్షికం తుత్థకద్వయం, 55
అంజనానాం చతుష్కం చ జాడ్యం క్షున్నాశనం జ్వరః,
శోథశ్చ మలరోధ శ్చ నిస్సత్వం చ ప్రజాయతే. 56
ఉపపాషాణశుద్ధేశ్చ నరాణా మమృతం భవేత్,

మణిశిల, తాళకము, మాక్షికత్రయము, తుత్థద్వయము, అంజనచతుష్టయము, శుద్ధికాకున్నచో శరీరమందు జడత్వము, అగ్నిమాంద్యము, జ్వరములు శరీరమందు

వాపు, మలబంధము, అశక్తి అనునివి సంభవించును. చక్కఁగ శుద్ధికాఁబడిన యుప పాషాణములు నరులపాలిటి కమృతప్రాయములై యుండును.

## వత్సనాభివిషచికిత్స.

1 వ చికిత్స.—

శ్లో. తండులీయకమూలస్య క్వాథం వా స్వరసం పిబేత్. 57
పలమాత్రం ప్రశాంతిస్స్యా ద్వత్సనాభివిషంక్షణే,

చిఱ్ఱికూరచెట్టువేళ్లకషాయము (క్వాథము) గాని, స్వరసము గాని పలప్రమాణము పుచ్చుకొన్నట్టైన వత్సనాభివిషవికార ముపశమించి క్షేమము కలుగును.

2 వ చికిత్స.—

శ్లో. వత్సనాభివిషార్తశ్చ గోమూత్రం ద్విపలం పిబేత్. 58
తత్క్షణే సుఖ మాప్నోతి సత్యం సత్యం న సంశయః,

వత్సనాభిని భక్షించి విష మెక్కినవాఁడు రెండుపలములప్రమాణము గోమూత్రమును పానముచేసిన వత్సనాభివిషము హరించును.

3 వ చికిత్స—

శ్లో. పటూశనస్య వృక్షస్య పలమానం రసం పిబేత్. 59
శర్కరాయుక్తపానేన వత్సనాభివిషం హరేత్,

పటూశనవృక్షపుపట్టరసము పలప్రమాణములో తులమాత్రము చక్కెరఁ గలుపుకొని సేవించిన వత్సనాభిజనితవిషవికార ముపశమించును.

4 వ చికిత్స.—

శ్లో. మాహిషే నామ్లదధినా శీతోదనసుభక్షణాత్. 60
వత్సనాభివిషార్తస్య సుఖం భవతి నిశ్చయః,

వత్సనాభివిషవ్యాప్తి కలిగినవానికి పుల్లనిబఱ్ఱెపెరుఁగుతో చద్దిఅన్నము భక్షింపఁజేసిన విష ముపశమించును.

## ఉపవిషచికిత్స.—జిల్లేడుపాలు, జెముడుపాలు వీనివికారశాంతి.

1 వ చికిత్స.—

శ్లో. చించాపత్రం జలే పిష్ట్వా మర్దయే చ్ఛాంతికృత్సదా. 61
తుషారజలపానేన స్నుహ్యర్కవిషనాశనం,

ముదిచింతాకు నుదకముచే మృదువుగ మర్దించి, శరీరమునకు లేపనముఁజేసికొనినను, మంచుగడ్డ కరగించిన నీరు పానముఁ జేసినను, జెముడుపాలు జిల్లేడుపాలు వీనివలన కలిగినవికార ముపశమన మగును.

2 వ చికిత్స.—

శ్లో. శ్వేతమృ ద్వారిణా గంధం లేపనా ద్విషనాశనం. 62
తలపోటకపుష్పస్య గంధే నార్కస్నుగాపహం,

తెలుమణి (శ్వేతమృత్తిక) నుదకముచే చాఁది లేపనము చేసినను,తంగేడుపువ్వులుదకముచే నూఱి గంధమును పట్టించినను, జెముడుపాలు, జిల్లేడుపాలు వీనివలన కలిగినతాప ముపశమించును.

3 వ చికిత్స.—

శ్లో. హాలాశఫలమృత్పంకం చందనేన విలేపయేత్. 63
కరంజస్య చ గంధేన స్నుహ్యార్కవిషనాశనం,

మోదుగమాడ లను నామాంతరము గలమోదుగకాయలు, బురదమట్టి, చందనము, వీనిని మెత్తగ గంధమువలె నూఱి లేపనముఁ జేసినను, కానుగ వేరుగంధమును లేపనముఁ జేసినను, జిల్లేడుపాలు జెముడుపాలు విషవికారము శాంతించును.

→ బొంతజెముడువికారశాంతి. ←

శ్లో. శీతవారిసితాయుక్తం పానం వజ్రీవిషాపహం. 64
వస్త్రవాయు స్తథా కార్య శ్శీతచ్ఛాయాం చ సేవయేత్,

శీతోదకములో చక్కెర గలిపి పుచ్చుకొనినను, చల్లనినీడయందు గూర్చుండి వస్త్రముతో విసరించుకొనినను, బొంతజెముడుపాలవికార ముపశమించును.

2 వ చికిత్స.—

శ్లో. దధిమస్తుసితాయుక్తం పయఃక్షౌద్రసమన్వితం. 65
తాళకాదంబరీపానా ద్వజ్రీ విషవినాశనం,

పెరుఁగుమీఁది తేటనీటిలో చక్కెర గలిపి పుచ్చుకొనినను, కాఁచిన ఆవుపాలలో తేనె గలిపి పుచ్చుకొనినను, తాటికల్లు పుచ్చుకొనినను, బొంతజెముడుపాలవలనఁ గలిగినవికారము శాంతించును.

→ ఉన్మత్తవికారశాంతి. ←

1 వ చికిత్స —

శ్లో. వృంతాకఫలబీజస్య రసో ద్విపలమాత్రయా. 66

భక్షణా ద్భ్రక్తధుత్తూరవిషం నశ్యతి నిశ్చయః,

వాకుడువిత్తులను గాని, మ్రింగవిత్తులను గాని యుదకముచే నూరి సంగ్రహించిన స్వరసమును రెండుపలముల ప్రమాణము పుచ్చుకొనినయెడల నుమ్మెత్తవలనఁ గలిగినవికార ముపశమించును.

2 వ చికిత్స.—

శ్లో. కార్పాసపుష్పం సితయా జలే పిష్ట్వాఽల్పపానతః. 67
ధుత్తూరస్య విషం యాతి తథా లవణసేవనాత్,

పైడిప్రత్తిపూలు, చక్కెర వీని నుదకముచే సమాంశములు చేర్చి నూరి పానము చేసినను, లవణము నుదకమునఁ గలపి త్రాగినను, ఉమ్మెత్తవలనఁ గలిగినవికారము శమనమగును.

3 వ చికిత్స.—

శ్లో. గోదుగ్ధం ప్రస్థ మేకం తు శర్కరాయాః పలద్వయం. 68
తస్య పానా ద్విషం యాతి ధుత్తూరస్య చ నిశ్చయం,

ముప్పదిరెండుపలముల ఆవుపాలలో రెండుపలములచక్కెర గలిపి త్రాగినను మ్మెత్తవికార ముపశమించును.

4 వ చికిత్స.—

శ్లో. తిక్తేక్షుస్వరసే నాథ తింత్రిణీజం ఫలామ్లికాత్. 69
దధ్యన్నసేవనా త్సద్యః ధుత్తూరస్య విషం జయేత్,

వెఱ్ఱిచెఱుకు రసము పానముచేసినను, చింతపండుపులుసు త్రాగినను, నిమ్మపండ్లరసముఁ ద్రాగినను, పులిచెంచలి లేక, పులిచింతాకురసముఁ ద్రాగినను పెరుఁగన్నము తినినను, ఉమ్మెత్తవలనఁ గలిగినకారము శమించును.

## నీరుపిప్పలి (బొక్కెనాకు) వికారశాంతి.

శ్లో. భ్రష్టసర్షపకక్వాథం పలమాత్రం పిబే ద్యది. 70
లాంగలీవిషశాంతి స్స్యా దజీర్ణం తత్క్షణం హరేత్,

వేగించిన ఆవాలకషాయము పలప్రమాణము పుచ్చుకొనిన నీరుపిప్పలివికారమును అజీర్ణదోషమును హరించును.

## గన్నేరు విషవికారశాంతి.

1 వ చికిత్స.—

శ్లో. సితాయుక్తం సదా దేయం దధి వా మాహిషం పయః. 71

తథా చార్కత్వచం పీతం కరవీరవిషాపహం,

బట్టపాలలోఁగాని, పెఱుఁగులోఁగాని చక్కెర గలిపి త్రాగినను, జిల్లేడు వేఱు చూర్ణము గలిపి త్రాగినను, గన్నేరు వేఱువలనఁ గలిగినవిషవికార ముపశమించును.

2 వ చికిత్స.—

శ్లో. హారీతకీరసం చైవ ఫేనిలః ఫలజేన వా. 72
జలేన స్వరసం గ్రాహ్యం కరవీరవిషం హరేత్,

కరకకాయలను గాని, కుంకుడుకాయలను గాని, యుదకముచే నూఱి రసమును పిడిచికొని, పలప్రమాణము పుచ్చుకొనిన గన్నేరువేఱువలనఁ గలిగినవికార ముపశమించును.

### గురిగింజల వికారశాంతి.

శ్లో. మేఘనాదరసం గ్రాహ్యం శర్కరాయుక్తపానతః. 73
ఉచ్చటాయా వికారస్య శాంతి స్స్యా ద్దుగ్ధ సేవనాత్,

చిర్రికూరరసములో చక్కెరఁ గలిపి త్రాగినట్టైన గురిగింజలవలన కలిగిన వికారము శాంతించును.

2 వ చికిత్స.—

శ్లో. మధు ఖర్జూరమృద్వీకన్యతకా మ్లామ్రాచదాడిమం. 74
పరూషు రామ్లిక శ్చైవ యుక్తా సద్యో వికారనుత్,

తేనె, ఖర్జూరపుపండ్లు, ద్రాక్ష, చింతపండు, పుల్లప్రబ్బలి, దానిమ్మ, పేరీత పండ్లు, ఉసిరికపండ్లు, వీనిరసముల నేకము చేసి పుచ్చుకొనిన గురిగింజలవలన కలిగిన వికారము శాంతించును.

### అఫేన (నల్లమందు) విషశాంతి.

1 వ చికిత్స —

శ్లో. బృహత్క్షుద్రారసం దుగ్ధం పలమాత్రనిషేవణాత్. 75
నాగఫేనవిషం యాతి స జీవతి చిరం పుమాన్,

పెద్దవాకుడుకాయలరసము, ఆవుపాలు కలిపి, త్రాగిన నల్లమందు విషవికార ముపశమించును.

2 వ చికిత్స.—

శ్లో. ఉగ్రా సింధు స్తథా కృష్ణాఽప్యథో మదనకః ఫలం. 76

తత్తనీరేణ తద్దేయు మహిఫేనవిషం హరేత్,

వస, సైంధలవణము, పిప్పళ్లు, మ్రంగకాయలు, వీనిని సమభాగములుగ నుష్ణోదకమున నూఱి, పానముఁ జేసిన నల్లమందు వికారము శాంతించును.

3 వ చికిత్స —

శ్లో. టంకణం నీలతుత్థం చ ఘృతయుక్తం న దాపయేత్. 77
తేన శాంతి ర్భవే త్సద్యో నాగఫేనవిషం త్యజేత్,

వెలిగారము, మైలతుత్తము, వీనిని సమముగ చూర్ణించి నేతితో సేవించిన నల్లమందు వికారము శాంతియై శాంతించును.

—— నేపాళవిత్తుల వికారశాంతి. ——

శ్లో. ధనికం సితయా యుక్తం దధినా సహ యః పిబేత్. 78
దంతీబీజవికారస్య నివృత్తి స్తస్య జాయతే,

ధనియాలు కలకండ, వీనిని చక్కగ నూఱి పెరుగులోఁ గలిపి త్రాగిన నేపాళవిత్తులవికార ముపశమించును.

—— ముష్టివిత్తుల వికారశాంతి. ——

శ్లో. ఘృతం మధుసితాయుక్తం సదా పిబతి యో నరః. 79
విషకోచవికారస్య శాంతి స్తస్య ప్రజాయతే,

అఱతులము నెయ్యి, తులము చక్కెర, రెండుతులముల తేనె, కలిపి పుచ్చుకొనిన, ముష్టివిత్తులవలన కలిగినవికార ముపశమించును.

—— జీడిగింజల విషవికారశాంతి. ——

1 వ చికిత్స.—

శ్లో. సితయా సహ యామా చ్ఛ మేఘనాదరసస్య చ. 80
తస్మా ద్భల్లవిషం హంతి యథా లింగప్రసేవనాత్,

చిఱ్ఱికూరరసములో చెక్కెర గలిపి త్రాగిన శివలింగపూజనము చేతవలె జీడిగింజలవికార మొకజామున నుపశమించును.

2 వ చికిత్స.—

శ్లో. ఖాదిరం ధేనుపయసా సితాయుక్తం తథైవ చ. 81
య స్సేవయే ద్యామ మేకం భల్లాతకవిషం హరేత్,

ఆవుపాలలో చక్కెర, కాచు కలిపి త్రాగినట్టైన నొకజాములోపల జీడిగింజలవికారము శమన మగును.

3 వ చికిత్స —

శ్లో. సర్షపో మేఘనాదశ్చ నవనీతసమన్వితః. 82
భల్లాతకభయే శోఫే హంతి లేపేన దేహినః,

ఆవాలు, చిట్టిమూర, వెన్న సమభాగములుగ నూరి, లేపనముఁజేసిన జీడిగింజల వలన కలిగినవాపు శమించును.

4 వ చికిత్స —

శ్లో. దారుసర్షపముస్తాని నవనీతేన లేపయేత్. 83
భల్లాతకవికారోఽయం సద్యో గచ్ఛతి సత్వరమ్,

దేవదారుచెక్క, ఆవాలు, తుంగముస్తలు చూర్ణించి బట్టివెన్నలో కలిపి, లేపనముఁజేసిన జీడిగింజలవలన కలిగినవాపు, వికారము శాంతింబొందును.

5 వ చికిత్స.—

శ్లో. నవనీతం తిలాదుగ్ధం పునః ఖండయుతం తథా. 84
పతద్ద్వయప్రలేపేన హంతి భల్లాతకవ్యథాం,

వెన్న, నువ్వులనైనను, ఆవుపాలు, కలకండనైనను సమముగ నూరి, లేపనముఁ జేసినట్టైన జీడిగింజలవలన కలిగినవాపు శాంతించును.

6 వ చికిత్స.—

శ్లో. శిరీషం మేఘనాదం చ నవనీతసమన్వితం. 85
భల్లాతకవిషం హంతి లేపనేన క్షణాద్ధ్రువం,

దిరిసెనపుచెక్క, చిట్టియాకు వెన్నతో నూరి లేపనముఁ జేసిన జీడిగింజలవలనఁ గలిగినశోఫ హరించును.

7 వ చికిత్స.—

శ్లో. భల్లాతతైలసంపర్కాత్ స్ఫోటస్సంజాయతే నృణాం. 86
నవనీతం తిలైః పిష్ట్వా తల్లేపేన తు తం జయేత్,
బింబీపత్రప్రలేపాద్వా తం జయేత్తత్పదేన వా. 87
భల్లాతకస్య మూలస్య మృత్తికాభిః ప్రలేపయేత్,
తత్సంజాతవికారాణి నాశయత్యేవ నిశ్చితమ్ 88

జీడిగింజలనూనె తగిలినందువలన శరీరమందు వాపు, దురద, బొబ్బలు కనిపించును. అందుకు బట్టివెన్నతో నువ్వులునూరి పట్టించినను, దొండాకుపసరు లేపనముఁజేసినను జీడిచెట్టువేళ్లునందుండుమట్టి నుదకముతో నూరి లేపనము జేసినను జీడిగింజలవలన కలిగినబాధలన్నియును నుపశమించును.

## ఉపపాషాణవిషచికిత్స—మణిశిలవికారశాంతి.

శ్లో. క్షీరకం మాక్షికై ర్యుక్తం సేవయే ద్వై దినత్రయం,
శిలాజాతవికారం చ న కరోతి కథాచన. 89

అవుపాలు, తేనె వీటి నేకము చేసి, మూడుదినములు సేవించిన మణిశిలవిష వికారము హరించును.

## తాళకవికారశాంతి.

శ్లో. జీరకం శర్కరాయుక్తం సేవయే ద్దినసప్తకం,
తాళకస్య వికారస్య శాంతిం కుర్యా న్న సంశయః. 90

జీలకఱ్ఱ, శర్కర కలిపి యేడుదినములు పుచ్చుకున్నట్టైన తాళకమువలన కలిగినవికారము శాంతించును.

2 వ చికిత్స.—

శ్లో. కూశ్మాండస్య రసం దేయం దురాలభరసం తథా,
రాజహంసరసో తాన త్తాలకస్య విషం హరేత్. 91

బూడిదగుమ్మడికాయరసము, దురదగొండికూరస్వరసము సమాంశములు కలిపి త్రాగినను, రాజహంస ఆకురసమును సేవించినను తాళకభక్షణమువలన కలిగినవికారము ఉపశమించును.

3 వ చికిత్స.—

శ్లో. సువర్ణపుష్పభూనింబ క్వాథం సేవే ద్దినత్రయం,
తాలకస్య వికారస్య శాంతిం కుర్యా న్న సంశయః. 92

నల్లయుమ్మెత్తపువ్వులు, నేలవేము వీనిని సమభాగములు కషాయము చేసి, పుచ్చుకొనిన తాళకవికారము శాంతించును.

4 వ చికిత్స —

శ్లో. యథా రసవిషం హన్యా ద్గోదుగ్ధేన చ గంధకం,
సితాసర్పాక్షీకరసం తథా తాళవిషం పునః. 93

అవుపాలచే శుద్ధిచేసినగంధకము సేవించుటవలన పాదరసదోషము హరించు విధమున శర్కర, సర్పాక్షీరసము సమాంశములు కలిపి, పానము చేయుటవలన తాళకవికార ముపశమన మగును.

## మాక్షిక వికారశాంతి.

శ్లో. కులుత్థస్య కషాయేణ మాక్షికస్య విషం హరేత్,
తథైవ దాడిమత్వక్చ దేహస్య సుఖకాంక్షిణః. 94

ఉలవలకట్టు త్రాగినను, దానిమ్మపండ్ల పైబెరడు దంచి పిడిచినరసమును పానముఁ జేసినను మాక్షికత్రయమువలన కలిగినవికారము శమించును.

### తుత్థక వికారశాంతి.

శ్లో. జంబీరరస మాదాయ పిబే ధ్య స్త్రిదినం నరః,
శాంతి స్స్యా త్తుత్థకవిషం తద్విధం లాజవారిణా. 95

నిమ్మపండ్ల స్వరసమును గాని, వరిపేలాల నుదకమున వేసి కాచి పిసికి వడియ గట్టిన యుదకమును గాని మూఁడుదినములు పుచ్చుకొనినయెడల అశుద్ధపాలతుత్థము, మైలతుత్థమువలన కలిగినవికారము హరించును.

### అంజనవికారశాంతి.

శ్లో. మాతులుంగరసే నైవ జంబీరఫలజేన వా,
శార్ఙ్గేష్టస్య రసే నైవ దాడిమీజ రసేనవా. 96
కాంజికస్యచపానేన అంజనానాంవిషం జయేత్,

మాదీఫలరసమునుగాని, నిమ్మపండ్లరసమునుగాని, పులిచెంచలియాకురసమును గాని, పుల్లదానిమ్మపండ్లరసమునుగాని, పెద్దజొన్నకలినిగాని పుచ్చుకొనిన అంజనపురాయి పుచ్చుకొనినందున కలిగిన వికారములు శాంతించును.

### విషాన్నస్పర్శజరోగ తచ్చికిత్స

శ్లో. స్పృష్టే తు కండూదాహోషా జ్వరార్తి స్ఫోటసుప్తయః. 97
నఖరోమచ్యుతి శ్శోఫ స్సేకా ద్యా విషనాశనాః,
శస్తా స్తత్ర ప్రలేపాచ్చ సేవ్యచందన పద్మకైః. 98
ససోమవల్క తాళీస పత్రకుష్ఠామృతానతైః,

విషముతోఁగూడియుండు నన్నాదులను ముఖము, హస్తము మొదలగు నంగములచే స్పృశించినచో శరీరమునం దంతట నొక్కొక్క ప్రదేశమునందును దురద, తాపము, జ్వరము, శూల, బొబ్బలు, కాళ్లు చేతులు చచ్చుబాయుట, గోళ్లు వెండ్రుకలు నూడిపోవుట, శోఫ యను నీయుపద్రవములు కలుగును. వీనియందు సోమలతపట్ట, (లేక గుమ్మడిరేగు) తాళిసపత్రి, చెంగల్వకోష్టు, తిప్పతీఁగె, గ్రంధితగరము, తెల్లవట్టివేరు, చందనము, పద్మకము వీనిచే ప్రలేపనమును, విషనాశకరములైన సేకాదులను చేయుటచే హితకరముగ నుండును.

### నక్రగత విషోపద్రవతచ్చికిత్స.

శ్లో. లాలాజిహ్వోష్ఠయో ర్జాడ్య మూషాచిమచిమాంసితం. 99

దంతహర్షో రసాజ్ఞత్వం హనుస్తంభశ్చ వక్త్రగే,
సేవ్యాద్యైస్తత్ర గండూషా సర్వం చ విషజిద్ధితం. 100

విషము నోటియందుఁ దగిలినచో, జొల్లుకాఱుట, నాలుక పెదవులు వీని యందు జడత్వము, తాపము, చిమిచిమియనుట, దంతహర్షము, నాలుకయందు రసజ్ఞానము లేకుండుట, చెక్కిళ్లు కిట్టుకొనుట అను నియుపద్రవములు కలుగును; వీని యందు పైఁజెప్పిన తెల్లవట్టివేరు మొదలగు నౌషధములచే గండూషమును, విషహారంబులగు సమస్తమైన క్రియలను చేయుట హితకరమై యుండును.

ఆమపక్వాశయగత విషోపద్రవ చికిత్స.

శ్లో. ఆమాశయగతే స్వేదమూర్ఛాధ్మానమదభ్రమాః,
రోమహర్షోవమర్దాహ శ్చక్షుర్హృదయరోధనం. 101
బిందుభిశ్చాచయోంగానాం పక్వాశయగతే పునః,
అనేకవర్ణం వమితిమూత్రయత్యతిసార్యతే. 102
తంద్రా కృశత్వం పాండుత్వ ముదరం బలసంక్షయః,
తయో ర్వాంతవిరక్తస్య హారిద్రే కటభీం గుదం. 103
సింధువారిత నిష్పావబాష్పికాశతపర్వికాః,
తండులీయకమూలాని కుక్కుటాండ మవల్గుజం. 104
నావనాంజనపానేషు యోజయే ద్విషశాంతయే,

విషముచే దుష్టమైన యన్నము ఆమాశయమును జెందినచో స్వేదము, మూర్ఛ, అధ్మానము, మదము, భ్రమము, రోమహర్షము, వాంతి, తాపము, నేత్రములు తెలియకుండుట, ఱొమ్ము డచుకొనుట అను నియుపద్రవములు కలుగును. విషదుష్టమైనయన్నము పక్వాశయమును జెందినయెడల, శరీరము నానావిధబింబములచేత వ్యాప్తంబై యుండును; నానావిధవర్ణములుగ వాంతి యగును. మూత్ర మధికముగ వెడలును. అతిసారము, తంద్ర, కృశత్వము, పాండువు, ఉదరరోగము, బలక్షయము కలుగును; పైనఁజెప్పినప్రకారము, ఆమాశయ పక్వాశయములయందు విషసంబంధము గలపురుషులలో ఆమాశయమునందు విషసంబంధముగల పురుషునికి యథాయోగముగ మ్రంగకాయ, అనగపుతీఁగ, గుమ్మడిరెగు, బీరకాయ, తేనె, అనుములు వీనితో కూడియుండు నుదకముచే వమనకర్మను చేయించి, పిదప స్నేహకర్మను విరేచనమును చేయింపవలయును; పక్వాశయమునందు విషసంబంధము గల పురుషునికి యథాయోగముగ పూర్వోక్తౌషధములచే వమనమును చేయించి, నీలికాయలతో కూడియుండుఘృతము నిచ్చి విరేచనముఁ జేయింపవలయును. ఇటుల యథాయోగ్యముగ వమనవిరేచనకర్మలను చేయించి, పసుపు, మ్రానిపసపు, కటభి(అనఁగా,

గినియు,) గారపండు, వావిలి, అనములు, బాష్పిక, (హింగుపత్రి,) శతపర్విక, నల్ల వస, చిట్టివేరు, కోడిగుడ్డు, బావంచివిత్తులు అనువానిచే నస్యము, అంజనము, పానము అనువానిఁ జేయించిన విషము శాంతించును.

### విషనివర్తకౌషధోపయోగము.

శ్లో. విషభుక్తాయ దద్యాచ్ఛ శుద్ధా యోర్ధ్వ మథ స్తథా. 105
సూక్ష్మం తామ్రరజః కాలే సక్షౌద్రం హృద్విశోధనం,
శుద్ధే హృది తత శ్శాణం హేమచూర్ణస్య దాపయేత్. 106

విషమును భుజించినవానికి వమనవిరేచనముల చేయించి, సూక్ష్మంబును, హృదయశుద్ధికారియు నైనతామ్రరజస్సును తేనెతో చేర్చి యొసంగవలయును; హృదయము శుద్ధియైనపిదప శాణప్రమాణము (కర్షములో నాలవభాగము) గల హేమచూర్ణమును కాలదేశాదుల ననుసరించి యొసంగవలయును.

### స్థావరజంగమవిషముల కన్నిటికి చికిత్సలు.

1 వ చికిత్స —

శ్లో. తుత్థగంధరసరాత్రిటంకణై ర్వేణితోయపరిమర్దయే ద్దృఢం,
హాం త్యయం విషహరో నరాంబునా స్థావరంతదనుజంగమంవిషం.

మైలతుత్థు, గంధకము, పాదరసము, పసపు, పొంగించిన వెలిగారము వీనిని చూర్ణము చేసి, చేదుసొరకాయరసముచేత భావనచేసి, జొన్నగింజలంతమాత్రలుచేసి నరమూత్రముతో నిచ్చిన స్థావరజంగమవిషములు హరించును.

2 వ చికిత్స.—

శ్లో. వృషభూనింబపత్రాణి పటోలంచ పలం పలం,
తోయే చాష్టగుణే క్వాథ్యం పాదశేషం సమాహరేత్. 108
క్వాథతుల్యం ఘృతం గవ్యం ఘృతార్ధ మభయారసం,
ఘృతశేషం పచే త్సర్వం పానా ద్విషహరం ఘృతం. 109

అడ్డసరము, నెలవేము, చేదుపొట్ల వీని ఆకులను ప్రత్యేకము పలము చొప్పున కూర్చి, యిరువదినాలుగుపలముల జలమువైచి నాలుగవభాగము కషాయము మిగులునటుల కాచి దానికి సమముగ ఆవునేయి, నేతికి సమము కరక్కాయలస్వరసము కలిపి, ఘృతపక్వముగ కాచి సేవించిన స్థావరజంగమవిషములు హరించును.

3 వ చికిత్స —

శ్లో. సమూలపత్రాం సర్పాక్షీం జలేన క్వథితం పిబేత్,
నరమూత్రైశ్చ వా పిష్టం పిబే త్సర్వగరాపహాం. 110

సర్పాక్షిచెట్టు సమూలముగ దంచి యుదకముచే కషాయముగాచి త్రాగినను లేక నరమూత్రముతో ముద్దగనూరి త్రాగినను సర్వస్థావరజంగమవిషములు హరించును.

4 వ చికిత్స.—

శ్లో. న్యగ్రోధో రజనీ కుష్ఠం పిష్ట్వాజ్యం గృహధూమకం,
తండులీయకమూలేన. కర్షం గరహరం పిబేత్, 111

మఱ్ఱిపట్ట, పసుపు, చెంగల్వకోష్టు, కట్టెధూపము, చిఱ్ఱివేరు వీనిని సమభాగములుగ నూరి, కర్షప్రమాణమును నేతిలోఁ గలిపి సేవించిన సమస్తవిషములు హరించును.

5 వ చికిత్స.—

శ్లో. పుత్రజీవఫలా న్మజ్జాం శీతతోయేన పేషయేత్,
భోజనే చాంజనే పానే లేపే స్సర్వవిషాపహం. 112

పుత్రజీవఫలముల గుజ్జునుగాని, పప్పునుగాని శీతోదకముతో కలిపి అన్నపానములతో భక్షించుటచేతను, దేహమునకు లేపనము చేసికొనుటచేతను సర్వస్థావరజంగమవిషములు హరించును.

6 వ చికిత్స —

శ్లో. స్థావరం జంగమం క్రూరం కృత్రిమం యోగజం తథా,
నిష్కమాత్రం చ తన్మజ్జాం పిబే త్సూర్విరవిషాపహం. 113

పూర్వోదాహృతమైన పుత్రజీవిఫలములయొక్క పప్పును నిష్కప్రమాణము సేవించిన స్థావరజంగమకృత్రిమవిషములు హరించును.

7 వ చికిత్స.—

శ్లో. శాద్వలం టంకణం తుత్థం కట్ఫలం రజనీ వచా,
నరమూత్రేణ సంపిష్య మేకైకం తు విషం హరేత్. 114

తెల్లగఱిక, వెలిగారము, మైలతుత్తము, పెగ్గుమ్మడుగడ్డ, పసుపు, వస అనువివస్తువులన్నిటిని చేర్చిగాని, ప్రత్యేక మొక్కొక్కవస్తువునేకాని నరమూత్రముతో నూరి పుచ్చుకొన్నయెడల ఉగ్రములైన విషవేగములు హరించును.

8 వ చికిత్స.—

శ్లో. సమూలపత్రాం సర్పాక్షీం తథైవా దేవదానికాం,
గిరికర్ణిశ్చ మూలం చ నరమూత్రేణ పూర్వవత్. 115

సమూలమగు సర్పాక్షీవృక్షమునుగాని, సమూలమగు దేవదానీవృక్షమునుగాని, సమూలమగు తెల్లగంటెనవేరునుగాని నరమూత్రమున నూరి త్రాగినట్టయిన సర్వమైన స్థావరవిషములు హరించును.

9 వ చికిత్స.—

శ్లో. త్రికటుం దేవదానీం చ నస్యే సర్వవిషాపహం,
టంకనం దేవదానీ చ జలపానే విషాపహం. 116

దేవదానిచెట్టు సమూలము, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు కలియనూరి నస్యము చేసినను, దేవదాని సమూలము, వెలిగారము నూరి యుదకమున గలిపి త్రాగినను స్థావరజంగమవిషములు హరించును.

10 వ చికిత్స—

శ్లో. బ్రహ్మదండీయమూలం చ మధునా సహభక్షయేత్,
శ్వేతాం కోలస్య మూలే చ ముఖస్థే తిలకే యథా. 117
ముఖస్థె రండమూలం వా ఛాయా శుష్కం విషాపహం,

బ్రహ్మదండివేరును తేనెచె నూరి భక్షించినను, తెల్లని యూడుగవేరును నోటిలోనుంచుకొని రసమును మ్రింగుచుండినను, చాది తిలకము బెట్టికొనినను, యెండించిన అమిదపువేరును నోటియందుంచుకొని రసమును మ్రింగుచుండినను స్థావరవిషము హరించును.

11 వ చికిత్స.—

శ్లో. నీలసర్పస్య పుచ్ఛం తు కృకలాసస్య పుచ్ఛకం. 118
తామ్రేణవేష్టితం కృత్వా ముద్రికాంతాం చ ధారయేత్,
తయా స్పృష్టజలం పీత్వా స్థావరం జంగమం హరేత్. 119

నల్లని త్రాచుపాము యొక్కతోక, తొండయొక్కతోక రాగిరేకులో పొదగి యుంగరముగాని, కడియముగాని చేయించి ధరించి యుంచుకొని సమయమువచ్చి నప్పుడు యుదకమునందు దానిని ముంచి అయుదకము త్రాగించినట్లయిన స్థావర జంగమవిషములు హరించును.

12 వ చికిత్స.—

శ్లో. భూనాగసత్వసంజాతాం ముద్రికాం ధారయేత్కరే,
న తస్యా క్రమతే సత్యం విషం స్థావరజంగమం. 120
తత్ స్పృష్టోదకపానేన విషం సర్వం వినశ్యతి,

ఎఱ్ఱలలో తీసినరాగివలన నుంగరము చేయించి వ్రేలికి ధరించుకొని వలయు నప్పు డీయుంగరము నుదకమున ముంచి యాయుదకమును త్రాగించిన స్థావరజంగమ విషములు హరించును.

13 వ చికిత్స —

శ్లో. శిరీషబ్రధ్నకం గ్రాహ్యం రేవత్యాం చందనాన్వితం. 121
తద్ఘృష్టం మర్దితం గాత్రే తస్యాంగే విషనాశనం,

రేవతీనక్షత్రదివసమందు దిరిసెనపుచెట్టుయొక్క అడుగుమొద్దును తెచ్చి దాని మీఁద నుదకమును చల్లుచు చందనపుచెక్కతో రాచి గంధమును తీసి అగంధమును దేహమునం దలందిన స్థావరజంగమవిషములు హరించును.

14 వ చికిత్స. —

శ్లో. వరాహగోధానకులశశకుక్కుటపిత్తకం. 122
శ్వేతయా గిరికర్ణాశ్చ ఫలం మూలం చ పేషయేత్,
పానే సర్వవిషం హంతి మృతోఽప్యుత్తిష్ఠతే క్షణాత్. 123
నామ్నా చామృతయోగోఽయం స్వయం రుద్రేణ భాషితం,
పణవం పటహం చైవ హ్యనేనైవ ప్రలేపయేత్. 124
మృతోఽపి విషయోగేన శ్రుత్వా వాద్యం ప్రబుధ్యతే,

అడవిపంది, ఉడుము, ముంగిస, కుందేలు, కోడి అనువానిపిత్తములు, తెల్లగంటెనవేరు, దానికాయలు నీయేడువస్తువులు సమాంశములుగ కూర్చి కలియనూఁటి పుచ్చుకొన్నచో సర్వవిషములు హరించుటయేకాక విషముచే చచ్చుటకు సిద్ధమై యున్నవాఁడు సైతము తత్క్షణమే బ్రతుకును. మఱియు నీయౌషధమును తప్పెటలకుగాని, భేరీలకుగాని, ఢంజలకుగాని, మద్దెలలకుగాని, డోళ్లకుగాని లేపనముచేసి విషదష్టుఁడై స్మృతిదప్పి పడియున్నవాని చెంగట మ్రోగించిన వానిధ్వని చెవిని జొరఁగానే ప్రజ్ఞ గలిగి బ్రతుకును. ఇది పూర్వము పరమేశ్వరునిచే వచింపఁబడిన అమృతయోగము.

15 వ చికిత్స. —

శ్లో. శ్వేతాపరాజితామూలం పీత్వా దుగ్ధేన మానవః. 125
స్థావరం చ విషం హంతి ఉదరస్థం న సంశయః,

తెల్లగంటెవేరును ఆవుపాలతో నూఱి పుచ్చుకొనిన గర్భస్థమై యున్న స్థావర విషము నిస్సంశయముగ హరించును.

16 వ చికిత్స. —

శ్లో. ససింధుకాంజికం పీత్వా స్థావరాదివిషం హరేత్. 126

కలిలో సైంధవలవణమును మెత్తఁగ నూఱి కలిపి త్రాగిన స్థావరవిషము నిస్సంశయముగ శమించును.

17 వ చికిత్స. —

శ్లో. స్థావరేణ విషే ణార్తం నరం యత్నేన వామయేత్,

వమనేన సమం నాస్తి యత స్తస్య చికిత్సితం. 127

స్థావరవిషార్తునకు వమనమును చేయించుటతో సమానమైనచికిత్స మఱియొకటి లేదు; గనుక సర్వప్రయత్నములచేత వమనచికిత్సనే ముఖ్యముగ చేయించవలెను.

18 వ చికిత్స —

శ్లో. విష మత్యర్థ ముష్ణం చ తీక్ష్ణం చ కథితం యతః,
అత స్సర్వవిషే ష్వాక్తః పరిషేకస్తు శీతలం. 128

విషోల్బణ మనునది మిక్కిలి యుష్ణము, చుఱుకుదనము కలిగియుండును గనుక విషార్తునకు శిరమందున శీతోదకముచే కొన్నిబిందెల యుదకమును ధారగా పోయుట ముఖ్యమైన చికిత్సయగును.

19 వ చికిత్స.—

శ్లో. ఔష్ణ్యా త్తైక్ష్ణ్యా ద్విశేషేణ విషం పిత్తం ప్రకోపయేత్,
వమితం సేవయే త్తస్మాత్ శీతలేన జలేన చ. 129

విషప్రకోపమనునది యుష్ణమగుటవలనను, తీక్ష్ణమైనదగుటవల్లను పిత్తప్రకోపమును కలుగఁజేయునుగాన శీతజలసేచనమును వమనమును ముఖ్యముగ చేయింపవలెను.

20 వ చికిత్స.—

శ్లో. పాయయే న్మధుసర్పిర్భ్యాం విషఘ్నం భేషజం ధ్రువం,
భోక్తు మమ్లరసం దద్యా ద్ఘ్రాపయే న్మరిచాని చ. 130

తేనె, నేయి సమభాగములు కలిపి త్రాగించినను, నిమ్మపండ్లరసముతో మిరియాలచూర్ణము కలిపి త్రాగించినను స్థావరవిషములు హరించును.

మంత్రము. ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ, కుంచితాభ్యుత మర్చిత జటాయ ఠః ఠః స్వాహా.

అను నీమంత్రముచే పైఁజెప్పఁబడిన సర్వౌషధముల నభిమంత్రించి పుచ్చుకొనవలయును. ఈమంత్రసిద్ధికి 1108 పురశ్చరణ చేయవలెను.

గద్యమ్. ఇతి శ్రీమద్రఘురాత్మజామనోరమకరుణాకటాక్షవీక్షణాసాదిత భైషజ్యవిద్యాప్రవీణేన బొడ్డికూరపాటి వేంకటకృష్ణవైద్యసుధాకర పౌత్రేణ వేంకటనృసింహాభిషక్పురందరపుత్రేణ వైద్యజ్యోతిషకవిత్వ విద్యాపారీణేన వృశ్చికీత్యాసంగ్రహధాతుమారణశోధనవిధాననాడ్య జ్ఞానదుర్వాదనిర్వాపణాదిగ్రంథరచనాధురీణేన వేంకటరంగాభిధాన భిషగ్వరేణ విరచితే విషవైద్యచింతామణౌ స్థావరవిషచికిత్సా నామ ద్వితీయో మయూఖః సమాప్తః.

---

శ్రీ ర స్తు.

# వి ష వై ద్య చి న్తా మ ణి.

జంగమవిషచికిత్సానిరూపక

## తృ తీ య మ యూ ఖ ము.

——(౦)——

శ్రీమత్సమస్తలోకైకశరణ్యం భవకూకుదం,
హనూమదర్చితం వందే శ్రీరామాంఘ్రిద్వయాంబుజమ్. 1

సమస్తసంపదలతో కూడియున్న సర్వలోకములకును ఆశ్రయమైనదియును, సాంబమూర్తికి సాలంకృతకన్యాదానము సంగినదియు నంతరంగభక్తుఁడైనహనుమంతునిచే నిరంతరము పూజింపఁబడునదియు నగు శ్రీరామపరబ్రహ్మముయొక్క పాదపద్మద్వయమును గూర్చి నమస్కరించుచున్నాను.

అథాత స్సంప్రవక్ష్యామి జాంగమం విషలక్షణం,
పృథగ్విధా శ్చికిత్సా శ్చ మంత్రతంత్రౌషధాదినా. 2

ఇఁక జంగమవిషలక్షణమును, దాని కనేకవిధములగు మంత్రతంత్రౌషధాది చికిత్సలను వచించుచున్నాను.

### ఎనిమిదివిధములగు జంగమవిషజంతుగణముల వివరము

జంగమా అష్టధా ప్రోక్తాః అళర్కాద్యా స్తథైవ చ,
నాగాదయో వృశ్చికాద్యాః తథా శతపదాదయః. 3
లూతాదయో మూషికాద్యాః గోధాద్యా దర్దురాదయః,

పిచ్చికుక్క మొదలైనచతుష్పాదజంతువులగణము, సర్పాదిగణము, వృశ్చికాదిగణము, శతపదాదిగణము, లూతాదిగణము, మూషికాదిగణము, మండూకాదిగణము అని జంతువుల నెనిమిదితరగతులుగ విశాస్త్రము విభజించుచున్నది.

### అళర్కాదిగణము

శ్వానసృగాలో మార్జారో గహనోతు ర్వృకో హరిః. 4
వ్యాఘ్రో ద్వీపి మృగాదశ్చ భల్లుకశ్చ మహామృగః,
ఏతే చోన్మత్తయుక్తా శ్చే దళర్కా శ్చ ప్రకీర్తితాః. 5

కుక్క, నక్క, పిల్లి, అడవిపిల్లి, తోడేలు, సింహము, పెద్దపులి, [illegible]పులి, సివంగి, ఎలుగుబంటి, కొర్నగండు అను నాలుగుకోఱలుగల చతుష్పా[illegible]తువులకు వెఱ్ఱియెత్తి కఱచినప్పుడు మనుష్యులకు సంభవించువిషమునకు అళర్కవిష మని చెప్పఁబడును. పైచెప్పఁబడినమృగములకు వెఱ్ఱియెత్తి మనుజులను కఱచినప్పుడు అఱువదిదినములలో విషమెక్కును. అప్పుడామనుజుల కామృగములచేష్టలును అఱుపును గలుగును.

### నాగాదివిషజంతుగణము

నాగాః దర్వీకర శ్చైవ మండలీ రాజిలా స్తథా,
క్షుద్రపన్నగజాతి శ్చ అహిషోరగకథ్యతే. 6

అష్టఫణు లనఁబడుదేవనాగములు, గరిటెలవలెగాని తెడ్లవలెగాని పడిగలు గలిగి యుండు దర్వీకరములు, పొడపింజరలు, చుక్కలు అడ్డగీరలు నిలువుగీరలు కలిగియుండు రాజీమంతములు, క్షుద్రజాతిసర్పములు, నిర్విషసర్పములు నాగాదిగణ మనంబడును.

### వృశ్చికాదివిషజంతుగణము

వృశ్చికశ్చ్చ చ్చిటింగశ్చ పత్రాళిర్చ మర స్తథా,
కందోలీ చర్వణా చైవ సరఘా మశకాని చ. 7
ఏతే హ్యష్టౌ శూకవిషా స్సద్యః క్షోభకరా స్మృతాః,

తేళ్లు, మండ్రిగబ్బలు, ఆకుతేళ్లు, తుమ్మెదలు, కందిరీగలు, అడివియీగలు, తేనెటీఁగలు, దోమలు అనునవి తోకముల్లుతో కుట్టునవి వృశ్చికాదిగణ మనంబడును.

### శతపద్యాదివిషజంతుగణము

మహాశతపదే చైవ శతపాదీ చ మాసలీ. 8
శతపాదాదికాః ప్రోక్తాః సక్రూరా విషజంతవః,

తాటిజెఱ్ఱి, జెఱ్ఱి, రోకటిబండపురుగు అనునవి శతపద్యాదిగణ మనఁబడును.

### లూతాదివిషజంతుగణము

లూతాబిలేశయ శ్చైవ జలమండలికా తథా. 9
అగ్నిమండలినామ్నా చ కణభో గలగోడికా,
పతంగ శలభ శ్చైవ భృంగారాగ్నిపిపీలికా. 10

లూతలు (సాలెపురుగు), బొరియపరిటలు, జలమండలి, అగ్నిమండలపురుగు, కణభము, పులికోను, చిమ్మట, మిడత (మిడుత), చలిచీమ అనునవి లూతాదివిషజంతు గణ మనఁబడును.

### మూషకాదిగణము

మూషకో దీర్ఘదేహీచ గిరికా గంధమూషికా,
మూషకాద్య మితి ప్రోక్తం మానవానాం భయంకరం. 11

దీర్ఘదేహీ= పందికొక్కు, మూషక = యెలుక, గిరికా = చిట్టెలుక, గంధమూషికా=చుంచెలుక అనునవి మూషికాదిగణ మనంబడును.

### గోధాదివిషజంతుగణము

గోధాక్రోడక శ్చైవ నకులః కృకలాసకః,
సరటా గృహగోధిశ్చ గోధ్యాదికగణం భవేత్. 12

ఉడుము, ఉడుత, ముంగిస, తొండ, నలికీచు, బల్లి అనునవి గోధ్యాదిగణ మనంబడును.

### మండూకాదివిషజంతుగణము

సవిషశ్లవ దుర్నామ శకులీ మండుకాదికం,

విషపుకోరలుగల కప్ప, ఏనుఁగజలగ, చేడిసచేప, ఉేకుచేప అనునివి మండూకాదిగణ మనంబడును.

### అళర్క (పిచ్చికుక్క మొదలగువాని)విషవిచారము

సాపస్మారచతుర్దంష్ట్రాః చతుష్పాత్క్రూరజంతవః. 13
అళర్కా ఇతి విఖ్యాతా శ్శునకాః జంబుకాదయః,
తేషాం విషం మహాఘోరం సర్వప్రాణిహరం భువి. 14
తస్మాత్తత్తన్నిదానాని విషలింగాని కథ్యతే,

పూర్వోదాహృత మగువెఱ్ఱిబట్టిన నాలుగుకోరలు నాలుగుకాళ్లుగల కుక్క, పిల్లి మొదలైనగ్రామీణజంతువులును, నక్క తోడేలు మొదలైన అటవికజంతువులును అళర్కము లనఁబడును. అవి కఱచినందువలన సంభవించువిషము అళర్క విషమని చెప్పఁబడును. ఈవిషము మహాభయంకరమై మనుష్యాదిజీవులప్రాణహరణమందు నమోఘసత్వముగలదియై యేదేశమునందుగాని, యేదేశవైద్యమునందుగాని ప్రతిక్రియ లేనిదై యున్నది; కనుక నీవిషముయొక్క నిదానచిహ్నములను వచించుచున్నాను.

### అళర్కవిషోద్రేకకాలపరిమితి

అళర్కదంశమారభ్య షణ్మాసం తద్విషం స్మృతే. 15
తదాది మాసపర్యంతం పశ్చాన్మాసార్ధ మేవ చ,
ఆపాదమస్తకవ్యాప్తం తత స్తద్విషకోపనం. 16

షష్టివాసరపర్యంత మళర్కస్య భయం న హి,
పథ్యే సతి విషార్తస్య నోద్రేకం మాసకద్వయం. 17
ఏకషష్టిదినే చిత్రం విషోద్రేకా స్వినాశయేత్,

పిచ్చికుక్కగాని, పిచ్చినక్కగాని కఱచినది మొదలు పదిరేనుదివసములవఱకు విషము గాయమునందే యుండునుగాని తక్కినశరీరమున కెగఁబ్రాకదు. పదిరేను దినములు గడిచినదిమొదలు పిమ్మట నొకమాసమునకుగాని, యొకటిన్నరమాసమునకు గాని సర్వశరీరమునకు వ్యాపించును. అనఁగా నఱువదిదినములకు శరీరమంతటికి వ్యాపించును; పథ్యముచేయుచున్ననే ఆఱువదిదినములవఱకు విషభయము లేదు; అఱువదియొకటవదినమందు తప్పక విషమెక్కి రోగిని చంపివేయును. పథ్యము చేయనిచో అఱువదిదినములకు లోపలనే విషమెక్కును. మొత్తమునకు రెండునెలలు గడిచినపిమ్మట నచ్చుమొదటిదివసమునందు తప్పక విషమెక్కి మృతిని కలుగఁజేయుట సుప్రసిద్ధమై యున్నది. విషమెక్కిన పిమ్మట నింటుకు చికిత్సయే లేదని సిద్ధాంతము.

## వెఱ్ఱికుక్కవిషనిదానము

ఆదౌ శీతభయం చాపి జ్వరం కంపం క్షుతే వ్యథా. 18
అతీవ వమనం శ్లేష్మం పేశీరూపం ముహుర్ముహుః,
సర్వత్ర జలభీశ్చైవ ప్రలాపం రోదనం తథా. 19
శ్వానచేష్టాని లింగాని మధ్యేమధ్యే మతిభ్రమః,
అత్యంతం క్షుత్పిపాసార్తిః ప్రచండజ్వరశోషణం. 20
విషప్రకోపా త్పూర్వే స్యా త్సుసాధ్యం తదనంతరం,
హరిణాపి హరేణాపి శక్యం జీవయితుం న హి. 21
తదహేచ ద్వితీయాహే తృతీయే వా మృతి ర్భవేత్,
ఇద మాంగ్లేయభాషాయాం హైడ్రోఫోబ్యేతి కథ్యతే. 22

వెఱ్ఱికుక్కవిష ముద్రేకించు ప్రథమదినమందు శరీరమునకు శీతలస్పర్శము కలుగుట, చలిపెట్టుట, గ్రీష్మఋతువునందలి గాలియైనను శీతలముగఁ గాన్పించుట చలికి మిక్కుటముగ భయపడుట, ప్రచండమైన దోషజ్వర మేర్పడుట, సన్నిపాతగతివలె కరచరణహృదయనాడులు కొట్టుకొనుచుండుట, దేహము వణకుచుండుట, ఆదివఱకు శుభ్రముగ మానిపోయి బాధారహితముగ నుండు(కుక్కచే కఱువఁబడిన) గాయము నందు వాపును నొప్పియు నేర్పడుట, పదేపదే తెల్లనికండలవంటి శ్లేష్మము వమన మగుట, సర్వకాలసర్వావస్థలయందును జలమును చూచినను జలప్రస్తాపము వినినను విలవిల తన్నుకొని భయపడుట, అఱచుట, తననోటితో జలప్రస్తావన చేయకుండుట

జలధారను చూచిన వడవడవడఁకుట, యేడ్చుట, కుక్కవలె నఱచుట, కుక్కచేష్టలు చేయుట, అప్పటప్పటికి మైకము కలుగుచుండుట, తీవ్రమైన అకలి దప్పులు కలిగి యుండియు అన్నముదకముచే ఐండఁబడినదనియు, ఉదకమును చూడవలసివచ్చుననియు జ్ఞప్తికి తెచ్చుకొని భయపడుచు అన్నపానములను విసర్జించి యుండుట, ఇట్టి తలంపు చేతనే మలమూత్రములను నిరోధించి యుండుట, శోషపోవుట మొదలగు గుణము లేర్పడి విషమెక్కినదివసమందుగాని, రెండవదివసమందుగాని, మూడవదివసమందు గాని మృతిచెందును. ఈఅళర్కవిషార్తుని హరిహరాదులైనను విషమెక్కినపిదప ప్రతికింపఁజాలరు. వెఱ్ఱికుక్క కఱచినవానిని విషమెక్కుటకు ముందు మందు నిచ్చి నిశ్చయముగ ప్రతికింపవచ్చును. మఱియు పిచ్చికుక్క, నక్క మొదలైనవానివిషమునకు నింగ్లీషుభాషలో (హైడ్రోఫోబ్యా) అని చెప్పంబడును.

## పిచ్చికుక్కచే కఱవఁబడినవాఁడు చేయవలసిన పథ్యవిధి

అళర్కదంశమారభ్య తతో మాసద్వయావధి,
పూర్వం చౌషధపానాద్వా మద్యమాంసాండమత్స్యకాః. 23
కుళుత్థమాషనిష్పావ కంబుకంగ్వశ్చకోద్రవాః,
నిస్సారాబరకాశ్చైవ శ్యామాకా తిలసర్షపాః. 24
అతసీ శాకతిల్వేచ కర్కటీ బీజగృంజనే,
ప్రయస్థం చ తథా మూత్రం వపనాభ్యంజనం రతం. 25
భేరికాకాహళానద్ధ మృదంగాకర్ణనం తథా,
రథధూమరథాభ్యాం చ గజాశ్వారోహణాదిభిః. 26
నిమ్నోన్నతాటనాలోకం భూరిజ్వాలాజలేక్షణం,
శింబీసస్యేషు హవ్యేషు సంచారం నదనేషుచ. 27
ధూమనౌకాప్రయాణం చ పథాయాసోఽబ్ధివర్జనం,
ఏవమాదీని కార్యాణి కుర్యాచ్ఛే ద్విషదోషభాక్. 28

పిచ్చికుక్క కఱచినది మొదలు రెండుమాసములవఱకుగాని ఔషధము పుచ్చుకొనువఱకుగాని, మద్యపానము, మాంసము, గ్రుడ్లు, చేపలు, ఉలవలు, మినుములు, అనుములు, సజ్జలు, కొఱ్ఱలు, అరికలు ఐరిగెలు, బరిగలు, చామలు, నువ్వులు, ఆవాలు, అవిసెకూర, నూనె, దోసగింజలు, నీరుల్లి, తిరుగమాత, (లేక పొగపుకోయి నూనె మొదలగువానిలో వేసి తాలింపఁబడినవి.) మామిడిపండు, కాయ, పిందె పచ్చడి, ఊరగాయ మొదలైనవన్నియు భుజించుట క్షౌరము, తలంటుచేసికొనుట, నగారా,ఢంక,రుంజ, మద్దెల, మొదలైనవానిధ్వనులను వినుట, బండ్లు, పొగబండ్లు,

ఏనుగలు, గుఱ్ఱములు మొదలైనవానిపై నెక్కి ప్రయాణముచేయుట, అగాధస్థలముల యందు, ఎత్తైనస్థలములయందు తిరుగుట, చూచుట, గొప్పఅగ్నిజ్వాలలు, నీటిచేనిండి యున్నకుంటలు, గుంటలు, చెరువులు, నదులు, సముద్రము, మొదలయినవానిని చూచుట, కాయధాన్యపుపైరులుండు పొలములలోను, గున్నినపొలములలోను, ఉద్యానవనములందును సంచారము చేయుట, పొగయోడలమీఁద ప్రయాణము చేయుట, మార్గశ్రమము, సముద్రమును చూచుట, మొదలైన కార్యములను వర్జింపవలసినది.

### పిచ్చికుక్కచే కఱువఁబడినవాఁ డౌషధము బుచ్చుకొనువఱకు దగినపథ్యము

శ్వానదంశన మారభ్య ఔషధగ్రహణావధి,
సుఖోష్ణవారిణా స్నానం కాదాచిత్కం సమాచరేత్. 29
మరీచచూర్ణం లశునం తువరీముద్గసూపకం,
కుణంబం బాలవార్తాకం కటుతక్రం ఘృతం దధి. 30
శాల్యన్నం యావనాళాన్నం గోధూమం రాగిమండకం,
జంబీరామలకం జీరం లవణం పథ్య మాచరేత్. 31

కుక్క కఱచినదినము మొదలుకొని యౌషధమును పుచ్చుకొనువఱకు అప్పటప్పటికి నష్ణోదకస్నానము, మిరపకాయపొడి, తెల్లగడ్డ, కందిపప్పు, పెసరపప్పు, కొయ్యతోటకూర, లేతవంకాయ, కారము, తఱిపిబట్టినమజ్జిగ, నెయ్యి, పెరుగు, వరియన్నము, పెద్దజొన్నలఅన్నము, గోధూమరొట్టె, రాగిరొట్టె, నిమ్మకాయపులుసు, ఉసిరికకాయ, జీలకఱ్ఱ, ఉప్పు యివి యుపయోగింపవచ్చును.

### పిచ్చికుక్క కాటున కుపచారములు

శ్వానదంశక్షతే నిత్యం ఛురికేన పృథక్పృథక్,
రక్తస్రావం ప్రకుర్వీత విషం హారతి ప్రాయశః. 32
కాంజికక్షారసంస్పర్శా ద్విషవీర్యం వినాశయేత్,
ఏవమాద్యై శ్చోపచారైః కుర్యా న్మాసత్రయావధి. 33

పిచ్చికుక్కచే కఱువఁబడిన గాయమును పేనాకత్తితో గీచిగాని, కాస్టిక్ అని చెప్పఁబడు కాడీకారమునుపయోగించిగాని, గాయము మానిపోకుండ రక్తమును స్రవింపఁజేయుచుండవలయును. ఇటుల మూఁడుమాసములవఱకు గాయమును పచ్చిపుండుగ నుంచినట్టయిన స్రవించుచుండు చీము రక్తము మూలమున విషము హరించి పోవుచుండును.

శ్వానదష్టునకు మూడుమాసములవఱకు అపథ్యములు :—

ఔషధగ్రహణారభ్య దష్టమాసత్రయావధి,
జూర్ణాలీవరకశ్యామా నీవారాః పృథుజూర్ణాలాః. 34
కంబుధాన్యంచ మేథీ చ మాషా నిష్పావకా స్తిలాః,
ప్రయసం హింగు తైలం చ ద్రాక్షా ఖర్జూర మేవ చ. 35
నారికేడం గుడం చామ్రం పలాండుమూలకం తథా,
స్థూలకందశ్చ కందశ్చ వార్తాకం కారవేల్లకం. 36
అలాబూర్వారునిష్పావాః మాంసం మత్స్యాని సర్వశః,
కర్కటీబీజశాకాని క్షౌర మభ్యంజనం తథా. 37
పథాయాసం భారవాహం నూత్నశాల్యోదనం తథా,
నవీనం దధి తక్రం చ స్నానం శీతోదకే తథా. 38
మాసత్రితయపర్యంతం జ్ఞాత్వా చ పరివర్జయేత్,

ఆశికుక్కదష్టు లౌషధమునుపుచ్చుకొనినతర్వాత మూడుమాసములవఱకు పాలా పుజొన్నలు, వరిగెలు, చామలు, వెలిపడపుడ్లు, మొక్కజొన్నలు, సజ్జలు, మెంతులు, మినుములు, అనుములు, నువ్వులు, తియ్యగమాత (సాతాళింపు), ఇంగువ, నూనె, ద్రాక్ష, ఖర్జూరము, కొబ్బెర, బెల్లము, చింతపండు, నీరుల్లి, ముల్లంగి, పెండలము, కంద, వంకాయ, కాకరకాయ, సొరకాయ, దోసకాయ, చిక్కుడుకాయ, గోరుచిక్కుడుకాయ, తంబకాయ, మాంసము, చెఱువుచేపలు, వాగుచేపలు, సముద్రపుచేపలు, దోసగింజలు, అన్నివిధములగు నాకుకూరలు, క్షౌరము, తలంటు, దారినడుచుట, బరువుమోయుట, క్రొత్తవడ్లు, రేగటిపెరుగు, రేగటిమజ్జిగ, శీతోదకస్నానము అనునివి సేవింపఁగూడదు.

శ్వానదష్టులు నాలుగుమాసములవఱకు ఆచరింపవలసినపథ్యము :—

ఔషధగ్రహణారంభాత్ కులుత్థాః కంగుకోద్రవాః. 39
అర్గుహాస్త్వమృతఫలాః తినిశః కరమర్దకాః,
శిలింధ్రం తాళమూలం చ కదళీ మదిరా తథా. 40
జాగరం చోపవాసం చ కలహం జాంగలామిషం,
మద్యపానం వృష్టిఘాతం చతుర్మాసా పరిత్యజేత్. 41

శ్వానదష్టు లౌషధమును పుచ్చుకొనినది మొదలు నాలుగుమాసములపర్యంతము ఉలవలు, కొఱ్ఱలు, ఆరికలు, ముంతమామిడిపప్పు, జామపండ్లు, నెమ్మి లేక పాలపండ్లు, కలియుపండ్లు, పుట్టకొక్కులు, తాటితేగలు, అరటిపండ్లు, కల్లు, జాగరణ,

ఉపవాసము, కలహము, అడవిమృగములమాంసము, సారాయి, వానకు తడియుట అనునవి సేవింపఁదగదు.

### శ్వానదష్టుల కైదుమాసములవఱకపథ్యములు

ఔషధగ్రహణారంభా ద్వాల్మీకాన్ సూకరామిషం,
తైలే సంపక్వభక్ష్యాణి వర్జయే న్మాసపంచకం. 42

శ్వానదష్టు లైదుమాసములు వెళ్లువఱకు ఉసిళ్లు, ఊరపందిమాంసము, నూనెతో చేయఁబడిన అన్నివిధములైనభక్ష్యములు వర్జింపవలయును.

### శ్వానదష్టుల కాఱుమాసములవఱకు అపథ్యములు

ఔషధగ్రహణారంభాత్ పక్షిమాంసాని సర్వశః,
కూశ్మాండం కుక్కుట శ్చైవ బందికా శశక స్తథా. 43
వృకాదిదంశితం మాంసం షాణ్మాసం పరివర్జయేత్,

అన్నిపక్షులమాంసము, గుమ్మడికాయ, కోడిమాంసము, పొట్టికాకరకాయ, కుందేటిమాంసము, తోడేలు మొదలైనక్రూరమృగములచే గాయపడినగొఱ్ఱె మేఁక మొదలైనవానిమాంసములు అనునవి ఆఱుమాసములవఱకు భక్షింపఁగూడదు.

### ఒకసంవత్సరమువఱకువర్జనీయపదార్థములు

అళర్క దంశమారభ్య రసాలఫలసర్షపాః 44
స్త్రీసంగం రతివాంఛా చ వర్జయే దేకవత్సరః,

పిచ్చికుక్క, నక్క, పిల్లి, తోడేలు మొదలైనవి కఱచినది మొదలు మామిడిపండు, మామిడికాయ, యూరగాయ, మామిడికాయపచ్చడి మొదలైనవి ఆవాలు, స్త్రీసంగమము, రతివాంఛ అనునివి యొకసంవత్సరము గతించువఱకు రోగి వర్జించియుండవలయును; సంవత్సరమైనపిమ్మట నుపయోగింపవచ్చును.

### పిచ్చికుక్క కఱచినవానికి చికిత్సాపద్ధతి

వింశద్దివసపర్యంతం న దాతవ్యం విషౌషధం. 45
దత్వా చే దౌషధం పశ్చా త్పున ర్దత్వా త దౌషధం,
విషా ర్త స్వౌషధా త్పూర్వే వమనం క్రియతే క్రమాత్. 46
ఏరండపత్రస్వరసై ష్షట్కం వా సప్తవాసరాన్,
తతఃపరం ప్రదాతవ్యం వక్ష్యమాణౌషధం పరం. 47

పిచ్చికుక్క కఱచినదిమొద లిరువదిదినములవఱకు విషము దేహమందు వ్యాపింపక గాయమునందేయుండును; గాన నిరువదిదినములకులోపల నౌషధ మిచ్చుట

వలన విశేషము మేలులేదు. అటుల ఇచ్చినచో మరల పదియేనుదినములుతాళి రెండవ సారి యౌషధ మీయవలసియుండును. ఔషధ మిచ్చుటకు పూర్వమే అళర్కదష్టునకు దినము మార్చి దినము అముదపాకుపసరు త్రాగించి వమనము చేయింపవలెను. ఇట్లు మూడుపర్యాయములుగాని, యైదుపర్యాయములుగాని, యేడుపర్యాయములుగాని వమనము చేయించి యవ్వల విషౌషధ మిప్పింపవలెను; ఆముదపాకుపసరు పండ్రెండేండ్ల వయస్సుకు లోబడినవారికి అరగిద్దెడుపంతునను అంతకుపైబడిన యెంతవయసు కలవారికైనను అఱసోలెడు చొప్పునను త్రాగించి వమనము చేయింపవలయును; పసరు త్రాగినతర్వాత పదినిమిషములు తాళి పక్షియీఁకను గొంతులోనికిఁ జొనిపి వ్రేళ్ళతో త్రిప్పుచు గిలిగింత కలుగ చేసినచో వమన మగును; త్రాగించిన పసరంతయు వమనము చేయింపవలయును; వమనము చేయించినదివసమునందు చారు, పంగపిందెల కూర, కొయ్యతోటకూర మొదలయిన లఘువగు నాహారములనే యిప్పింపవలయును.

## అళర్క విషచికిత్స

1 భీమరుద్రరసము—

శిరీషపుష్పకుష్ఠైలాశిలాసవ్యోష రేణుకా,
యష్ట్యార్కహింగూశ్వేతోగ్నాసింధువారణపంచికా. 48
సూతరాజస్య భాగైకా గంధకస్య తథైవచ,
అభ్రాత్కర్షం తతో దేయం లోహైకం కాంతలోహతః. 49
పరోక్తే నౌషధే నైవ భావయే చ్చ పృథక్పృథక్!
విశాలా బృహతీ బ్రహ్మీ సౌగంధికసదాడిమైః 50
మర్కట్యా శ్చాత్మగుప్తాయాః స్వరసేన పృథక్పృథక్,
ఏకరక్తిప్రమాణేన వటికాం కారయే ద్భిషక్. 51
ఏకాం వటిం భక్షయిత్వా పిబే చ్ఛీతజలం తతః,
భీమరుద్రరసో నామా చాసాధ్య మపి సాధయేత్. 52
కుక్కురస్య సృగాలస్య విషం హంతి సుదుర్జయం,

దిరిసెనపుఁ బువ్వులు, చెంగల్వకోష్టు, ఏలకులు, మణిశిల, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, రేణుకలు, అతిమధురము, జిల్లేడువేరుపట్ట, ఇంగువ, చిత్రమూలము, వావిలిపంచకము నొక్కొక్కటి ... ... ... పాదరసము తులప్రమాణము, శుద్ధిఁజేబడినగంధకము తులము, అభ్రకభస్మము తులము, కాంతభస్మము తులము, ఈ వస్తువులను పెద్దపాపర, వాకుడు, వల్లారిఆకు, సౌగంధికమనుకలువగడ్డ( చెంగలువగడ్డ), దానిమ్మపండ్లరసము, తీటకోవెల, దురదగొండి అనునివి స్వరసములచేత ప్రత్యేక

మొక్కకక్క దినము మగ్గచేసి నాలుగు గురిగింజల (రక్తిక) తూనిక గలమాత్రలు కట్టి నీడ నెండించి యేడుదినములవఱకు పూటకొకమాత్ర భక్షించి వెంటనే శీతోదకమును త్రాగింపవలయును. ఇటుల చేసినట్టియిన అసాధ్యమగు వెఱ్ఱికుక్క, నక్క విషములు హరించును.

2 సూర్యోదయరసము—

నృణాం మూత్రేణ సంపిష్టో గోపిత్తమధుసంయుతః. 53
సృగాలై రథ మార్జారై ర్మండూకై రథ వాహిభిః,
కాలేనాపి హి దష్టస్యమృతసంజీవనాహ్వయః. 54
గదితో మునిభి స్సర్వైః సూర్యోదయమహారసః,

గోపిత్తము, తేనె సమాంశములుగ నరమూత్రముతో నూరి, పాదలేపనము చేసినట్టియిన వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి, పాము కఱచినందువల్ల కలిగినవిషోద్రేకము హరించును. దీనిని మృతసంజీవన్యౌషధ మని పూర్వఋషులు వచించియున్నారు.

3 వ చికిత్స —

లశునోషణవై దేహీ వరాగోఘృతకల్కితం. 55
పానన స్యాంజనాలేపైః శ్వదంష్ట్రిస్యౌషధంపరం,

వెల్లుల్లి, మిర్యాలు, పిప్పళ్లు, త్రిఫలములు ఇవి యావునేతితో కల్కము చేసి పానలేపన స్యాంజనములు చేయించినట్టియిన పిచ్చికుక్క విషము హరించును.

4 వ చికిత్స—

ధుత్తూరనగరసో విశ్వక్షీరాజ్యగుడపానతః. 56
శునో విషం వినశ్యేత శశాంకకృతశేఖరః,

ఒకతులము నల్లయుమ్మెత్తాకుపసరులో సొంటిచూర్ణ మొకతులము తగినంత ప్రమాణము ఆవుపాలు, ఆవునెయ్యి, బెల్లము కలిపి త్రాగిన వెఱ్ఱికుక్కవిషము నివర్తించును.

5 వ చికిత్స—

శుష్కద్వీపిక్రవ్యచూర్ణం విపచే ద్ధేనుదుగ్ధకే. 57
ప్రాత స్సాయంతనం గ్రాహ్య మళర్కస్య విషాపహం,

చిఱుతపులిమాంసము నెండించి చూర్ణము చేసి, ఆచూర్ణము నావుపాలలో వైచి కాచి ప్రాతస్సాయంకాలములకు మూఁడుదినములు పుచ్చుకొనిన పిచ్చికుక్క విషము హరించును.

6 వ చికిత్స—

ఆరణ్యజీరకం చూర్ణం ప్రాతస్సాయంతనం పిబేత్ 58
దినత్రయం మహాఘోర మళర్కస్య విషం హరేత్,

అడవిజీలకఱ్ఱచూర్ణమును తులప్రమాణము నుదకమందు కలిపి మూఁడుదివసములు ప్రాతస్సాయంకాలములయందు త్రాగినట్టయిన మహాఘోర మగువెఱ్ఱికుక్క విషము నిస్సంశయముగ హరించును.

7 వ చికిత్స—

ఉన్మత్తశ్వానదష్టానాం కుమారీదళసైంధవం. 59
సుఖోష్ణతః పిబే త్పీడా త్రిదినాంతే సుఖావహం,

కలుబందరసము, సైంధలవణము కాచి, సుఖోష్ణముగ మూఁడుదినములు ప్రాతస్సాయంకాలములయందు పుచ్చుకొనిన పిచ్చికుక్కవిషము హరించునని తెలియవలయును.

8 వ చికిత్స—

తైలంతిలానాంచపలం గుడంచ క్షీరం తథార్కస్నుమమేవపీతం. 60
ఆలర్కముగ్రంవిషమాశుహంతిసద్యోభవం వాయురివాభ్రబృందం,

నువ్వులనూనె, బెల్లము, జిల్లేడుపాలు, సమాంశము లేకము చేసి, పలప్రమాణము పుచ్చుకొనిన వాయువుచే మేఘమెగిరిపోయినటుల యుగ్ర మగువెఱ్ఱికుక్క విషము హరించిపోవును.

9 వ చికిత్స—

విదారిమూలం మరిచం కర్షమాత్రం పిబే న్నరః. 61
తద్వ్రణం తత్క్షణా దేవ దహే ల్లోహశలాకయా,
అళర్కస్య విషం హన్త్యా త్తత్క్షణం చ న సంశయః. 62

గుమ్ముడుగడ్డలు, మిర్యాలు సమాంశములుగ నూఱి, కర్షప్రమాణము భక్షించి తత్క్షణమే గాయము నకుక్క కడ్డితో కాల్చినట్లైన పిచ్చికుక్కవిషము హరించును.

10 వ చికిత్స—

పిష్ట్వాపామార్గమూలం చ కర్షైకం మధునా పిబేత్,
శ్వానదంష్ట్రవిషం హన్త్యా త్కుమారీదళసైంధవం.
దంశస్థానే బంధయే చ్చ త్రిదినాంతే సుఖావహం, 75

ఉత్తరేణువేరు కర్షప్రమాణము తేనెతో మర్దించి, మూఁడుదినము

స్సాయంకాలములను పుచ్చుకొని కలబందమట్ట, సైంధలవణము నూరి గాయమునకు కట్టుగట్టిన పిచ్చికుక్క విషము హరించును.

11 వ చికిత్స—

నింబం కుటజబీజాని చందనాంబుజకేసరం. 64

క్షీరైః పిష్టం నిహం త్యాశు శ్వానమార్జాలజం విషం,

వేపవిత్తులు కొడిశవిత్తులు, చందనము, తామరకేసరములు వీనిని ఆవుపాలతో నూరి త్రాగిన వెఱ్ఱికుక్క, పిల్లి కాట్లవిషము హరించును.

12 వ చికిత్స—

శిరోరుహమషీంకృత్వా తైలేనసహభక్షయేత్. 65

కారవేల్లరసందేహేలిప్త్వాతుస్నానమాచరేత్,

శ్వానసృగాలమార్జాలవిషంహరతితత్క్షణాత్. 66

తులప్రమాణము మనుష్యునివెంట్రుకలను కాల్చి మసిచేసి దానిలో నూనెగలిపి త్రాగినను లేక, కాకరాకుపసరు దేహమునకు లేపనము చేసికొని స్నానము చేసినను, వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి విషములు హరించును.

13 వ చికిత్స—

హరిమ్మంజరిపత్త్రం చ లశునం చ సమాంశకం,

సమ్మర్ద్యైరండతైలేన పిబేత్ప్రాచ్య మళర్కనుత్. 67

కుప్పింటాకు, వెల్లుల్లి మెత్తగ నూరి ఆముదములో కలిపి యుడికించి మూఁడు దినములు ప్రాతస్సాయంకాలములయందు పుచ్చుకొన్నట్టైన వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి, కాటువలన జనించినవిషము హరించును.

14 వ చికిత్స—

గోపీమూలాని తక్రేణ మర్ద్యం ఖాద్య మళర్కజిత్,

కరంజమూలస్వరసం పీత్వా ఉళర్కవిషం జయేత్. 68

సుగంధపాలవేళ్లు మజ్జిగతో నూరిత్రాగినను, క్రానుగవేరురసమును త్రాగినను వెఱ్ఱికుక్క నక్క కాట్లవిషము హరించును.

15 వ చికిత్స—

నగారపత్త్రస్వరసం జంబీరామ్లం సమం సమం,

పిబతే సద్య శ్శ్వానదంష్ట్రవిషం హరేత్. 69

రుమ్మితాకుస్వరసమును, నిమ్మపండ్లరసమును సమాంశములుగ కల్పుకొని ముదయసాయంతనముల పుచ్చుకొనిన పిచ్చికుక్క కాటువలన సంభవించిన పశమించును.

16 వ చికిత్స—

విష్ణుక్రాంతాం సమూలాం చ నరమూత్రేణ మర్దయేత్,
పీత్వాఽళర్కవిషం హంతి సూర్యక్రాంతాం చ తద్విధం. 70

విష్ణుక్రాంతసమూలమునుగాని, సూర్యక్రాంతసమూలమునుగాని, నరమూత్రముతో నూరి త్రాగిన పిచ్చికుక్క కాటువిషము హరించును.

17 వ చికిత్స—

బ్రహ్మాణ్యభూజప్రాఙ్మూలం గంధం జంబీరవారిణా,
పిబే చ్ఛ్వానవిషం హంతి దినైకం నాత్ర సంశయః. 71

తూర్పుగా వ్యాపించి యున్నగంగరావివేరును తెచ్చి నిమ్మపండ్లరసముతో గంధము తీసి అగంధమును పుచ్చుకొనిన పిచ్చికుక్క కాటువలన సంభవించినవిషము హరించును.

18 వ చికిత్స—

సమ్యగిత్వాకుజంమూలం గోమూత్రేణవిమర్దయేత్,
అరిష్టబీజపద్గోళం కృత్వా బ్రహ్మాంబునాపిబేత్. 72
అళర్కదంశేతద్గంధంవిలేప్యందివసత్రయం,
సో న్మత్తశ్వానమార్జారసృగాలానాంవిషంహరేత్. 73

నాగసారవేళ్లు గోమూత్రముతో నూరి కుంకుడుగింజప్రమాణము మాత్రలు చేసి, పూట కొకటిచొప్పున నేడుదివసములు పుచ్చుకొని అవటుకములనే అవుపంచితముతో చాది గాయముపై పట్టించిన వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి కాటువలన సంభవించిన విషముపశమించును.

19 వ చికిత్స—

నిశా కుష్ఠం సమం కృత్వా గోమూత్రే క్వాథితం పిబేత్,
గుంజామూలం వచాచూర్ణం శీతతోయేన ఖాదయేత్. 74
శ్వానసృగాలమార్జాలవిషం హరతి తత్క్షణాత్,

పసుపు, కోష్టు గోమూత్రముతో కషాయముగ కాచి పుచ్చుకొనినను తెల్లగురిగింజవేరు, వస చూర్ణించి, శీతోదకమున కలిపి పుచ్చుకొనినను వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి కాటువలన సంభవించినవిషము శమించును.

20 వ చికిత్స—

మూలం వా తుంబిబీజం వా పత్రం వా వల్కలం తతః. 75
మర్దయే ద్వారిణా పీత్వా అళర్కస్య విషం జయేత్,

చేదుసొరవేరుగాని, విత్తులుగాని, ఆకుగాని, పట్టగాని, యుదకముచే నూరి పూటకు కర్షప్రమాణము మూఁడుదినములు పుచ్చుకొనిన వెఱ్ఱికుక్క కాటుచే సంభవించిన విషము హరించును.

21 వ చికిత్స—

పిష్ట్వా శోణఫలీబీజం చతుష్కం జంభలామ్లకే. 76

కల్కం తైలే విపాచ్యం తు ప్రాతస్సాయంతనం తతః,

ఖాదయే ద్దశవారాణి ఘృతదర్వీప్రమాణకే. 77

శ్వానసృగాలమార్జాలవిషం హరతి తత్క్షణం,

ఊటివిత్తనము లుదకముచే ముద్దగ నూరి కల్కము చేసి, యందు నువ్వుల నూనె నాల్గవవంతు కలయఁబోసి నీరిగురువఱకు కాచి తైలమును ఏడిచికొని పూటకు మిల్లిగరిటెడ నూనెయును, నాలుగునిమ్మపండ్లరసమును కల్పుకొని పదిదినము లిటుల పుచ్చుకొనిన వెఱ్ఱికుక్క, నక్క, పిల్లి మొదలైనవాని కాటువలన సంభవించిన విషము నివర్తించును.

22 వ చికిత్స—

శ్వాన స్యాపి విషం హంతి లేపం కుక్కుటవిష్ఠయా. 78

గుడై స్తైలార్కదుగ్ధైశ్చ లేపా దారోగ్య ముద్భవం,

బెల్లపుపాకువలె జిగటగ, నెఱ్ఱగ నుండుకోడిమలమును పిచ్చికుక్క కఱచిన గాయమందు లేపనముచేసినను, బెల్లము, నూనె, జిల్లేడుపాలు కలిపి మర్దించి పట్టించినను విషము హరించును.

23 వ చికిత్స—

అర్కక్షీరం గుడం తైలం సమాంశం చ విలేపయేత్. 79

శ్వానదంశవిషం హంతి తద్వ త్కీరుబిడాలకం,

జిల్లేడుపాలు, బెల్లము, నువ్వులనూనె సమాంశములు కూర్చి మర్దించి పిచ్చికుక్క, నక్క, పిల్లి కఱచినగాయములకు లేపనము చేసిన విషము హరించును.

24 వ చికిత్స—

గంధం యుగఫలీమూలం సతోయం జంబుకక్షతే. 80

లిప్త్వా తు తత్క్షణం నశ్యే చ్చిరంతనవిషం పరం,

దుష్టపువేరు నుదకమున చాది, యాగంధమును వెఱ్ఱినక్క కఱచినగాయమునకు లేపనము చేసిన విషము హరించును.

25 వ చికిత్స—

గుడం తైలార్కదుగ్ధం చ లేపా చ్ఛునివిషం హరేత్. 81
పిష్ట్వాఽపామార్గమూలం చ కర్షైకం మధునా లిహేత్,
శ్వానదష్టవిషం హంతి లేపాత్కుక్కుటవిష్ఠయా. 82
అళర్కేన చ దష్టానాం కుమారీదళసైంధవం,
సుఖోష్ణం బంధయేత్పిష్టం త్రిదినాంతేసుఖావహం. 83

బెల్లము, నువ్వులనూనె, జిల్లేడుపాలు మర్దించి గాయమునకుఁ బట్టించినను, ఉత్తరేణువేరును తేనెతోనూఱి కర్ష మెత్తు భక్షించినను, బెల్లపుపాకువలె నెట్టిగ జిగటగ నుండుకోడిమలమును గాయమునకు లేపనము చేసినను, కలుబంద చెక్కలో సైంధవలవణమును పొదిగి కుమ్ములో నుడికించి సుఖోష్ణముగనుండునపుడు గాయముపైనవేసి కట్టుగట్టినను మూఁడుదినములలో పిచ్చికుక్కవిషము హరించును.

26 వ చికిత్స—

మార్తాండదుగ్ధగుడతైలశిరీషపత్ర,
తాంబూలకల్కనవచూర్ణనిశాంతధూమః. 84
అంకోలవాజిపృథుకాశిఖిదక్షపక్ష,
దుత్తూరకాస్ఫుటమళర్కవిషం నిహన్యాత్. *ఇతిశతశ్లోకి. 85

* లోకమునందు పెక్కుమంది యళర్కవిషచికిత్సకులు పలుచికిత్స లెఱిఁగి చేయుచున్నారు. వంశపరంపరగను, తాత్కాలికగురువులవల నుపదేశ మొంది యును పరమరహస్యమున నుంచుకొని పిచ్చికుక్క విషమునకు చికిత్సచేయుచుండెడు వనేకులయొక్క పరమహంసక్రియలన్నియు పూర్వోక్తశ్లోకమందు వక్కాణింపఁబడినమూలికలలో నేదియో యొక్కొక్కమూలికయేకాని యందు లేనిమూలికలు కాదు. అళర్కవిషమునకు బహుమంది రహస్యముగ నుంచుకొని వాడుచుండు. పరమహంసక్రియ లనేకముల నే నెఱిఁగియున్నాను. మఱియు నేనును పిచ్చికుక్కవిషమున కమోఘమైనయుత్తమోత్తమమగు నొకపరమహంసక్రియ నెఱిఁగి యిప్పటివఱకు నాయొద్దకువచ్చిన పిచ్చికుక్క, నక్క, తోడేలు, పిల్లి వీనివలన కఱువఁబడినవిషార్తులకు 472 మందికి చికిత్సచేసి యారోగ్యపఱిచియున్నాను. ఇటుల వాడుకయందుండెడు పరమహంసక్రియలన్నియు పూర్వోక్తశతశ్లోకీ శ్లోకమందు చెప్పఁబడిన యౌషధులలో నేదియో యొక్కటియై యుండుట స్వానుభవమువలన గుర్తెఱిఁగియున్నాను. ఈవిన్యాస మింత విస్తరించి వ్రాయుటకు కారణ మేమనిన: అళర్కవిషవైద్యులందఱు తా నుపయోగించుపరమహంసక్రియ తనకుమాత్రమే గురుపరంపరాగతమై యున్నదనియు

జిల్లేడుపాలు, బెల్లము, నువ్వులనూనె, దిరిసెనపుఆకు, తమలపాకు, కొత్త సున్నము, కటికపూపము, ఊడుగ, పెన్నేరుగడ్డ, చిత్రమూలము, గ్రద్దఱెక్కలు, నల్లని తెల్లని యుమ్మెత్తలు అనునివి వెఱ్ఱికుక్క, నక్క మొదలైనఅళర్కవిషము లన్నిటిని హరించును.

27 వ చికిత్స—

ధత్తూరస్య శిఫా పేయా క్షీరేణ పరిపేషితా,
అంకోలవంశజాచాపి శ్వవిషఘ్నీ ప్రయత్నతః 86

ఉమ్మెత్తచిగురును గంజితో నూరి, ఆవుపాలలో కలిపికొని త్రాగినను వెఱ్ఱికుక్క, నక్క కాటువిషము హరించును.

28 అభినవవైద్య మను కౌనేయసిద్ధాంతమందలి చికిత్స—

లింగస్నానా త్కటిస్నానా ద్బాష్పస్నానా దళర్కజం,
విషం ప్రశమనం యాతి తద్వ దే వోరగం విషం. 87
ఇతి శర్మణ్యదేశీయలీప్సిగ్పట్టణవాసినః
లూయిసూక్నీబుధేంద్రస్య స్నానవైద్యే ప్రభాషితం. 88

లింగస్నానము చేయుటవలనను, కటిస్నానము చేయుటవలనను, బాష్పస్నానముచేయుటవలనను, వెఱ్ఱికుక్క, నక్క మొదలగువానికాటువలన కలిగినవిషము, సర్పవిషము హరించునని జర్మనిదేశస్థులును, లీప్సిగ్పట్టణవాస్తవ్యులునగు లూయిస్కూనీగారను మహానియుడు వ్రాసినఅభినవవైద్య మనుస్నానచికిత్సాశాస్త్ర ముద్ఘోషించుచున్నది.

29 వర్ణవైద్యశాస్త్రచికిత్స—

వర్ణవైద్యప్రకారేణ యామే యామే పృథక్పృథక్,
లఘునీలజలం పీత్వా ద్వితులార్ధం యథాక్రమం. 89
చేల మార్ద్రం తజ్జలేన క్షతే స్యాచ్ఛాదనం సదా,
అళర్కస్య క్షతం చార్ద్రం తజ్జలేన ముహుర్ముహుః. 90
నీలదర్పణసచ్ఛాయాం నిక్షిపే చ్ఛావనదష్టకం,
అళర్కస్య విషం ఘోరం వినిహంతి న సంశయః. 91

---

నేశాస్త్రవేత్తలకు తెలియదనియు చెప్పుకొనుచుండుట సుప్రసిద్ధమైయున్నందున అట్టివారియొక్క యజ్ఞాననివృత్తికై మన మెంకొక్కకరము మహాగోప్యమరదుంచి యుపయోగపడుచుచుండు పరమహంసక్రియలన్నియు మనపూర్వవైద్యులే శాస్త్రములందు వెల్లడించియున్నారని తెలుపుటకై వ్రాసినాఁడను.

స్నాత్వా ఽథ శునకాదీనాం లఘునీలజలం పిబేత్,
తత్క్షణేన వినశ్యంతి చోన్మాదం చాపలం మృతిః. 92
ఇదం కాశీపురస్థాన సంస్థన్యాయాధికారిణా,
విద్వజ్జ్వాలా ప్రసాదేన వక్ష్యతే వర్ణవైద్యకే. 93

బంగాళా రాజధానియొక్క పశ్చిమోత్తరపరగణాలలోని కాశీపుర్ డిస్ట్రిక్టు మునసిఫ్‌గా రగుపండితజ్వాలాప్రసాద్‌జా అనువారిచే వ్రాయఁబడినవర్ణవైద్యశాస్త్రమందు పిచ్చికుక్కచే కఱవఁబడి విషమెక్కియున్నవారికి (లఘునీలజలమును) జామున కొకసారి యొకఔన్సుచొప్పున త్రాగించుచు లఘునీలజలమందు తడిపినగుడ్డను గాయముపైన గప్పి అప్పటప్పటికి నాజలమును గుడ్డమీఁద పోసి తడుపుచు పగటిపూట లఘునీలవర్ణంగు అద్దములఛాయను, రాత్రిపూట నీలపుఅద్దములచే నమర్పఁబడిన లాందరుల వెలుతురును అశ్వదష్టుని శరీరమందును, గాయమందును, ప్రసరింపంజేయుచు నీవిధముగ నొకవారము చికిత్సచేసిన పిచ్చికుక్కవిషము శాంతించుననియు, మఱియు పూర్వోక్తలఘునీలజలమునే స్వచ్ఛముగఁగాని, ఆవుపాలలో కలిపిగాని వెఱ్ఱిపట్టియున్నకుక్కలకు త్రాగించినట్లైన, కుక్కలకు పట్టియున్న వెఱ్ఱియు చపలత్వమును నివర్తించి మృతి తొలగిపోవు నని ప్రతిజ్ఞగా వ్రాసియున్నారు. మఱియును, ప్రస్తుతమందు హ్యూమియోపేథి, సూప్రఫేథి, ఎలక్ట్రోవైవోపేథి మొదలైనవైద్యములలోను పిచ్చికుక్కచికిత్స లనేకము లున్నవి ; అవి సర్వజనసులభములు కాదు.

## వెఱ్ఱిలేని వ్యాఘ్ర వనమనుష్యాదుల నఖదంష్ట్రల గాయములకు చికిత్సాక్రమము.

చతుష్పాద్భి ర్ద్విపాద్భి ర్వా నఖైర్దంతై శ్చయత్కృతం,
శ్రూయతే పత్యతే తత్ర స్రవతి జ్వర ఇత్యపి. 94

వ్యాఘ్రాదిచతుష్పాదజంతువులయొక్కయు, ద్విపాత్తు లగువనమనుష్యాదులయొక్కయు దర్శనమువలనగాని, వానిప్రచండధ్వని వినినందునఁగాని వానిదంతములచేతను, నఖములచేతను గాయపడినందువలనఁగాని భ్రమగలిగి పడిపోవుట, ప్రలాపించుట, జ్వరము తగులుట సంభవించును.

1 వ చికిత్స.—

వృకవ్యాఘ్రసృగాలాఖుభల్లుకద్విపివాజినాం,
విషం శ్వాపదదంశచ్చే ద్దహే ల్లోహశలాకయా.

లేపాత్సర్వవిషం హంతి మూలం శ్వేతపునర్నవం,
కిమత్ర బహునోక్తేన తత్క్షణా ద్విషనాశనం. 96

తోడేలు, పెద్దపులి, నక్క, పందికొక్కు, ఎలుక, ఎలుగుబంటి, చిఱుతపులి, గుఱ్ఱము, కుక్క మొదలగు వానివలన కలిగినదంతక్షతులకుగాని, నఖక్షతులకుగాని యొకవిధమైన విషము గలిగియుండును (అనఁగా: గాయము చెలిదిపోతే పుట్టలు పెరుగుచు చీము కారుచు బహుకాలమువఱకు మానిపోకయుండుట) కలుగునుగాన, అట్టిగాయములను తత్క్షణమే యినుపశలాకతో కాలిచి తెల్లగలిజేరు వేరుగంధమును లేపనముచేసిన విషము హరించి శర్వ్లలో గాయములు నెమ్మదించును (విషమనఁగా) అశర్కము కాదు; సాధారణ మైనమృగాదులయొక్క నఖదంతక్షతులకు కలిగియుండుసహజమైన చెలిదియని తెలియవలయును.

2 వ చికిత్స.—

చింగటస్య చ పానేన వ్యాఘ్రవ్యాళవిషం హరేత్,
దుత్తూరపత్రతోయేన చూర్ణం త్రికటుసంభవం. 97
ఉదరస్థం విషం హంతి వ్యాఘ్రవ్యాళసముద్భవం,

చింగట మనునోషధిని పుచ్చుకొనినను, త్రికటుచూర్ణము నుమ్మెత్తాకుపసరులో కలిపి త్రాగినను, గర్భస్థమగు పెద్దపులి పెనుపాములయొక్క విషమును, నఖదంష్ట్రల విషమును హరించును.

3 వ చికిత్స.—

కరంజతైలలేపేన జ్వాలాం వ్యాఘ్రనఖోద్భవాం. 98
తత్క్షణేన నిహంత్యాశు అమోఘం నాత్ర సంశయః,

పులివలన కలిగిన నఖక్షతములకు కానుగవిత్తులతైలమును, లేపనముచేసిన పోట్లు మంటలు శాంతించును.

4 వ చికిత్స.—

గోజిహ్వామూలికాం పిష్ట్వా జలేన మధునా సహ. 99
లేపోపి సర్వజంతూనాం నఖతుండవిషం హరేత్.

ఎద్దునాలికచెట్టును సమూలముగ నుదకముతో నూఱి, అందు తగుమాత్రము తేనె గలిపి లేపనముఁ జేసిన వ్యాఘ్రాదిసమస్తమృగముల కోఱలగాయములు, గోరుల గాయములు వీనివలన సంభవించిన చెలిదివిషము హరించును.

5 వ చికిత్స.—

తథా నింబత్వచం చైవ శమీవృక్షత్వచం తథా. 100

ఉష్ణోదకేన లేప స్స్యా న్నఖదంతవిషాపహః,
తథా దారుహారిద్రాయా లేపో దంతవిషాపహః. 101

వేపపట్టను గాని, జమ్మిపట్టను గాని యుష్ణోదకముచే నూఱి లేపనముచేసినను, మ్రానిపసపు నుష్ణోదకముచే నూఱి లేపనముచేసినను వ్యాఘ్రాదిజంతువులచే గావింపఁబడిననఖదంతక్షతుల చెలిదివిషము నిస్సంశయముగ నివర్తించును.

## సర్పచికిత్సాప్రకరణము

అతః పరం ప్రవక్ష్యామి సర్పాణాం భేదనిర్ణయం,
పన్నగాః పండితై రుక్తా దివ్యా భౌమా ఇతిద్విధా. 102

సర్పజాతులు దివ్యములు (దేవతాసర్పములు) భౌమములు (భూమియందుండు సర్పములు) అని రెండువిధములుగనుండును.

## దివ్యసర్పాదిగణము

దివ్యా దర్వీకరా శ్చైవ మండలీ రాజిమాశ్చ స్తథా,
ఉపజాతిభుజంగాశ్చ సర్పాణాం గణపంచకం. 103

దివ్యసర్పములు భూసర్పములలోఁ జేరిన దర్వీకరములు. మండలీసర్పములు ఉపజాతిసర్పములు అనునవి దివ్యసర్పాదిగణ మనఁబడును.

## దివ్యసర్పములవివరము

అనంతో వాసుకి స్తక్షః కర్కోటశ్చైవ పద్మకః,
మహాపద్మ శ్శంఖపాలః కులికో దివ్యపన్నగాః. 104

అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, పద్మuఁడు, మహాపద్మuఁడు, శంఖపాలుఁడు, కులికుఁడు అని దేవసర్పములు యెనిమిదివిధములుగ నుండును.

## దేవతాసర్పములకు గుఱుతులు

శ్వేతపద్మ మనంతస్య మూర్ధ్ని పృష్ఠే చ దృశ్యతే,
శంఖం కులికస్య శిరసి వాసుకేః పృష్ఠ ఉత్పలం. 105
త్రినేత్రాంకస్తు కర్కోటే తక్షకే స్వస్తికాంకితం,
జ్వలత్త్రిశూలం చంద్రార్ధం శంఖపాలస్య మూర్ధని. 106
రాజావర్తసమో బిందు ర్మహాపద్మస్య పృష్ఠతః,
పద్మస్య పృష్ఠే దృశ్యంతే సురక్తాః పంచబిందవః. 107

అనంతునికి ఫణాగ్రమందు శ్వేతపద్మాకారము గలతెల్లనిచుక్క లుండును, కులికునికి శిరమునందు శంఖమువంటి చిహ్న ముండును, వాసుకి వీపునందు నల్లకలు

పువ్వువంటిగుఱుతుండును, కర్కోటకునికి మూఁడునేత్రముల బోలినచిహ్నము ముండును, తక్షకునికి పడగయందు స్వస్తికమువంటిగుఱుతుండును, శంఖపాలునికి వీపునందు అర్ధచంద్రత్రిశూలాకారము గలగుఱుతుండును, మహాపద్మునికి వీపునందు రాజావర్తమణితుల్యము అగుచుక్క లుండును, పద్మునికి వీపునందు ఎఱ్ఱనివర్ణము గల పంచబిందువు లుండును; ఈగుఱుతులను బట్టి దేవనాగములను తెలుసుకొనవలయును.

### దేవనాగములకువారములు

రవీంద్వారజ్ఞజీవానాం వారేషు సితమందయోః,
కులనాగాష్టకం హ్యేతత్తేషు వారేషు దంశనం. 108

భాను సోమ అంగారక బుధ గురు శుక్ర శనివారము పగలు, శనివారము రాత్రి అనువారములయందు మాత్రమే క్రమముగ అనంతుఁడు మొదలగు దేవసర్పములు కఱచును; అప్పుడే వానికి విషాధిక్యము కలిగియుండును.

### దేవసర్పములమహిమ

నాగా జ్వాలానలసమాః జరామరణవర్జితాః,
ద్యోతమానా స్స్వతేజోభిః భూభారభరణక్షమాః. 109
భస్మీకర్తుం జగద్దక్షాః ఫూత్కారై ర్వీక్షితై రపి,
ఏతై ర్దష్టస్య మర్త్యస్య చికిత్సా నైవ విద్యతే. 110
ఔషధై ర్మణిభి ర్మంత్రై ర్నైమే యోగ్యా శ్చికిత్సితుం,
జపధ్యానసమస్కారైః ప్రసాదం కుర్వతే కిల. 111

అనంత వాసుకి తక్షకాదులగుదేవతాసర్పము లెనిమిది యుజ్వలితాగ్నిసమములై యుండును; వీనికి జరామరణాదులు లేవు. తాము స్వయంప్రకాశములై మఱియొకదానిని ప్రకాశింపఁజేయుచుండును. భూభారమును వహించుచుండును. అగ్రహము గలిగినట్టైన చూపులచేతను, ఫూత్కారములచేతను జగత్తును భస్మీపటలముగఁజేయును; వీని విషదష్టులకు చికిత్సే లేదు. ఈసర్పములు ధ్యాననమస్కారసాధ్యములే కాని మణిమంత్రౌషధచికిత్సాసాధ్యములు కాదు.

### భౌమసర్పభేదములు

చతుర్విధా భౌమనాగాః ప్రోక్తా జాంగలికై స్సదా,
దర్వీకరా మండలినః రాజిమంతోపజాతయః. 112

భౌమసర్పములు, దర్వీకరములు, మండలీసర్పములు, రాజీమంతములు, ఉపజాతిసర్పములు అని నాలుగువిధములై యుండును.

### —— త్రివిధభౌమసర్పములలక్షణము ——

దర్వీకరః ఫణీ జ్ఞేయో మండలీ మండలావపుః,
బిందులేఖోవిచిత్రాంగః పన్నగస్స్యాత్తురాజిమాన్. 113

పడగలు గలిగి గరిటలవలె నుండునవి దర్వీకరములనియు, శరీరమంతయు రత్నకంబళివలెగాని చాందినీవలెగాని చిత్రవిచిత్రమయినపొడలుగలిగి యుండునవి మండలీసర్పములనియు, శరీరమందు సన్నచుక్కలు, ఊర్ధ్వరేఖలు తిర్యగ్రేఖలుగలిగి చిత్రాకారముగా నుండునవి రాజిమంతములనియు చెప్పఁబడును.

ఉపజాతిసర్పలక్షణము విషలక్షణము మొదలయినవివరము ముందు చెప్పఁబడును.

### —— త్రివిధసర్పములవిషగుణము ——

విశేషా ద్రూక్షకటుక మమ్లోష్ణం స్వాదు శీతలం,
విషం యథాక్రమం తేషాం తస్మా ద్వాతాదికోపనం. 114

దర్వీకరములవిషము ఉష్ణముతో చేరిన కారముగను, మండలీవిషము ఉష్ణముతో చేరిన పులుసుగను, రాజీమంతవిషము చలవతో చేరిన మధురముగ నుండును. ఈరుచులను బట్టియే వాతాదిదోషములు ప్రకోపించును.

### —— త్రివిధసర్పములవాతాదిదోషములవివరము ——

దర్వీకరాః వాతలశ్చ మండలీ పిత్తల స్తథా,
శ్లేష్మలో రాజిమంతశ్చ విజ్ఞేయా వైద్యపారగైః. 115

దర్వీకరజాతిసర్పములు వాతోద్రేకము గలవిగను, మండలీసర్పములు పిత్తోద్రేకము గలవిగను, రాజీమంతసర్పములు శ్లేష్మోద్రేకము గలవిగ నుండు నని తెలియవలెను.

### —— త్రివిధభౌమసర్పములసంఖ్య ——

చతుర్దశవిధాః ప్రోక్తా ఇహ దర్వీకరా స్తథా.
మండలీ భోగినశ్చైవ ఏకవింశతిజాతయః. 116
షట్త్రింశ ద్రాజిమంతశ్చ జ్ఞేయా జాంగలికై ర్భువి,

దర్వీకరములు (త్రాచుపాములు) పదునాలుగువిధములుగను, మండలీసర్పము (పెంజర) లిరువదియొక్క భేదములు గలవిగను, రాజీమంతసర్పములు (అనేకవిధములగు క్షుద్రజాతిసర్పములు) ముప్పదియాఱువిధములుగ నుండునని తెలియవలెను.

### —— దర్వీకర(తాచు)పాముల పేళ్లు ——

చిఁచా పుష్పఫణీ నాగభోగాఖ్య రేవతపన్నగః. 117

చణకాహిః కృష్ణసర్పో కోద్రవాఢకపన్నగౌ.
కేతకీపన్నగ శ్వేతభోగీ కుక్కుటపన్నగః. 118
గిరినాగో జలాహిశ్చ గోధూమాహి స్తథైవచ,
రాజభోగీ తిఫణినః భువి దర్వీకరా స్స్మృతాః. 119

చింతపువ్వుపన్నె త్రాఁచు, నాగజెట్టి, రేలత్రాఁచు, సెనగపువ్వుత్రాఁచు, నల్లత్రాఁచు, అరికెపన్నెత్రాచు, కందిపొడలత్రాచు, మొగలిపువ్వుత్రాచు, తెల్లత్రాచు, కోడెత్రాఁచు, గిరినాగు, నీరుత్రాఁచు, గోధుమత్రాఁచు, రాచపాము అని దర్వీకరములు (త్రాచుపాములు) పదునాలుగువిధములుగా నుండును.

## దర్వీకరముల(త్రాఁచుపాముల)లక్షణము

1 చింతపువ్వుపన్నెత్రాఁచుపాములక్షణము.—

చించా పుష్పసమాభశ్చ క్రోధం సాధారణం వదేత్,
భానువారే విషాధిక్యం చించాపుష్పాహి రుచ్యతే. 120

చింతపువ్వుపన్నె శరీరఛాయయును, సాధారణమగు క్రోధమును, ఆదివారమునందు విషాధిక్యమును, గలిగియుండునది చింతపూవన్నెత్రాచని చెప్పఁబడును.

2 నాగజెట్టి యను త్రాఁచులక్షణము.—

అర్ధాంగం భోగిసాదృశ్య మర్ధాంగం శీఘ్రగామివత్,
నిష్కుహేషు చ వృక్షేషు నివాస మనిశం తథా. 121
గోధూమపాండురాభశ్చ ఇందువారే విషాధికం,
అత్యంతరోషసందీప్తో నాగభోగీ ప్రకాశతే. 122

సగము త్రాఁచుపామువలెను, సగము జెట్టిపోతువలెను కనఁబడుచు చెట్లతొఱ్ఱలయందును, చెట్లయందును నివసించుచు గోధుమవన్నె తెలుపురంగు గలిగి, అత్యంతకోపమును సోమవారమునందు విషాధిక్యమును కలిగియుండునది నాగజెట్టి యను త్రాఁచని తెలియవలెను.

3 రేలత్రాఁచులక్షణము.—

సూక్ష్మదీర్ఘశరీరశ్చ నివస త్యటవీషు చ,
ఆరగ్వధఫలాకారో సోమవారే విషాధికః. 123
ఆ రేవతాహిద్విఖ్యాతో కోపంసామాన్యమేవ చ,

అడవులందు నివసించుట, సన్నము పొడవుగల శరీరము కలిగియుండుట, సోమవారమునందు విషాధిక్యమును సామాన్యమగు కోపమును గలిగియుండునది రేలత్రాఁచని చెప్పఁబడును.

4 సెనగపూ త్రాఁచు లక్షణము.—

చణప్రసవసంకాశః కేతకాహిసమాకృతిః. 124
ఇందువారే విషాధిక్యం చణకాహి స్సకృత్తథా,

శనగపూ త్రాఁచనునది సెనగపూవర్ణమును, కొన్నిగుణములందు మొగలిపూ త్రాఁచును బోలియుండును సోమవారమునందు విషాధిక్యమును, సామాన్యమైన కోపమును కలిగియుండును.

5 నల్లత్రాఁచు.—

జంబూఫలప్రకాశశ్చ నాతిదీర్ఘోజ్వల స్తథా. 125
దౌష్ట్యాధిక్యో విషం స్వచ్ఛం వాసం గిరివనేషు చ,
కుజవారే విషాధిక్యం కృష్ణసర్పస్య లక్షణమ్. 126

నేరేడుపండువర్ణమును, మితమైనపొడవును, ప్రచండకోపమును, అత్యంత దుష్టత్వమును, స్వచ్ఛతరమైనవిషమును, పర్వతాటవులందు నివాసమును, మంగళ వారమునందు విషాధిక్యమును, కలిగియుండునది నల్లత్రాఁచని చెప్పఁబడును.

6 ఆరికెవన్నెత్రాఁచు.—

విడ్విసర్జనభూమీషు సంచరే న్మలభక్షకః
కోపాధికో కోద్రవాభో అతిస్వచ్ఛగర స్తథా. 127
సౌమ్యవారే విషాధిక్యం కోద్రవాహి స్స కథ్యతే,

మలోత్సర్గనస్థలములందు సంచారమును, మలభక్షణము, అత్యధికకోపము, స్వచ్ఛమయినగరళము, బుధవారమునందు విషాధిక్యము, ఆరికకసవు ఆరికధాన్యమువంటి వర్ణమును కలిగియుండునది ఆరికవన్నెత్రాఁచని చెప్పఁబడును.

7 కందిపొడలత్రాఁచు.—

తువరాస్థిసమాకారో కోపం సామాన్య మేవ చ. 128
సౌమ్యవారే విషాధిక్యం తువరాహిః ప్రకథ్యతే,

కందిబేడలవంటిపొడలు గలశరీరమును, సామాన్యమగుకోపమును, బుధవార మునందు విషోద్రేకమును కలిగియుండునది కందిపొడలత్రాఁచని తెలియవలెను.

8 మొగలిపూత్రాఁచు.—

కేతకీపత్రసదృశః కలధౌతసమప్రభః. 129
అక్రోధోఽల్పతను శ్శాంత స్సౌరభప్రసవేషు చ,
కేతకీతరుగుల్మేషు చామోదారణ్యసంచరః. 130
గురువారే విషాధిక్యం కేతకీభోగిలక్షణం,

కేదంగి కేసరసమానాకృతియును, వెండితో తుల్యమైన శరీరచ్ఛాయయును, పరిమళించు కుసుమములుగల ప్రదేశములు, మొగలిపొదలు పరిమళౌషధులు గలుగు నరణ్యములయందు సంచారమును, కోపము లేమియును, అతిశాంతమును, సూక్ష్మమై మొగలికేసు ప్రమాణము శరీరమును, గురువారమునందు విషోద్రేకమును, కలిగియుండునది మొగలిపూ త్రాఁచని చెప్పఁబడును.

9 తెల్లత్రాఁచు.—

అక్రోధ స్సాత్త్వికశ్శాంత శ్చంద్రికాధవళద్యుతిః. 131
గురువారే విషాధిక్యం శ్వేతభోగీతి కథ్యతే,

కోపము లేమియును, సాత్త్వికగుణమును, శాంతస్వభావమును, వెన్నెలవంటి శరీరధావళ్యమును, గురువారమునందు విషోద్రేకమును కలిగియుండునది తెల్లత్రాఁచని చెప్పఁబడును.

10 కోడిత్రాఁచు.—

అష్టాదశాంగుళోన్నత్యః రుదన్వై తామ్రచూడవత్. 132
గృహేషు కుక్కుటాద్యేషు నివస త్యధికక్రుధా,
కుక్కుటాన్ భక్షతి నిశి భృగువారే విషాధికః. 133
ప్రసిద్ధః కుక్కుటాహి స్స్యా న్నిర్ణిద్రో భయదో విదుః,

పదునెనిమిదంగుళముల నిడుపును, కోళ్లను భ్రమ జెందించుటకై కోళ్లవలె నఱచుటయును, ఇండ్లయందును, కోళ్లగూళ్లయందును నివాసమును, అధికకోపమును, రాత్రులయందు కోళ్లను భక్షించుటయును, రూపమునందు భయంకరత్వమును, చుఱుకుఁదనమును, శుక్రవారమునందు విషోద్రేకమును కలిగియుండునది కోడిత్రాఁచనఁబడును.

11 గిరినాగు.—

చంద్రబింబసమాకారఫణోఽసౌ గిరిసంచరః 134
తరుశాఖేషు వాసశ్చ విహంగాశనతత్పరః,
పూర్ణానుస్వారసదృశ కృష్ణపాదపణ స్తథా. 135
భృగువారే విషాధిక్యం గిరిభోగీతు కథ్యతే.

చంద్రబింబమువంటివట్రువయును, ధావళ్యమును గలిగినపడిగయును, పర్వతములయందు సంచారమును, చెట్లకొమ్మలయందు నివాసమును, నిరంతరము పక్షులను భక్షించుటయును, పడగయందు పూర్ణానుస్వారమువలె వర్తులములయిన కృష్ణపాదములును, శుక్రవారమునందు విషోద్రేకమును కలిగియుండునది గిరినాగను త్రాఁచుగా గ్రహింపవలెను.

12 నీరుత్రాఁచు.—

అతిక్ష్వేళో౽తికోపశ్చ నిరతం సంచరే జ్జలే. 136
భృగువారే విషాధిక్యం జలాహి ర్జలజంతుభుక్,

అధిక మగువిషమును, అతికోపమును, జలమునందు సంచారమును, జలజంతుభక్షణమును, శుక్రవారమునందు విషోద్రేకమును, కలిగియుండునది నీరుత్రాఁచని చెప్పఁబడును.

13 గోధుమత్రాఁచు.—

గోధూమవర్ణ శ్శాంతశ్చ గాత్రం పాదత్రయోన్నతిః, 137
మందవారే విషాధిక్యం గోధూమాహిః ప్రకీర్తితః.

సాత్త్వికస్వభావమును, గజము పొడవును, శనివారమునందు విషోద్రేకమును కలిగియుండునది గోధుమత్రాఁచని చెప్పఁబడును.

14 రాచపామునుత్రాఁచు.—

వర్తులాకారభోగశ్చ కృష్ణపాద్రహిత స్తథా. 138
షట్త్రింశదంగుళోన్నత్వ మతిక్రోధో భయంకరః,
వైరనిర్యాతని శ్చైవ వాసో గిరివనేషు చ. 139
కళింగదేశసంజాతో గౌరవర్ణతను స్తథా,
సౌమ్యవారే విషాధిక్యం రాజభోగీతి కథ్యతే. 140

గుండ్రమై కృష్ణపాదములు లేనిపడిగయును, మూఁడడుగుల పొడవును, అధిక కోపమును, భయంకరస్వభావమును, పగదీర్చుకొనునట్టి పట్టుదలయును, పర్వతారణ్యములయందు నివాసమును, పసుపుపచ్చకాంతియు, బుధవారమునందు విషోద్రేకమును గలిగియుండునది రాచపామను త్రాఁచని తెలియవలెను. ఇది విశాఖపట్టణమండలమునందు మాత్రమే జనించుచున్నది మఱియేమండలమునందును కనుపించుట లేదు.

—ఇరువదియొక్క విధములగు మండలీసర్పముల (పెంజరలు) పేళ్లు—

మండలీ కజ్జలాఖ్యాతో రక్తకుండలిగోధికా,
రంగాజీవిపటోలాహీ రత్నకంబళకాభిధః. 141
ఘూత్కారీ చటకాగ్నిశ్చ మండలీ సౌధమండలీ,
మధుమండలిక శ్చైవ ఉత్సన్నీ పాటలీ తథా. 142
కపోతమండలిశ్చైవమూర్వామండలకుండలీ,
పాలాశకహారిద్రశ్చ జంబీళంబుకకుండలీ. 143
ఏవం మండలినః ప్రోక్తాః ఏకవింశతిభేదతః,

కాటుకపొడపెంజర, రక్తపెంజర, ఉడుముపొడపెంజర, కలంకారీపెంజర, పొట్లపెంజర, తివాసిపొడపెంజర, ఊసుపొడపెంజర, పిచ్చుకపొడపెంజర, అగ్నిపొడపెంజర, పొడపెంజర, సున్నపుపొడపెంజర, తేనెపొడపెంజర, కుళ్లుపొడపెంజర, పాదిరీపొడపెంజర, గువ్వపొడపెంజర, గరికపొడపెంజర, మోదుగపూపొడపెంజర, పసుపుపొడపెంజర, దొండపండుపొడపెంజర, గవ్వపొడపెంజర, రెండుతలలశిఖండి అని మండలీసర్పములు (అనగా: పెంజరలనుసర్పములు) యిరువదియొక్క జాతులుగ నున్నవి.

### మండలీసర్పములలక్షణము

**1 కాటుకపొడపెంజరలక్షణము.—**

కజ్జలాహి ర్మహీస్థూలో బహుదీర్ఘోర్ధ్వపుండ్రకః. 144
తద్దంశనా న్మనుష్యాణాం న మృతిశ్చ కదాచన,
శ్వయథుః పాండుకండూతి స్సత్వహైన్యం చ జాయతే. 145

కాటుకపొడపెంజర యనునది మిక్కిలి లావును, అమితమైనపొడవును, శరీరమందు పంగనామములును కలిగియుండును. ఇది జీవజంతువులను కఱచును. దీనికాటువలన దేహమంతయు వాపు, పాండిమ, జిల, నిస్సత్తువ, కలుగును. మరణము కలుగదు; దీనినే దాసరిపా మనియుఁ జెప్పెదరు.

**2 రక్తపెంజరలక్షణము.—**

హస్తప్రమాణదీర్ఘశ్చ రక్తమచ్ఛకళేబరః,
మహావిషోరగో హ్యేషః కథ్యతే రక్తకుండలీ. 146
తత్సందష్టనరాణాం చ విస్మృతిశ్చ ప్రజాయతే,
నాసికాయాం దంతమూల రోమకూపేషు నేత్రయోః. 147
రక్తం స్రవతి కంఠే చ గాత్రే శ్వయథుసంభవః,
తంద్రామూర్ఛానశంలాలా దినాంతే మరణం ధ్రువం. 148

రక్తపెంజర యనునది చేతెడుపొడవును, ఎఱ్ఱనిమచ్చలు, భయంకరమైన విషమును గలిగియుండును; దీనికాటువలన మైకము, తంద్ర, మూర్ఛ, నోటివెంట నురుగుపడుట, నేత్రములు, పండ్లచిగుళ్లు, రోమకూపములు, ముక్కు కంఠము అనువానివల్లనుండి విపరీతముగ రక్తము స్రవించుట మొదలైనవి కలుగును. యెనిమిది జాములలో మనిషి చచ్చుటయును, కాదాచిత్కముగ బ్రతుకుటయును కలదు.

**3 ఉడుముపొడపెంజర.—**

గోధికాహి ర్బృహచ్ఛిద్రో ఖరస్పర్శో భయంకరః,

గోధికాసదృశాకారో తద్దంశా ద్రుధిరస్రవం. 149
విస్మృతి ర్వివశోత్పన్నం మృతి స్స్యా ద్దివసత్రయే,

ఉడుముపోడపెంజ రనునది పెద్దశిరస్సు, గఱుకుశరీరము, ఉడుమువంటి యాకారముకలిగి భయకరమైయుండును. దీనికాటువలన కలిగినగాయమునుండి అధికముగ రక్తము స్రవించును; మైకము వివశత్వము కలిగి, మంత్రౌషధాదిచికిత్సలకు లక్ష్యము చేయక మూఁడుదినములకు తప్పక మనిషికి మరణము సంభవించును.

4 కలంకారీపెంజర.—

పృథగ్విధై శ్చిత్రవర్ణై ర్మండలై ర్విస్ఫురద్వపుః. 150
హస్తప్రమాణదీర్ఘ శ్చ రంగాజీవ్యాహి రుచ్యతే,
తద్దంశా న్మండలోద్భూతం చిత్రకారక్రియోపమం. 151
క్షీయతేచక్షీతే తైలం విదాహం శోఫసంభవం,
పిపాసా కంఠశోషశ్చ దినాంతే మరణం భవేత్. 152

కలంకారీపెంజర యనునది మూరెడుపొడవును, కలంకారిరంగులవంటి పొడలును గలిగియుండును. దీనికాటువలన శరీరమున మిగుల మంటలును, శోఫయును, కలంకారిపని చేయఁబడిన చాందినీవంటిమచ్చలును, కంఠమందు శోఫయును, దాహమును కలుగును. కాటుపడినచోట ఆముదము నూనె మొదలయిన చమురుపదార్థముల నుంచిన నినికిపోవును. ఇట్టిలక్షణములు కలిగి మనుజుని నొకదినములో జంపును.

5 పొట్లపెంజర.—

పటోలాహిః పటోలాభః హస్తోన్నత్యః పటోలవత్,
శీర్షం పుచ్ఛ మతిస్వల్పం మధ్యే స్థూలం విషాధికం. 153
ఏతద్దంశా ద్భవే చ్ఛోఫః కంఠే ఘుర్ఘరనిస్వనం,
కంఠహాంతి ర్వివశ శ్చైవ మారకం స్స్యా చ్చతుర్దినే. 154

పొట్లపెంజరనునది తలయును తోఁకయును సన్నముగను, శరీరము లావుగను, పొట్లకాయరంగు కలిగి మూరెఁడుపొడవు గలదై పొట్లకాయవలెనే యుండును; దీనిచే కాటందినవానికి గొంతుకయందు గఱకగలుగుట, శరీరము వాచుట, నవ కలుగుట యీలక్షణములు కలిగి నాల్గవదినమునందు మృతిక...

6 తివాసీపొడపెంజర.—

వింశదంగుళ దీర్ఘా-
దత్నకంబళవద్ఘ...

ఏతద్దంశా ద్భవే చ్ఛోఫః క్షోభ స్సంజాయతే ధ్రువం,
విస్మృతి శ్నేత్రవైకల్యం మృతి స్స్యా ద్వాసరార్ధకే. 156

తివాసీపొడపెంజ రనునది ఇరువదంగుళములనిడివి, తివాసీరంగులవంటి మచ్చలు కలిగియుండును. దీనికాటుపడినవానికి శరీరమునందు వాపు, మంటలు, మైకము, కన్నులకు చీకటి యీగుణములు కలిగి నాలుగుజాములలో మరణము సంభవించును.

7 ఊదుపొడపెంజర.—

పాదప్రమాణదీర్ఘశ్చ ఘ్రాతాకారాహిః ప్రకథ్యతే.
అస్య ఘ్రాతాకారమాత్రేణ గాత్రే శ్వయధుసంభవః. 157
తత శ్శరీర మాద్యంతే మరక్తం పాండురం భవేత్,
నిస్సత్వ మంగశైథిల్యం చిరకాలమృతి ర్భవేత్. 158

ఊదుపొడపెంజర యనునది యొకఆడుగుపొడవుండును. ఇది కఱచుదు; నరులు మొదలయినవాని శరీరమందు, భుస్సుమని యూదును; అందువలన దేహమందు వాపు, రక్తక్షీణత, పాండిమ, నిస్సత్తువ, కీళ్లయందు చచ్చుదనము ఈదుర్గుణము లేర్పడి చాలకాలమునకు మరణము గలిగించును.

8 పిచ్చుకపొడపెంజర.—

ద్వాదశాంగుళదీర్ఘశ్చ తిలత్రయముఖాంకితః,
గృహాంచలేషు వసతి ర్లంఘున స్సత్వర స్తథా, 159
ఏవంవిధస్వరూపశ్చ చటకాఖ్యసరీసృపః,
ఏతద్దంశనమాత్రేణ చటకాకారదద్రుజాః. 160
ఆపాదమస్తకాంతం చ భవంతి హృది వేదనం,
పిత్తోద్రేక మతిస్తాపం వమనం స భవే స్మృతిః. 161

పిచ్చుకపొడపెంజ రనునది యొకఆడుగు పొడవును, ముఖమునందు మూడు మచ్చలును, కలిగి యుండును; ఇది యిండ్లచూరులయం దుండును; ఇది ప్రాకుచు, ...కుచు పరుగెత్తును; దీనిచే కాటుపడినవారికి దేహమునందు పిచ్చుకమచ్చలను ...త్పన్నను, ఱొమ్మునందు పసరుచేరినట్టులుండును; ...ండును; దీనవలన మరణము

ఘూత్కారా ద్దంశనా ల్లాలా దుగ్రక్షోభం చ దుస్సహం. 162
అగ్నికుండలిసందంశే న మృతి శ్శమనం పరం,

అగ్నిపొడపెంజ రనునది పదునెనిమి దంగుళములపొడవు గలిగియుండును; ఇది మనుష్యులశరీరమందు కాటు వేయుటయును, ఊదుటయును, జొల్లుకార్చుటయును కలదు. ఈమూటిలోనే కారణముచేతగాని, శరీరమునందు మిక్కిలి మంటలు కలుగును. ఆలస్యముమీద నారోగ్యము కలుగును; మరణము లేదు.

10 పొడపెంజరలక్షణము.—

ద్వాదశాంగుళదీర్ఘశ్చ తథా మండలకుండలీ. 163
ఘూత్కార స్పర్శదేశేషు తీక్ష్ణక్షోభః ప్రజాయతే,
అగ్నిదగ్ధసమాకార స్ఫోటకాః ప్రభవంతి హి. 164
జాయంతే తైలపానేన శరీరే నైల్యమండలాః,
కాలాంతరే మృతిః ప్రోక్తా హ్యదష్టే మండలోరగైః. 165

పొడపెంజర యనునది యొకయడుగుపొడవుండును; ఇది కఱవదు; ఊదును; దీనినోటివిసపుగాలి తగిలినవెంటనే శరీరమందు భగ్గుమని మంట లెత్తును; గాలిసోకిన స్థలమునందు రెండుమూడుదినములకు పిమ్మట నిప్పుతో కాల్చబడినట్లు బొబ్బలు జనించును; నూనె మొదలగునవి సేవించినట్టయిన శరీరమందు నల్లనిమచ్చలు పుట్టును; కొంతకాల మిట్టుల బాధపడినపిమ్మట కాలాంతరమందు మృతి కలుగును.

11 సున్నపుపొడపెంజర.—

ద్వాదశాంగుళదీర్ఘశ్చ వసేత్కేదారభూమిషు,
ఘూత్కారా జ్జాయతే క్షోభః మండలాని చ సర్వశః 166
కండూతికుష్ఠవద్గాత్రే గ్రంధి స్స్యా త్సైధకోరగాత్,

సున్నపుపొడపెంజ రనునది యొకయడుగుపొడ వుండును; వరిమళ్ళగనిమల యందుండు నెండ్రకాయబొక్కలలో నివసించును ఎండ్రకాయలను భక్షించుచుండును. ఇది కఱవదు; మనుజులశరీరము నూదును; దానినోటిగాలి తగిలినచోటు మంట లెత్తును; శరీరమునందు మచ్చలు, దద్దురులు, గ్రంధులు సంభవించు జిల యేర్పడి కుష్ఠరోగివలె నుండును. దీనివలన మృతి కలుగదు.

12 తేనెపొడపెంజర —

హస్తద్వయప్రమాణశ్చ అశ్వవర్ణసమాకృతిః. 167
మధుమండలివిఖ్యాతః దష్టే శోఫః ప్రజాయతే,
ప్రభవే న్మండలాగాత్రే కేచి ద్వారే మృతి ర్భవేత్. 168

తేనెపాడపెంజ రనునది రెండుమూరలపొడవును, గుజ్జుపువన్నె గలమచ్చ లును కలిగి యుండును. ఇది కఱచినట్టయిన శరీరమందు వాపు, మచ్చలు జనించి కొన్నిదినములకు మృతి కలుగును.

13 కుళ్లుపొడపెంజర.—

షట్త్రింశదంగుళాకారో నానావర్ణతిలాకృతః,
దుర్భగో పూతిగంధశ్చ ఉత్పన్నాహి స్స ఉచ్యతే. 169
తస్య దంశనమాత్రేణ గాత్రే భారం సముద్భవేత్,
కుష్ఠివద్గాత్ర ముత్పన్నం కునాసా కునఖీ భవేత్. 170
వత్సరైకం గతే మృత్యుః సంతతం శ్వాసబంధనం,

కుళ్లుపొడపెంజర యనునది యొకగజము పొడవును, అనేకవర్ణములుగల పొడ లును, చూచుట కసహ్యమును, దుర్గంధమును కలిగియుండును; దీని కాటుపడిన వారికి శరీరము బరువెక్కును; ముక్కు లడచుకొనును; శ్వాసము బంధించును; కరచరణములయొక్క నఖములు పుప్పిపట్టును; కుష్ఠవ్యాధి సంభవించినట్లు శరీరము కుళ్లి దుర్గంధ మేర్పడును; సంవత్సరకాల మయినపిమ్మట మృతి సంభవించును.

14 పాదిరీపొడపెంజరలక్షణము.—

హస్తప్రమాణదీర్ఘశ్చ పాటలీసమమచ్చకః. 171
అదంశో మందభావశ్చ పాటలాఖ్యో బిలేశయః,
తద్భోగిలిహానా ద్గాత్రే శైత్యం కండూ ద్వివర్ణతా. 172
నిస్సత్వం జాయతే నిత్యం వాంతి హిక్కా ఽరుచి ర్భవేత్,

పాదిరీపొడపెంజ రనునది చేతెడుపొడవును, కలిగొట్టుపూవన్నెమచ్చలును, మొద్దుస్వభావమును కలిగియుండును; ఇది కఱవదు; మనుజుల శరీరములను నాకును; అందువలన శరీరమునందు శైత్యము, నవ, వైవర్ణ్యము, నిస్సత్తువ, వాంతులు, ఎక్కిళ్లు, అరుచి సంభవించును; మృతి యెంతమాత్రము కలుగదు.

15 గువ్వపొడపెంజరలక్షణము.—

త్రింశదంగుళదీర్ఘశ్చ కపోతాభతను స్స్మృతః. 173
పీతమచ్ఛాంకితాంగశ్చ కపోతాహి స్స కథ్యతే,
తద్దష్టానాం మనుష్యాణాం పాండుః కండుశ్చ జాయతే. 174
స్వయథుః పీతమచ్ఛోత్థః దద్రుశ్చేతి సకృ స్స్మృతిః,

గువ్వపొడపెంజరనునది ముప్పదియంగుళములపొడవును, కపోతవర్ణము గల శరీరమును, పసపువన్నెమచ్చలును కలిగియుండును. దీనిచే కాటుపడినవారికి శరీరమందు పాండువ్యాధి, దురద, శోఫ పసుపువర్ణము గలమచ్చలు, దద్దురులుకలుగును; ఒకానొకరికి మరణమును కలుగును.

16 గరికపొడపెంజరలక్షణము.—

దూర్వాకుండలకుండలీపదమితో దూర్వాభమచ్ఛాంకితః 175
కండూర్తి ర్దడతా భవంతి చ వ్యథా తద్దంశనా త్ప్రాణినాం,
దృగ్భేదం శుకవర్ణ మచ్ఛతనుతా తంద్రానశే త్యాదయః. 176
కుష్ఠవ్యాధిసముద్భవో న చ మృతిః పంగుత్వ మాపాదయేత్,

గఱికపొడపెంజరనునది గఱికకసవువన్నెపు మచ్చలును, అడుగుపొడవును, కలిగియుండును. దీనికాటువలన మనుజులకు శరీరమందు దురద, వాపు, మాంద్యము నొప్పి, కన్నులు భ్రమగప్పుట, దేహమాద్యంతము ఆకుపసుపువర్ణముగల పొడలు, శరీరకంపము, వివశత్వము ఇత్యాదిగుణములు కలిగి కుష్ఠవ్యాధి జనింపఁజేయును. కాళ్లయొక్కయు చేతులయొక్కయు వ్రేళ్లు వంకరలై యెండిపోయినట్లు కుష్కించియుండును.

17 మోదుగుపూపొడపెంజర.—

పాదద్వయప్రమాణశ్చ రక్తమచ్ఛః ప్రభాసితః. 177
పాలాశక ఇతి ప్రోక్తః దష్టః శోఫః ప్రజాయతే,
క్షతేక్షోభశ్చ గ్రంథిశ్చ రక్తపిత్తో మృతి ర్నహి. 178

మోదుగుపూపొడపెంజరనునది రెండడుగులపొడవు, యెఱ్ఱనిమచ్చలు గలిగియుండును. దీనికాటందినవారికి శరీరమందువాపు, గాయమందు పోట్లు, శరీరము గ్రంథులుకట్టుట, అప్పటప్పటికి రక్తవమన మగుట, దగ్గిన రక్తము పడుట ఇత్యాదిగుణములు కలిగియుండును.

18 పసపుపొడపెంజరలక్షణము.—

హస్తప్రమాణదేహశ్చ పీతమచ్ఛాంకితం వపుః,
హారిద్రాహిరితి ఖ్యాతః తద్దంశాత్ స్ఫోటకోద్భవః. 179
జ్వరం మరణ మాప్నోతి క్షతే క్షోభః ప్రజాయతే.

పసుపుపొడపెంజరనునది చేతెడుపొడవును, పసపువన్నెమచ్చలును కలిగియుండును. దీనికాటువలన శరీరమందు పసుపురంగుగలబొబ్బలు, జ్వరము, గాయములలో పోట్లు ఏర్పడి మరణము సంభవించును.

19 దొండపండుపొడపెంజర.—

హస్తప్రమాణ మాన్నత్యం గాత్రం బింబఫలోపమం. 180
బింబాహీతి ప్రశస్తోఽయం తస్య దంశా స్మృతి ర్నహి,
శరీరం కాచవర్ణాభం రక్తనాడ్యః ప్రదృశ్యతే. 181
గాత్రం క్షీణం క్షతే క్షోభం భవేద్బింబాహి దంశనాత్,

దొండపండుపొడపెంజ రనునది చేతెడుపొడవును, చక్కగ పండినదొండ పండువర్ణమును కలిగియుండును. దీనికాటువలన, శరీరము గాజుపాలును, నరములుబ్బి యెఱ్ఱగా కాన్పించును; దేహము శుష్కించును; గాయమునందు పోట్లు కలుగును; మృతి సంభవింపదు.

20 గవ్వపొడపెంజర.—

హస్తత్రయోన్నతి ర్భీమో శంబుకాభో జ్వలత్కృధా. 182
ముఖే నేత్రేషు పీతాభం గాత్రే పాండుః ప్రజాయతే,
శంబుకాహిః ప్రదష్టేన క్షతే నిమ్నం భవేద్దిదం. 183

గవ్వపొడపెంజ రనునది మూడుమూరలపొడవును, లావుగను భయంకరముగను, గవ్వవర్ణమును గలిగియుండును. దీనికాటువలన శరీరమందు పాండిమ, ముఖము నేత్రములు పసుపువర్ణ మగుట, కాటుపడినప్రదేశము కుంగి గుంటపడుట, యిట్టి లక్షణములు కలిగి మృతిలేక యుండును.

21 రెండుతలలశిఖండియను పెంజర.—

పాదత్రయోన్నతి శ్చైవ రక్తశ్యామఖర స్తనుః
తామ్రాభో శ్వేతమచ్ఛాంగః ద్విశీర్ష ఇవ దృశ్యతే. 184
విలోమగమనాభ్యాసీ తాడనా న్నిధనం న హి,
అర్కస్నేహుండకాష్ఠైశ్చ అగ్నినా మరణం భవేత్, 185
తల్లిహా ద్దేహ మాద్యంతం కండూమండలపాండిమాః,
అన్నద్వేషశ్చ శోఫశ్చ గ్లా[illegible] ప్రజాయతే. 186

రెండుతలలశిఖండి యను పెంజర, తామ్ర[illegible] మైనయూదావర్ణము, తెల్లని మచ్చలు, గజముపొడవు కలిగియుండును. దీనికి తలవలె తోకవైపును మొద్దుగ నుండుటచేతను, తలవైపునకు ప్రాకునటులనే తోకవైపునకును ప్రాకుటవలన రెండు తల లుండునటుల జనులు భావించెదరు; దీనిశరీరము గఱుకుగనుండును; దీనిని కఱ్ఱతో మోదినను చావదు; జెముడు, జిల్లేడు కఱ్ఱలతో కొట్టినను, నిప్పులో కాల్చినను చచ్చిపోవును; ఇది కఱవదు. మనుజుల శరీరమును నాకును; ఇందువలన దేహమందు నవ, పాండిమ, పొడలు, వాపు గలిగి అన్నద్వేషము సంభవించును.

## నాలుగువిధము లగురాజీమంతసర్పజాతులు

క్షుద్రాః కుంభీనసా శ్చైవ మహాసర్పా శ్చ నిర్విషాః. 187
ఏతే చతుర్విధాః ప్రోక్తా రాజీమంతాఖ్యపన్నగాః,

రాజీమంతసర్పములలో క్షుద్రజాతిసర్పములు, కుంభీనససర్పములు, మహాసర్పములు, నిర్విషసర్పము లని నాలుగుజాతులు గలవు.

## రాజీమంతసర్పజాతిభేదములు

అథ రాజీమతాం మధ్యే భుజంగా శ్చ చతుర్విధాః. 188
పరస్పరాభిసంగేన భవే యుర్గణితా లే,
క్షుద్రాః నవవిధా శ్చైవ అష్టాః కుంభీనసోరగాః. 189
మహాసర్పాశ్చ త్రివిధాః నిర్విషా షోడశ స్మృతాః,

పైన వివరింపఁబడిన నాలుగుజాతులసర్పముల పరంపరసంసర్గవలన క్షుద్రసర్పములు తొమ్మిదిజాతులుగను, కుంభీనససర్పము లెనిమిదికులములుగను, మహాసర్పములు మూఁడుభేదములుగను, నిర్విషసర్పములు పదునాఱు తరగతులుగను పుట్టియున్నవి.

## క్షుద్రసర్పములు

పృథుబంధో నాగబంధః తైలబంధశ్చ మాహిషః. 190
తాళాహి స్తనుజారిశ్చ కుతారముఖపన్నగః,
కుడ్యసర్పాభిధానశ్చ నవై తే క్షుద్రపన్నగాః. 191

పెద్దకట్లపాము, నాగులకట్లపాము, నూనెకట్లపాము, బఱ్ఱెకట్లపాము, కట్లపాము, తాటిబొలుగుపాము, చెట్టెగురుపాము, గొడ్డలిముఖపుపాము, గోడప్రాకుడుపాము అని క్షుద్రసర్పములు తొమ్మిదివిధములుగ నుండును.

1 పెద్దకట్లపాము (లేక పెద్దపరుగుడుపాము)—

గోధూమభోగివ ద్వాహో దీర్ఘషట్త్రింశదంగులః,
తద్దంశనా ద్భవే న్మర్త్యానాం విషోద్రేకం ముహు ర్ముహుః. 192
పృథుకుండలినా కింతు న భవే న్మరణం నృణాం,

పెద్దకట్లపాము (లేక పెద్దపరుగుడుపాము) అనునది గజము నిడుపు గలిగి, గోధుమవన్నెత్రాఁచును బోలియుండును. దీనిచే కాటుపడినవానికి మాటిమాటికి విష మెక్కి బాధించును గాని మరణము కలుగదు.

2 నాగులకట్లపాము (లేక నాగపరుగుడుపాము)—

షట్త్రింశదంగులో నాగః కృష్ణసర్పసమాకృతిః,

ముహుర్ముహు ర్విషోద్రేకః తద్దంశా న్మృతి రస్తి న. 193

నాగపరుగుడు (లేక నాగకట్లపా మనునది) ముప్పదియాఱంగుళములపొడవు కలిగి నల్లత్రాచువలె నుండును. దీనికాటువలన మాటిమాటికి విష మెక్కును. మంత్ర తంత్రౌషధాదులవలన విషము విఱుగును; మృతి కలుగదు.

3 నూనెకట్లపాములక్షణము.—

తైలవర్ణశ్చ సుస్నిగ్ధో దీర్ఘః షట్త్రింశదంగులం,
తైలదర్వీకరః ఖ్యాతః తద్దంశా న్మరణం న హి. 194
తీక్ష్ణక్ష్వేడో హ్యతిక్రూరో విషోద్రేకో ముహుర్ముహుః,

నూనెకట్లపా మనునది ముప్పదియాఱంగుళములపొడవు కలిగి శరీరమంతయు తెల్లనికట్లు కలిగి, మినమిన లాడుచు నూనెవర్ణము కలిగియుండును. దీనివిషము మిక్కిలి చుఱుకైనది; దీనికాటువలన మాటిమాటికి విష మెక్కును; మృతి కలుగదు.

4 బట్టెకట్లపాము.—

పంచాశదంగులాన్నత్యః స్థూలో దారుసమాకృతిః. 195
ఖరస్పర్శక్రూరవిషో మాహిషాహి ర్నమారకః,

బట్టెకట్లపా మనునది యేఁబదియంగుళములపొడవును, మొద్దువలె లావును, శరీరమందు గఱుకును, క్రూర మైనవిషమును కలిగియుండును.

5 కట్లపాములక్షణము.—

హస్తత్రయప్రమాణశ్చ పర్వరేఖాన్వితాకృతిః. 196
ముహుర్ముహు ర్విషోద్రేకీ బంధకాహి న మారకః,

కట్లపా మనునది మూఁడుమూరలపొడవును, శరీరమందు గనుపులవంటికట్లును కలిగియుండును; దీనికాటువలన మాటిమాటికి పర్వసమయములందు విష మెక్కును; మరణము కలుగనేరదు.

6 తాడిగిరి (లేక తాటిబొలుగుపాము) లక్షణము.—

లతేషు తాళవృక్షేషు వర్తతే తైలసన్నిభః. 197
సూక్ష్మో వై సార్ధహస్తాంగో క్రోధీ స్యా చ్ఛ్లిష్టదంశకః,
వైరనిర్యాతనీ క్రూరో తాళాహిర్మృత్యుదాయకః. 198

తాటిబొలుగు అనుపాము చిటికినవ్రేలులావును, మూఁడుజేనలపొడవును, నూనెరంగును కలిగియుండును. ఇది లతాగుల్మములందును, విశేషముగ తాటిచెట్ల

యందును సంచరించును. మనుజుల నిది తలమీఁదనే తప్ప మఱియొచ్చోటను కఱవదు. అందువలన తత్క్షణమే విషమెక్కి మనుజుఁడు గంటలోపలనే చచ్చును. దీని విషమునకు ప్రతిక్రియ లేదు. ఇది పగఁబట్టెనేని మనుజుని చంపియే తీరును. అటు కాదేని తానైనను నిరశనవ్రతము బూని యాఱునెలలలో వైరినాశనమునకు వేచి పిమ్మట చచ్చును.

7 చెట్టెగురుపాములక్షణము—

కనిష్ఠికాప్రమాణోఽసౌ సర్వదా తరుసంచరః,
అష్టాదశాంగులాంగశ్చ వృక్షాద్వృక్షే చ లంఘతే. 199
వైరనిర్యాతనీః క్రోధీ మృత్యువత్ప్రాణహారకః.
కథ్యతే తరుగామీతి తద్దంశాదాశుమారకం. 200

చెట్టెగురుపా మనునది చిటికినవ్రేలు లావును, అడుగున్నరపొడవు గలిగి యుండును. ఇది యెప్పుడును చెట్లమీఁదనే యుండును; ఇది యొకచెట్టుపైనుండి మఱియొకచెట్టుమీఁదికి తటాలున దుముకగలదు. ఇది మనుజులను తలమీఁదగాని, కన్నులమీఁదగాని కఱచును. పగ సాధించువిషయమునందు తాడిగిరిపామునుం బోలి యుండును. ఇది కఱచినతక్షణమే, మణిమంత్రౌషదాదిక్రియల నాలోచించుటకు నవకాశములేనంత త్వరితములోనే మనుజుఁడు చచ్చిపోవును. జీవజంతువులను చంపువిషయములో దీనివిషమువంటి తీక్ష్ణమైనమారకసాధనము మఱియొకటి లేదు. గావున, పర్వతారణ్యములందును నుద్యానవనములందును సంచరించుమనుజులీసర్పమును సదా కనిపెట్టి మెలగవలెను.

8 గొడ్డలిమొగవుపాములక్షణము.—

ధూమ్రోఽరత్నిసముచ్ఛ్రాయః కుఠారాకారమస్తకః,
కృష్ణాయాం మూషికాయాం వా పంకిలాయాం క్షితౌ వసేత్. 201
వర్షాసు బహిరాయాతో కుఠారముఖపన్నగః,
తేన దష్టస్య కుబ్జాని భవంత్యంగాని దేహినః. 202

గొడ్డలిమొగవుపాము ఊదారంగును, గొడ్డలివంటితలయును కలిగి యుండును. రేగటిమట్టి గలభూములలో నౌటభూములలో బురదనేలలో నివసించును; వర్షాకాలములో మాత్రమే బయట తిరుగును; మూరెడుపొడవు గలిగియుండును; ఈసర్పముచే కఱవఁబడిన మనుజునికి అవయవములు కుఱుచలై పొట్టివాఁడై పోవును.

9 గోడప్రాఁకుడుపాములక్షణము.—

అరత్నిద్వితయోచ్ఛ్రాయో విషవేగేఽతిదారుణః,

శ్వేతకాంతి స్తనౌ నీలతిర్యగ్రేఖాసమన్వితః. 203
జానాతి కుడ్య మారోధు మవరోధుం న విందతి,
ఏకాంగుష్ఠపరీణాహః కుడ్యసర్పః ప్రకీర్తితః. 204

గోడసా(మడుపాము రెండుమూరలపొడవు గలిగి తెల్లనిశరీరమును, నల్లని అడ్డచారలును గలిగియుండును. (వేలెడులావు గలిగియుండును. అతిక్రూరమైన విషము కలిగియుండును. ఈసర్ప మెంతచదర మయిన గోడనయినప్పటికి ప్రాకి యెక్కగలదు గాని, దిగుటకు తెలియదు; పైనుండి గబీలున క్రిందపడును.

⟶ కుంభీనసజాతిసర్పభేదము ⟵

ఘంటాపుచ్ఛో గరున్నాగ స్త్రిశూలీ చ జటాధరః,
కుంభీనస శ్శోణముఖో రక్తాక్ష శ్ఛత్రప స్తథా. 205
కుంభీనసోరగా ఖ్యాతాః అష్టా వేతే పృథగ్విధాః,

ఘంటాపుచ్ఛము, గరున్నాగము, త్రిశూలి, జటాధరము, కుంభీనసము, శోణ ముఖము, లోహితాక్షము, ఛత్రపతి అని కుంభీనససర్పము లెనిమిదివిధములు గల [illegible]యుండును.

[illegible]ంటాపుచ్ఛ సర్పలక్షణము.—

అతిదీర్ఘవపుః క్రూరో మహాసత్త్వ విషోరగః. 206
నిరక్షదేశసంచార స్సర్వజంతువినాశకః,
పుచ్ఛాగ్రే ఘంటికానాదా ద్ఘంటాపుచ్ఛ ఇతి స్మృతః. 207
తన్నాదశ్రవణా దూర మపక్రామంతి జంతవః,

మిక్కిలి పొడవుశరీరమును, క్రూరసత్వమును, మిక్కిలిపరాక్రమమును, సంచరించునప్పుడు తోకచివరయందు ఘంటానాదమునుకలిగియుండునది ఘంటాపుచ్ఛసర్పమనఁబడును. ఈసర్పము సర్వజంతువులను భక్షించును. ఉగ్రమయినవిషము గలిగియుండును. సంచారమునకు బయలుదేఱుటతోడనే దీనితోకయందు ఘంటానాదము వంటి యొకనాదము వినఁబడుచుండును. ఆనాదమునుబట్టి సమస్తజీవజంతువులు విని ఘంటాపుచ్ఛసర్పము వచ్చుచున్నదని తెలిసికొని దూరముగా పరుగెత్తును; ఈ సర్పము ఆఫ్రికాదేశపు పర్వతారణ్యప్రదేశములలో నుండును.

2 గరున్నాగసర్పలక్షణము.—

ఖడ్గజిహ్వ శ్చర్మపక్షో ఘూకాస్యో భూనభోగతిః. 208

అష్టారత్నిప్రమాణ స్స్యా ద్గరున్నాగః ఖగాశనః,
నిరక్షుదేశే యే వాస్య సంచారః పరికీర్తితః, 209

ఖడ్గమువంటి నాలుక, గబ్బిలపు టెక్కలవంటి టెక్కలు, గడ్లగూబవంటిముఖము, భూమ్యాకాశగమనములు, ఎనిమిదిమూరలపొడవు, పక్షిజాతులను భక్షించుట, ఈలక్షణములు గలది గరున్నాగము (టెక్కలపాము) అని చెప్పఁబడును. ఇది అఫ్రికాఖండమం దుండును.

3 త్రిశూలీసర్పలక్షణము.—

పృష్ఠే మరకతాభాభీ రేఖాభిః పరిమండితః,
మార్జాలవదన శ్శ్మశ్రు ష్షోడశారత్నివిగ్రహః. 210
త్రిశూలాకారవిలస త్పుచ్ఛశాఖాత్రయాన్వితః,
ఆఫ్రికాఖండసంచారీ త్రిశూలీ నామ పన్నగః. 211

తోకయందు గరుడపచ్చకాంతివంటి రేఖలతో ప్రకాశించుట, పిల్లివంటిముఖము, మీసములు కలిగియుండుట, పదునారుమూరలపొడవుగల దేహము, తోక త్రిశూలమువంటిమూఁడుచీలికెలు కలిగియుండుట ఈలక్షణములు గలది త్రిశూలిసర్పమనఁబడును; ఇదిన్ని అఫ్రికాఖండమం దుండును.

4 జటాధరసర్పలక్షణము.—

మేషస్వరోఽతిస్థూలాంగ ష్షడరత్నిసమున్నతః,
నాగో జటాధరో నామ రోమశః కంబళో యథా. 212
సింహళద్వీపసంచారీ క్రూరసత్త్వ విషోరగః,

మేకవంటిస్వరము అతిస్థూలశరీరము, కాశ్మీరపుగొఱ్ఱెవలె శరీరమంతయు జడలు, ఆఱుమూరపొడవు, కంబళివంటిచాయ ఈలక్షణములు గలది జటాధరసర్పమనఁబడును. ఇది సింహళద్వీపమం దుండును.

5 కుంభీనససర్పలక్షణము —

అరత్ని త్రితయో చ్ఛ్రాయ స్స్యాత్సూకరాస్యో ఘటోదరః. 213
హ్రస్వపుచ్ఛో మందగామీ చంచరీకసమధ్వనిః,
నాగః కుంభీనసో నామ దారుణః పరికీర్తితః. 214

మూఁడుమూరలపొడవు, పందిముఖమువంటిముఖము, కడవవంటికడుపు, కురుచయైనతోఁక, మందగమనము, తుమ్మెదధ్వనివంటికూఁత ఈలక్షణములు గలది కుంభీనససర్పమనఁబడును. సర్వదేశములయందును సకృత్తుగా నుండును.

6 శోణముఖసర్పలక్షణము.—

జలజరాగశిరాస్ఫటికప్రభో
బహుళకోపపరాక్రమవేగవాన్,
ద్విషడరత్నితనుర్ఘనఫూత్కృతి
ర్జగతి శోణముఖో భుజగో మతః. 215

స్ఫటికచ్ఛాయ గలశరీరము, పద్మరాగమణివంటిశిరస్సు, అతిజవసత్వపరాక్రమకోపములు, భయంకరమైనగర్జనము, పదిరెండుమూరలపొడవు గలశరీరము కలిగియుండునది శోణముఖసర్ప మనఁబడును.

7 లోహితాక్షసర్పలక్షణము.—

నీలా దృష్ట్యా విస్ఫులింగాన్ కిరంతో,
భూమే ర్వృక్షం భూమి మస్మా ల్లసంతః. 216
వ్యామాయామా వహ్నిసంకాశనేత్రా,
భీమాః ప్రోక్తాః పన్నగా లోహితాక్షాః. 217

నల్లనివర్ణము, కన్నులనుండి విస్ఫులింగములను రాల్చుట, భూమినుండి చెట్లపైకి చెట్లమీఁదినుండి భూమిపైకి దుముకుట, బారెడుపొడవుగల శరీరము, అగ్నికణములవంటి నేత్రములు, భయంకరాకారము గలిగియుండునవి లోహితాక్షసర్పము లనఁబడును.

8 ఛత్రపతిసర్పలక్షణము.—

అరత్నిపంచకాయతో నితాంతకోమలాంగకో,
వికాసిసంకుచత్ఫణాసితాతపత్రమండితః. 218
సమస్తజంతునాదకృద్ధరన్నసూం శ్చ ఫూత్కృతై,
శ్చరం ద్రుమేషు కేరళే విభాతి ఛత్రపత్యహిః. 219

అయిదుమూరలపొడవు, అతిస్నిగ్ధమైనరోమలాకారము, సంచరించునప్పుడు వికసించుచు లేనప్పుడు ముడుచుకొనుచు నుండుశ్వేతఛత్రముగలశిరస్సు, సర్వజంతుధ్వనులను చేయఁగలిగియుండుట, ఫూత్కారమాత్రమున ప్రాణములను హరించుట, రాత్రులయందు, చెట్లమీఁద నివసించుట, ఈలక్షణములు గలిగియుండునది ఛత్రపతిసర్ప మనఁబడును. ఇది కేరళదేశమునం దుండును.

## మహాసర్పములవివరము

తిలిత్సోఽజగరో నామ సముద్రాజగర స్తథా,
మహాసర్పా స్త్రిధా ప్రోక్తాః విషవైద్యవిశారదైః. 220

దాసరిపాము, కొండచిలువ, సముద్రపుచిలువ అని మహాసర్పములు మూఁడు విధములుగ నుండును.

## ⟶ మహాసర్పములలక్షణము ⟵

1 దాసరిపాములక్షణము.—

షష్ట్యరత్నిసముచ్ఛ్రాయో వ్యాసుగ్రాహ్య కళేబరః,
త్రిపుండ్రాంకితసర్వాంగః కాంత్యా కజ్జలసన్నిభః 221
పరివేష్ట్య నిహంత్యాదౌ గ్రస్త్వా జంతుం శనైశ్చరేత్,
త్రిపుండ్రాంకముఖో వ్యాళ స్త్రిలిశ్లో నామ కీర్తితః. 222

అఱువదిమూరలపొడవు, బారెడులావుగలశరీరము, శరీరమంతట త్రిపుండ్రాకారము గలనామములు, కాటుకవంటిఛాయ, ముఖమునం దూర్ధ్వత్రిపుండ్రములు గలిగియుండునది దాసరిపాము అని చెప్పఁబడును. దీనికి దొరికిన యేజంతువునుగాని, బిఱ్ఱుగ చుట్టికొని చంపి దిగ మ్రింగును.

2 కొండచిలువలక్షణము.—

శతారత్నిసముచ్ఛ్రాయ శ్వేతమండలమండితః,
నీలో వ్యాసత్రయస్థూలో వ్యాళ స్త్వజగరోమతః. 223
స గ్రసిత్వాక్షణాజ్జంతుం పాదపం పరివేష్టయేత్,
తేన తస్య విశీర్ణాంగరాహారో జీర్ణతాం వ్రజేత్. 224
తలిత్వాజగరా వేతౌ శైలేష్వేవ చరిష్యతః,

నూఱుమూరలపొడవు, మూఁడుబారలవలయము, వెడల్పుగల తెల్లనిపొడలు, నీలవర్ణము గలశరీరము కలిగియుండునది కొండచిలువ యని చెప్పఁబడును. ఇది యేజంతువును గాని తట్టున దిగమ్రింగి చెట్టునకు చుట్టికొని నీల్గును. అంతట గర్భస్థ జంతువు చూర్ణమై జీర్ణించును. ఈకొండచిలువ దాసరిపాము అనుసర్పములు కొండల యందుమాత్రమే సంచరించును.

3 సముద్రపుపాములక్షణము.—

సముద్రాజగరో నామ దీర్ఘో ఽతిస్థూలవిగ్రహః, 225
తేన దష్టో భువం ప్రాప్య నైవ శక్యశ్చికిత్సితుం,
తస్మాత్సముద్ర యే వైతం స్థాపయిత్వా చికిత్సయేత్. 226

మిక్కిలిపొడవు, స్థూలము నగుశరీరముగలది సముద్రపుచిలువ యనఁబడును. దీనిచేత కఱవఁబడినమనిషిని భూమిపైకి కొనివచ్చి చికిత్స చేసినయెడల విషము హరిం

పడు. జీవింపఁడు; గనుక అనునిషిని సముద్రములోనే యుంచి మణిమంత్రౌషధ చికిత్సలు చేసినయెడల విషము దిగి జీవించును.

## నిర్విషసర్పభేదములు

దివ్యకో జాలక శ్చైవ పాతకః కలశీతథా,
వృషశాయీ పుష్కలశ్చ వాహినీ సారవాహికః. 227
క్షీరిశుష్క శ్చ కోద్రశ్చ ప్లవోద్భేదో బలాహకః,
వర్షాభ్వికోజ్యోతిరథః గజభక్షశ్చ నిర్విషాః, 228

దివ్యకము, జాలకము, పాతకము, కలశి, వృషశాయి, పుష్కలము, వాహిని, సారవాహి, క్షీరి, శుష్కము (అనఁగా పసిరికపాము,) కోద్రము, ప్లవోద్భేదము (అనఁగా నీరుపాము,) బలాహకము (అనఁగా జెట్టిపోతు,) వర్షాభ్వికము (అనఁగా వానకోయిల, జ్యోతిరథము, గజభక్షము, అనుపదునాలుగును నిర్విషసర్పము లనఁబడును.

## ఉపజాతిసర్పములు

గోధేరకో గోనసశ్చ ఉరగా శ్చోపజాతయః,

గోధేరసర్పము, గోనససర్పము అని ఉపజాతిసర్పములు రెండువిధములుగ నుండును.

## ఉపజాతిసర్పలక్షణము

1 గోధేరసర్పలక్షణము. —

సర్పో గోధేరకో నామ గోధాఖ్యస్యాస్య చ్చతుష్పదః. 229
కృష్ణసర్పేణ తుల్య స్స్యా న్నానాస్య ర్మిశ్రకాదయః,
గాఢసంపాదితోద్ధూతం పీడితం లంబితార్పితం. 230
సర్పితం చ భృశావాధం దంశాయే త్వేన తే భృశాః,

గోధ అనియు, గోధేరక అని చెప్పఁబడు నాలుగుకాళ్లు గలిగి ప్రాకెడి యొక జంతువు గోధేరక మనఁబడును. ఇది కృష్ణసర్పతుల్యమై యుండును.

## గోనససర్పలక్షణము

ఆతపాతప్త గోనాసజాతా గోనసపన్నగాః 231
ఊర్ధ్వదృష్టి శ్చాల్పరూపో దీర్ఘజిహ్వశిరోగుతం,

ఎండ పెట్టుచే కొట్టఁబడిన ఆవులయొక్క ముక్కు నుండి పడుపాములు గోనసము లనఁబడును వానికి దృష్టి యూర్ధ్వముగను, నాలుక పొడవుగను, రూప మల్పముగను, శిరస్సునందు కూఁతయును కలిగియుండును.

### సర్పకులములవివరము

సర్పా శ్చతుర్విధాః ప్రోక్తా విషవైద్యవిశారదైః. 232
బ్రాహ్మణాః క్షత్రియా శ్చైవ వైశ్యా శ్శూద్రా ఇతి క్రమాత్,

సర్పములు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులు గలవై నాలుగువిధములుగ నుండును.

### నాలుగుజాతులసర్పములవర్ణభేదములు

బ్రాహ్మణా శ్శ్వేతవర్ణా స్తు క్షత్రియా రక్తవర్ణకాః. 233
వైశ్యాస్తు పీతవర్ణాస్స్యుః కృష్ణవర్ణాస్తు శూద్రకాః,

తెల్లనివర్ణము గలసర్పములు బ్రాహ్మణజాతియనియు, రక్తవర్ణముగలసర్పములు క్షత్రియజాతియనియు, పచ్చనివర్ణము గలసర్పములు వైశ్యజాతియనియు, నలుపువర్ణము గలసర్పములు శూద్రజాతియనియుచెప్పఁబడును.

### బ్రాహ్మణజాతిసర్పలక్షణము

సరోజగుగ్గులూశీరలామజ్జకశిరీషకైః. 234
సమో గంధోధికః క్రోధః కాంతిస్తు కపిలా స్సితా,
అసితా లోహితా వాపి విప్రజాత్యహిలక్షణం. 235

తామరపువ్వు, సాంబ్రాణి, వట్టివేరు, కురువేరు, దిరిసెనపుపువ్వు అనువానిపరిమళము గలిగి యుండుట, అతికోపము తెలుపు ఎఱుపు నలుపు వర్ణములు కలిగి యుండుట, ఈలక్షణములు కలది బ్రాహ్మణజాతిసర్ప మని తెలియవలయును.

### క్షత్రియజాతిసర్పలక్షణము

లోహితప్రేక్షణో ద్రాక్షాజంబూఖర్జూరసప్రభః,
చంపకాగరుపున్నాగజాతీగంధోఽతికోపనః. 236
హాలేందుశంఖశ్రీవత్సచక్రాంకితఫణః ఫణీ,
దీర్ఘవైరశ్చ విజ్ఞేయో జాత్యా క్షత్రియసంజ్ఞికః. 237

ఎఱ్ఱనికన్నులు, ద్రాక్ష, నేరేడు, ఖర్జూరము వీనివర్ణములు కలిగియుండుట సంపంగిపువ్వులు, అగరు, పొన్నపువ్వులు, జాజిపువ్వులు, అనువానిపరిమళము గలిగి యుండుట అధికకోపము, పడగయందు హలము, చంద్రబింబము, శంఖము, చక్రము, శ్రీవత్సము వీనింబోలినచిహ్నము లుండుట, దీర్ఘక్రోధము కలిగి యుండుట అనునీలక్షణములు గలది క్షత్రియజాతిసర్ప మనఁబడును.

### వైశ్యజాతిసర్పలక్షణము

మండలై రంకిత శ్చిత్రధూమ్రపాటలలోహితైః,

గోమేధికేన వజ్రేణ కపోతేన సమో రుచా. 238
దుగ్ధసర్పి రవిచ్ఛాగగంధో బిందుసమన్వితః,
ఈదృశై ర్లక్షణై ర్యుక్తో వైశ్యజాతి ర్భుజంగమః. 239

శరీరమందు మండలములుగను, పొగవర్ణము, రోజావర్ణము, యెఱుపువర్ణము, గోమేధికము, వజ్రము, పావురము అనువానిసమానవర్ణములు కలిగియుండుట, పాలు, నేయి, గొఱ్ఱె, మేఁక అనువానివాసన కలిగి యుండుట, బిందువులు కలిగి యుండుట ఈలక్షణములు గలది వైశ్యజాతిసర్ప మనఁబడును.

శూద్రజాతిసర్పలక్షణము

దావసైరిభపంకేభసురానకులశోణితైః,
సమే గంధేన గోధూమసప్రభో దీర్ఘబిందుమాన్. 240
శూద్రజాతిః ఫణీ జ్ఞేయో విషతంత్రవిశారదైః,

అడవిదున్న, బురద, యేనుఁగు, కల్లు, ముంగిస రక్తము అనువానిగవులు కలిగి యుండుట, గోధుమవన్నె రేఖాకారము గలదీర్ఘబిందువులు శరీరమందు కలిగి యుండునది శూద్రజాతిసర్ప మని తెలియవలయును.

చతుర్వర్ణసర్పసంచారకాలములు

పూర్వాహ్నే విప్రఫణినో మధ్యాహ్నే క్షత్రజాతయః. 241
విశోఽపరాహ్నే సంధ్యాసు చరేయు శ్శూద్రపన్నగాః,

బ్రాహ్మణజాతిసర్పములు పూర్వాహ్ణమందును, క్షత్రియజాతిసర్పములు మధ్యాహ్నమందును, వైశ్యజాతిసర్పము లపరాహ్ణమందును, శూద్రజాతిసర్పములు సాయంకాలము పైనను సంచారము చేయుచుండును.

నాలుగుజాతులసర్పముల కాహారభేదములు

అద్యా ద్విప్రఫణీ వాయుం మూషకాన్ రాజపన్నగః. 242
మండూకాన్ వైశ్యజాతీయ స్సర్వం శూద్రభుజంగమః,

బ్రాహ్మణజాతిసర్పములు వాయువును, క్షత్రియజాతిసర్పము లెలుకలను, కోమటిజాతిసర్పములు కప్పలను, శూద్రజాతిసర్పము లన్నిఁటిని భక్షించును.

చతుర్విధసర్పదష్టలక్షణము

విప్రాహి రగ్రతో దంశే ద్దక్షిణే క్షత్రియః ఫణీ. 243
వామతో వైశ్యజాతీయ శ్శూద్రసర్పస్తు పృష్ఠతః,

బ్రాహ్మణసర్పములు ముందటిభాగమునందును, క్షత్రియజాతిసర్పములు కుడి

భాగమునందును, వైశ్యజాతిసర్పము యెడమభాగమునందును, శూద్రజాతిసర్పములు వెనుకభాగమునను కఱచును.

### సర్పదష్టమువలన ప్రకోపించుదోషములు

దష్టస్య దక్షిణే భాగే వాతః కోపం ప్రపద్యతే. 244
వామే పిత్తం పురః పశ్చాదుద్రిక్తో జాయతే కఫః,

సర్పములు కుడిప్రక్కను కఱచినట్టయిన వాతము, ఎడమభాగమున కఱచినట్టయిన పిత్తము, ముందు వెనుకభాగములలో కఱచినట్టయిన శ్లేష్మము ప్రకోపించును.

### సర్పసూతికాలలక్షణము

చైత్రే నాగ వృషస్యంతీ జ్యేష్ఠేఽనుసరతి ప్రియం. 245
ఆషాఢే సంగతా తేన కార్తికేండాన్ ప్రసూయతే,

సర్పములకు చైత్రమాసమునందు సంభోగేచ్ఛ కలుగును, జ్యేష్ఠమాసమునందు మొగపాముల ననుసరించి తిరుగును, ఆషాఢమాసమునందు సంయోగము కలుగును, కార్తికమాసమునందు గ్రుడ్లుపెట్టును.

### సర్పములు పెట్టుగ్రుడ్లసంఖ్య

చత్వారింశచ్ఛతం వాండాన్ ద్విశతం వాపి పన్నగీ. 246
సూతే తేషు వినశ్యంతి కేచిద్వాతాతపాదిభిః,
అన్యే స్వయం పరిణతా జాయంతే భువి పన్నగాః. 247

సర్పములు నలుబది, నూరు, ఇన్నూరు గ్రుడ్లుపెట్టును. అందులో యెండకు, గాలికి కొన్ని అవిసిపోయి తక్కినవి తమంతట తామే పిగిలి పాము లగును.

### సర్పముల కాయుఃప్రమాణము

వర్షాణి పంచ జీవంతి కేఽపి కేచిత్తు వింశతిం,
పంచాశత్పంచపంచాశచ్ఛతం చ ద్విశతం పరే. 248
కేచిత్పంచశతం కేచిత్సహస్రం వత్సరా నపి,

కొన్నిటికి అయిదు, కొన్నిటి కిరువది, కొన్నిటి కేబది, కొన్నిటి కేబదియైదు, కొన్నిటికి నూఱు, కొన్నిటి కేనూఱు, కొన్నిటికి వేయి సంవత్సరములు సర్పముల కాయుఃప్రమాణము కలిగియుండును.

### పురుషసర్పలక్షణము

సువిశాలఫణో ధీరో జ్ఞేయః పురుషపన్నగః. 249

పురుషసర్పము విశాలమయినపడగ, ధైర్యము కలిగి యుండును.

### స్త్రీసర్పలక్షణము

ఏకతో వక్రయా యుక్తా పన్నగీ ఫణయాఽల్పయా,

స్త్రీసర్పముల కొకవైపు వంకరయు, కొంచెపాటివెడల్పును గలపడగ గలిగి యుండును.

### నపుంసకసర్పలక్షణము

మృదుదీర్ఘతను ర్మందవేగకోప స్వరో జడః. 250

త్రిభి రేవ దినై ర్వృద్ధిం యాతశ్వేతఫణాధరః,

దేవతాసర్పవిద్వేషీ జ్ఞేయః క్లీబభుజంగమః. 251

నపుంసకసర్పమునకు, మృదువు నిడుపు గలశరీరము, మందమైనవేగస్వరకోపములు, జడత్వము, పుట్టినమూఁడుదినములకే యభివృద్ధిఁజెందుట, తెల్లనిపడగ, జడమైన యాకారము, దేవసర్పములతో శత్రుత్వము ఈలక్షణములు కలిగి యుండును.

### సర్పములకు అల్పమధ్యవిషాధిక్యసమయములు

భీతమత్తావలోష్ణక్షు త్తృష్ణార్తే వర్ధతే విషం,

విషం ప్రకృతికాలా చ తుల్యా ప్రాప్యాల్ప మన్యథా. 252

సర్పములకు భీతిఁ జెందినతరుణమందును, మదించినసమయమందును, ఉష్ణము చేసినప్పుడును, ఆఁకలి గొనినప్పుడును, దాహ మెత్తినప్పుడును, విషము వృద్ధి పొందును.

### సర్పములకు వయోధర్మమునుబట్టి విషాభివృద్ధి

తరుణాః కృష్ణసర్పాస్తు గోనసాః స్థావిరా స్తథా,

రాజీమంతో వయోమధ్యే భయం త్యాశీవిషోపమాః. 253

కృష్ణసర్పములకు లేఁతవయస్సునందును, రాజీమంతసర్పములకు యౌవనదశ యందును, గోనససర్పములకు వార్ధక్యమందును విషాధిక్యము కలిగి యుండును.

### సర్పములకు విష మల్పమగుటకు కారణము

జలాప్లుతా రతిక్షీణాః భీతా నకులనిర్జితాః,

శీతవాతాతపవ్యాధిక్షు త్తృష్ణా శ్రమపీడితాః. 254

తూర్ణః దేశాంతరా యాతాః విముక్తవిషకంచుకాః,

కుశౌషధీకంటకికవ ద్యే చరం తీవ కాననం. 255

దేశంచదివ్యాద్ధుషితం సర్పా స్త్వేల్పవిషామతాః,

నీళ్లలోఁ దనఁడు సర్పములకు, ఆహారము లేక శుష్కించినసర్పములకు, ముంగిసతోఁ గలహించి జయింపఁబడి భయపడినసర్పములకు, శీతవాతాతపాదులచే కొట్టఁ

బడినసర్పములకు, వ్యాధిగ్రస్తమైనసర్పములకు, ఆకలిచేత దప్పిచేత శ్రమచేత పీడింపఁబడినసర్పములకు, అప్పుడే దేశాంతరములనుండి రాఁబడినసర్పములకు, విషము గ్రక్కిన సర్పములకు, దర్భలు దివ్యౌషధులు నుండ్లు గలఅడవులలో సంచరించుసర్పములకు, మహాత్ములున్న గ్రామములలో నివసించుసర్పములకు విషము క్షీణించి అల్ప మయి యుండును.

## సర్పములకు కోఱలయుత్పత్తివినాశములు

వత్సర స్యైకదా దంష్ట్రాః నవాః ప్రాదుర్భవం త్యహేః. 256

సర్పముల కేడాదికొకమారు కోఱలు రాలిపోయి మఱల మొలచుచుండును.

## సర్పదంష్ట్రలస్వరూపము

సప్తదంష్ట్రా భుజంగానా మూర్ధ్వం రక్తాసితప్రభాః,
శిరీషకేసరాకారా స్సప్తాధో భవతి ప్రభాః. 257
చతస్రస్తాసు ఘస్రేషు రాత్రౌ తిస్రో విషాన్వితాః,

సర్పములకు దిరిసెనపూలకేసరములవంటి పీతవర్ణము లగునేడుకోఱలు క్రిందివైపునను, ఎఱుపు నలుపువర్ణము గలయేడుకోఱలు మీఁదివైపునను యుండును. ఆకోఱలకు మధ్యభాగముఁ బోలుకలిగి యుండును. అందులో పగలు విషము గక్కుకోఱలు నాలుగు, రాత్రిపూట విషము గక్కుకోఱలు మూఁడు కలిగి యుండును.

## పాముకాట్లయొక్క సాధ్యాసాధ్యములు

ఏకయా దంష్ట్రయా ద్వాభ్యా మపి దష్టస్య నో భయం. 258
త్రిదష్టః కష్టసాధ్య స్స్యా చ్చతుర్దష్టో న జీవతి,

సర్పదష్టునకు పాముకాటు లొకటి రెండు పడినప్పుడు ప్రాణభయము లేదు. మూడుకాటు లేర్పడిన కష్టసాధ్య మగును. నాలుగుకాట్లు పడినట్టయిన జీవింపఁడని తెలియవలెను.

## పాముకాట్లలో విషము ప్రవేశించువిధము

దంశే త్రిచతురామూషముద్గాకారాస్తు బిందవః. 259
గళంతి సర్పదంష్ట్రాభ్యో విష స్యేతి ప్రచక్షతే,

సర్పదష్టమైనప్పుడు కోఱలగుండ విషబిందువులు నాలుగేని మూఁడేని పెసరగింజంత మినపగింజంత ప్రమాణముతో కాట్లలో దిగును.

అన్యత్.—

సర్పస్య తాలుకామధ్యే దంతో యోఽంకుశసన్నిభః. 260
విముంచతి విషం ఘోరం తే నాయం కాలసంజ్ఞికః,

సర్పముయొక్క దవడలకు మధ్యమందు నంకుళమువలె నుండుకోఱచేత కాటునందు విషము నింపఁబడును. ఆకోఱకే మృత్యుదంష్ట్రి యనియు పేరు కలిగి యున్నది.

అన్యత్.—

సర్పదంష్ట్రాశ్చతస్రస్తు తాసాం వామధరా సితాః. 261
పీతా వామోత్తరాదంష్ట్రే రక్తశ్యామే తథాఽపరే,
యన్మాత్రః పతతే బిందుః గోవాలాత్సలిలోద్ధృతాత్. 262
వామాధరాయాం దంష్ట్రాయాం తన్మాత్రం స్యా దహేర్విషం.
ఏకద్విత్రిచతుర్వృద్ధివిషభాగోత్తరోత్తరా. 263
సవర్ణాస్తత్కృతా దంశా యథాఽధ్యుత్తరా దృశః,
... ... ... ... ...

## సర్పదంశనవిధము

సర్పదేహాశ్రితం క్రోధా ద్విషం సర్పో విముంచతి. 264
... ... ... ... ...

## సర్పములు కఱచుటకు కారణము

జ్ఞేయో దశవిధో దంశో భుజంగానాం భిషగ్వరైః,
భీతోన్మత్తః క్షుధార్తశ్చ ఆక్రాంతో విషదర్పితః. 265
ఆహారేచ్ఛుస్సరోషశ్చ స్వస్థానపరిరక్షణం,
నవమం వైరిసంధానం దశమః కాలసంజ్ఞికః. 266

భయము చెందినందునను, వెఱ్ఱియెత్తినందునను, ఆఁకలి యైనందునను, అడ్డగించినందునను, విషోల్బణమువలనను, ఆహారమును సంపాదించుకొనుసందర్భమునందును, కోపము కలిగినందునను, తన యునికిపట్టు సంరక్షించుకొనుటకును, పగపట్టినందునను, కాలకర్మసంయోగమువలనను, అనునీపది హేతువులచేత పాములు కఱచును.

## ఏయేస్థలములలో నివసించుసర్పములు కఱవకూడదు

ఉద్యానే జీర్ణకూపే చ వటే శృంగాటచత్వరే,
శుష్కవృక్షే శ్మశానే చ ప్లక్షశ్లేష్మాతశిగ్రుకే. 267
దేవతాయతనే చైవ తథా చాశోకవృక్షకే,
ఏషు స్థానేషు యే దష్టాస్తేన జీవంతి మానవాః. 268

ఉద్యానవనమునందు, పాడుభావియందు, మఱ్ఱిచెట్టునందును, నాలుగుదారులు కలిసినజతుకమునందును, ఎండిపోయినచెట్టునందును, స్మశానమునందును, జువ్విచెట్టు

నందును, విరిగి(నక్కేరు)చెట్టునందును, మునగచెట్టునందును, దేవాలయమునందును, అశోకవృక్షమునందును నివసించుసర్పములు కఱచినమనుజుఁడు జీవింపఁడు.

——— శరీరమునం దేయేభాగములలో సర్పములు కఱవకూడదు ———

భ్రూమధ్యే చాధరే మూర్ధ్ని జంఘాయాం నేత్రయోర్భ్రువోః,
గ్రీవాచిబుకకంఠేతు కరమధ్యే చ తాలుకే. 269
స్తనయోస్స్కంధయోః కుక్షౌ లింగే వృషణనాభిషు,
మర్మసంధిషు సర్వత్ర సర్పదష్టో న జీవతి. 270

కనుబొమలనడుమను, అడుగుపెదవియందును, తలమీఁదను, పిక్కలమీఁదను, నేత్రములయందును, కనుబొమలమీఁదను, గొంతుకయందును, గడ్డముపైనను, మెడమీఁదను, అఱచేతులయందును, చెంపలయందును, స్తనములందును, భుజశిరస్సులమీఁదను, కడుపుమీఁదను, శిశ్నమునందును, వృషణములయందును, బొడ్డుపైనను, శరీరమునందలి యేకీలులోనైనను సర్పముచే కఱవఁబడినమనుజులు జీవింపరు.

——— సర్పములు కఱవతగనితిథులు ———

అష్టమీ పంచమీ పూర్ణా అమావస్యా చతుర్దశీ,
అశుభా స్తిథయః ప్రోక్తాః సర్పదష్టవినాశికాః. 271

అష్టమి, పంచమి, పూర్ణిమ, చతుర్దశి, అమావాస్య, అనునీతిథులయందు సర్పదష్టమైనవారు జీవింపరు.

——— సర్పములు కఱవతగనివారములు ———

రవౌ భౌమే శనేర్వారే సర్పదష్టో న జీవతి,

ఆదివారము, మంగళవారము, శనివారము, అనునీమూఁడువారములలో సర్పదష్టమైనవారు జీవింపరు.

——— సర్పములు కఱవతగనినక్షత్రములు ———

కృత్తికా శ్రవణం మూలా విశాఖా భరణీ తథా. 272
పూర్వా త్రిస్ర స్తథా చిత్రా శ్రేషాదష్టస్య మారకాః,

కృత్తిక, శ్రవణము, మూల, విశాఖ, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, చిత్త, ఆశ్రేష అనునీనక్షత్రములయందు సర్పదష్టమైనవారు జీవింపరు.

——— సర్పదష్టము కాఁగూడనికాలములు ———

మధ్యాహ్నే సంధ్యయో శ్చైవ హ్యర్ధరాత్రే నిశాత్యయే. 273
వారనక్షత్రదుష్కాలే సర్పదష్టో న జీవతి,

మధ్యాహ్నకాలమందును, ఉభయసంధ్యలయందును, అర్ధరాత్రియందును, తెల్లవాఱుజామునను, రాహుకాలమునందును, త్యాజ్యకాలమునందును సర్పదష్టమైననరుఁడు బ్రతుకఁడు.

## బాలతరుణ వృద్ధసర్పదష్టలక్షణము

వామం బాలాహిదష్టస్య దక్షిణం తరుణాహినా. 274
శోణం స్యా దక్షివృద్ధేన ప్రలాపస్స్వల్పవేదనా,

పామువూరకఱచినయెడల ఎడమనేత్రము, కోడెపాము కఱచినయెడల కుడినేత్రము ఎఱ్ఱపెక్కును. ముసలిపాము కఱచినయెడల, మిక్కిలి వదరుట, కొంచెపాటివేదన కలిగియుండును.

## కుమారీసర్పదష్టలక్షణము

వామే దష్టో భవే ద్రోగీ కుమార్యా ఫణియోషితా. 275

కౌమారదశలో నుండునాఁడుపాము ఎడమవైపున కఱచినయెడల నామనుజుఁడు దీర్ఘరోగి యగును.

## గర్భిణీసర్పదష్టలక్షణము

స్థూలా నీలా భవే జ్జిహ్వా శిరోష్ఠోదరవ్యథా,
భవ త్యతీవ పన్నగ్యా దష్ట స్యాపన్నసత్వయా. 276

గర్భిణిపాము కఱచినయెడల నాలుకవృద్ధిఁ జెంది నలుపెక్కును. పెదవులు, తొడలు, కడుపు, శిరస్సు, వీనియందు నొప్పులు కలుగును.

## సూతికాసర్పదష్టలక్షణము

సూతికాపన్నగీదష్టో రక్తం వమతి వక్త్రతః,
హృల్లాసీనేత్రశూలాఢ్య స్సూచీవిద్ధ ఇ వాంగకే. 277

గ్రుడ్లు పెట్టినపాము కఱచినయెడల, నోట నెత్తురు గ్రక్కుట, ఓమ్మడచికొనుట, కన్నులు నొచ్చుట, శరీరము సూదులతో పొడిచినట్టు లుండుట యీలక్షణములు కలిగి యుండును.

## పురుషసర్పదష్టలక్షణము

పుంసా సర్పేణ దష్టానా మూర్ధ్వాంగే సత్వహీనతా,
ఊర్ధ్వదృష్టిః పదం భూమౌ దక్షిణం న స్థిరాయతే. 278

పురుషసర్పము కఱచినయెడల నడుమునకు పైభాగ మంతయు నిస్సత్తువగుట, మీఁదిచూపేర్పడుట, కుడికాలు భూమిమీఁద మోపకుండుట యీలక్షణములు కలిగి యుండును.

### —— స్త్రీసర్పదష్టలక్షణము ——

సర్పయోషిత్ప్రదష్టానా మధోంగే సత్వహీనతా,
అధోదృష్టిః పదం వామా పృథివ్యాం న స్థిరాయతే. 279

ఆఁడుపాముచే కఱవఁబడినవానికి నధోకాయము చచ్చుబడుట, క్రిందిచూపు, ఎడమకాలు భూమిపై మోపకుండుట, యీలక్షణములు కలిగి యుండును.

### —— నపుంసకసర్పదష్టలక్షణము ——

వ్యామిశ్రలింగై ర్లైస్తు షండదష్టం నరం వదేత్,

నపుంసకసర్పముచే కఱవఁబడినమనుజునకు స్త్రీపురుషసర్పదష్టలక్షణములును కలిగి యుండును.

### —— సర్పదష్టవిషరక్తపరీక్ష ——

రక్తే నిర్హ్రీయమాణే హి కృత్స్నం నిర్హ్రీయతే విషం. 280
దుర్గంధం సవిషం రక్త మగ్నౌ చటచటాయతే,

సర్పదంశము గలస్థలమునందు రక్తమును బిండినయెడల విషముతోఁ గూడిన రక్తము బయలువెడలును. అది మిక్కిలి దుర్గంధము గలదై యగ్నిలోఁ ¦ వేసిన చిటచిట లాడును.

### —— విషరక్తమోక్షణలక్షణము ——

యథా దోషం విశుద్ధం చ పూర్వవ ల్లక్షయే దసృక్. 281
సిరా స్వదృశ్యమానాసు యోజ్యాశ్శృంగజలౌకసః,

... ... ... ... ...

### —— విషరక్తసంస్కారము ——

శోణితం సృతశేషం చ ప్రవిలీనం విషోష్మణా. 282
లేపనైకై స్తు బహుళైః స్తంభయే ద్భృశశీతలైః,

... ... ... ... ...

### —— పాముకోఱలగుణము ——

లాలాస్రావో హి దష్టానాం దంష్ట్రాగుణ ఉదాహృతః. 283

సర్పదష్టుఁడగువానికి, నోట చొంగ కాఱినయెడల నది కోఱలగుణ మని తెలియవలెను.

### —— సర్పదంశమునకు అసాధ్యకారణములు ——

స్మశాన చైత్య వల్మీక యజ్ఞాశ్రయ సురాలయే,

పక్షసంధిషు మధ్యాహ్నే హ్యర్ధరాత్రాష్టమీషు చ. 284
న సిధ్యంతి నరాదష్టాః పాషండాయతనేషు చ,
దృష్టిశ్వాసమనస్సర్వవిషైః రాసీవిషైః స్తథా. 285
వినశ్యంత్యాశు సంప్రాప్తా దష్టా స్సర్వేష్వపి మర్మను,

వల్లకాటిలో పీనుఁగను కాల్చినస్థలమందు, పుట్టలపైన యాగములు చేయఁబడినస్థలములందు, దేవాలయములయందు, పూర్ణిమా అమావాస్యసంధులయందు, మధ్యాహ్నమునందు, అర్ధరాత్రమందు, రెండుపక్షములలోని అష్టమితిథులయందు, పాషండమతములయందు, సర్వమర్మములందును పాములు ఊఁదినను, తాఁకినను, కఱచినను, అట్టిమనుజులు జీవింపరు.

⟶ పాములు కఱచుటకు కారణములు ⟵

నిసర్గదాష్ట్ర్యవిద్వేషా త్సురకాలర్షిచోదనాత్. 286
సర్పాదంశంతి ప్రబలం విషం తేషాం త్తరోత్తరమ్,

కొన్ని సర్పములు స్వాభావికమగు దౌష్ట్ర్యముచేతను, కొన్ని విరోధముచేతను, కొన్ని దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, యమునియొక్కయు ప్రేరణమువలనను కఱచును. వానివిషముయొక్క బలము క్రమముగ నధమమధ్యమోత్తమముగఁ జెప్పవలెను.

⟶ వ్యంతరసర్పలక్షణము ⟵

మార్గే తిష్ఠతి దుష్టత్వా ద్వ్యంతరో భుజగ స్సదా. 287
విజ్ఞాయ హేతు మాదిష్టా త్కుర్యా త్సమ్య క్ప్రతిక్రియాం,

వ్యంతరమనుసర్పము పాపస్వభావము కలదగుటచే నేజంతువునైనను కఱవవలెననుతలంపుననే యెప్పుడు దారి కాచియే యుండును. పై చెప్పఁబడినలక్షణములచే కారణములను తెలిసికొని వానికి తగినటులనే చికిత్సలు చేయవలెను.

⟶ సర్పదంశసర్పఘాతవివరణము ⟵

లాలాపరిక్లేదమాత్రం గాత్రే యత్ర ప్రదృశ్యతే. 288
నసదంష్ట్రాకృతో దంశ స్తుండాఘాతం త మాదిశేత్,

ఎక్కడ దేహమందు దద్దురులు గట్టి జొల్లు గార్చుచు నితరగుణములు లేకుండునో అపుడు పాము కోఱలచే కఱవలే దనియు మూతిచేఁ గొట్టిన దనియు తెలియవలెను.

⟶ సర్పదంశనములవివరము ⟵

వ్యాలీఢో శోణితో దంశో వ్యాలుప్త శ్శోణితాన్వితః. 289

న రక్తం దంశ యే కస్మిం త్రిషు నిత్యం ద్విధో ద్వయోః,

రక్తము లేనియొకకాటు గాని, రెండుకాట్లు గాని వ్యాలీఢ మనఁబడును. రక్తము గలరెండుకాట్లు కాని మూఁడు కాట్లు గాని వ్యాలుప్త మనఁబడును.

—— అన్యత్ ——

చత్వారో దంష్ట్రకం దంశా స్తథా దష్టనిపీడితం. 290
మాంసవ్యాప్తే రవిచ్ఛిన్నం రక్తం తత్ర పరిస్రవేత్,

మాంసమువఱకు కాటు దిగుటచే నవిచ్ఛిన్నముగ రక్తము స్రవించును. అట్టి కాట్లు దంష్ట్రిక మనియు,దష్టనిపీడిత మనియు చెప్పఁబడును. వీనిలో వ్యాలీఢము నిర్విషము గనుక సుసాధ్యము. దంష్ట్రిక మసాధ్యము. వ్యాలుప్తము కృఛ్రసాధ్యము.

—— సర్పవిషలక్షణము ——

భుజంగవిష మప్రాప్య శోణితం దూషయే ద్వపుః. 291
అణురక్తం చ సంప్రాప్తం తైల మప్స్వివ వర్ధతే,

పాముువిషము రక్తసంబంధము లేనియెడల దేహమును దూషింపంజేయునే కాని ప్రాణాపహరణము కానేరదు. కొంచె మైనను రక్తముతో సంబంధించినయెడల నూనెజలమందువలె వృద్ధిఁ బొందును.

—— దర్వీకరవిషలక్షణము ——

దర్వీకరకృతో దంశః సూక్ష్మో దంష్ట్రాప్రదోషితః. 292
విరుద్ధరక్తః కూర్మాభో వాతవ్యాధికరో మతః,

దర్వీకరము (పడిగగలసర్పము) కఱచినచో సూక్ష్మ మైనకాట్లుపడి దూషిత మైనచెడురక్తము కలిగి గాయముపడినప్రదేశమున తాఁబేటివీఁపువలె వాపు కలిగి యుండును. దర్వీకరములవిషము వాతవ్యాధికారణ మై యుండు నని తెలియవలయును.

—— దర్వీకరవిషాష్టవేగములు ——

పూర్వే దర్వీకృతం వేగే దుష్టం స్యాద్ధిభవే దసృక్. 293
శ్యావతా తేన వక్త్రాదా సర్పంతీవ చ కీటకాః,
ద్వితీయే గ్రంథయో వేగే తృతీయే మూర్ధ్ని గౌరవం. 294
దుర్గంధో దంశవిక్లేద శ్చతుర్థే ష్ఠీవనం వమిః,
సంధివిశ్లేషణం తంద్రా పంచమే పర్వభేదనం. 295
దాహో హిధ్మా చ షష్ఠే చ హృత్పీడా గాత్రగౌరవం,
మూర్ఛా విపాకోఽతిసారః ప్రాప్య శుక్రం తు సప్తమే. 296
స్కంధపృష్ఠకటీభంగః సర్వచేష్టానివర్తకః;

దర్వీకరవిషప్రథమవేగమందు దుష్టరక్తము స్రవించును. నోరు నల్లగా కమలి పురుగులు పాఱాడినటు లుండును. ద్వితీయవేగమందు శరీరమున గ్రంథు లేర్పడును. తృతీయవేగమందు గాయము కుళ్లి దుర్గంధయుక్తమై తలయందు బరువేర్పడును. చతుర్థవేగమందు కఫవాంతి, సంధులయందు తీపులు, శరీరకంపము కలుగును. పంచమవేగమందు గణుపులలో వేదన, దాహము, ఎక్కిళ్లు కలుగును. షష్ఠవేగమందు రొమ్ములో మంట, శరీరము బరువెక్కుట, మూర్ఛ, దేహము కుళ్లుట, భేదు లగుట, రేతస్సు స్రవించుట కలుగును. సప్తమవేగమందు మెడ, వెన్నెముక, నడుము చచ్చుపడి అన్నిచేష్ట లుడుగుట, అష్టమవేగమందు మరణము కలుగును.

## మండలీవిషలక్షణము

పృథ్వర్పిత స్సశోభశ్చ దంశిమండలినా కృతః. 297
పీతాభః పీతర క్తశ్చ సర్వపిత్తవికారకృత్,

పింజరలు కఱచినయెడల గాయమువద్ద తక్షణమే పసుపు, ఎఱుపు కలిసిన వర్ణముగఁ గాని, పసుపువర్ణముగఁ గాని వా పేర్పడి పైత్యవ్యాధికారణ మగును.

## మండలీవిషవేగలక్షణము

అథ మండలిదష్టస్య దుష్టం పౌతీ భవ త్యసృక్. 298
తేన పీతాంగతా దాహో ద్వితీయే శ్వయథూద్భవః,
తృతీయే దంశవిక్లేదః స్వేద స్తృష్ణా చ జాయతే. 299
చతుర్థే జ్వర్యతే దాహః పంచమే సర్వగాత్రగః,

పింజరకఱచినవానికి ప్రథమవేగమందు రక్తము దుష్టమై దుర్గంధమువహించును. అందువలన శరీరము పసుపురంగు కలిగి దాహ మేర్పడును. రెండవవేగమందు వాపు కలుగును. మూఁడవవేగమందు కాటులో నొప్పి కలిగి శరీరము చెమర్చుట, దాహము కలుగును. నాల్గవవేగమందు జ్వరము, శరీరము మంటలు కలుగును. అయిదవవేగమునందు విషము దేహమంతటను వ్యాపించును.

## రాజీమంతవిషలక్షణము

కృతో రాజీమతా దంశః పిచ్ఛిలః స్థిరశోథకృత్. 300
స్నిగ్ధః పాండుశ్చ సాంద్రాసృక్ శ్లేష్మవ్యాధిసమోల్బణః,

రాజీమంతసర్పములు కఱచినయెడల రక్తవ్యాప్తి స్తంభించి రక్తము పలచనయుడిగి శరీరము తెల్లఁబడి మినమినలాడుచు వాపు కలిగి గట్టిపడును. ఈవిషము శ్లేష్మరోగస్వభావము కలది.

### రాజీమంతవిష వేగలక్షణము

దష్టస్య రాజిలై ర్దుష్టం పాండుతాం యాతి శోణితం. 301
ద్వితీయే శోథతా గాత్రే సర్వాంగం గురుతా తథా,
తృతీయే దంశవిక్లేదో నాసికాక్షో ముఖస్రవాః. 302
చతుర్థే గరిమా మూర్ఛా మన్యా స్తంభం చ పంచమే,
గాత్రభంగో జ్వర స్సీతః శేషయోః పూర్వవ ద్వదేత్. 303
కుర్యా త్పంచమవేగేతు చికిత్సా న తతః పరం,

రాజీమత్సర్పదష్టునకు ప్రథమవేగమందు రక్తము దుష్టమై తెల్లఁబడును. ద్వితీయవేగమందు శరీరము వాచి బరువెక్కును. తృతీయవేగమందు గాయమందు పోటు, ముక్కు, కన్నులు, నోరు వీనియందు నీరు కాఱుట. నాల్గవవేగమందు దేహము స్తంభించి మూర్ఛ, మెడలు కుంగతీయుట కలుగును. పంచమవేగమందు శరీరము స్వాధీనము లేక పోవుట, జ్వరము, శీతలము కలుగును. పంచమవేగమునకు తర్వాత చికిత్స చేసినను ప్రయోజనము లేదు.

### విషపీతదిగ్ధ అభిహతలక్షణము

ఫేనం వమతి నిస్సంజ్ఞః శ్యావపాదకరాననః. 304
నాసావసాదో భంగోఽంగే విడ్భేద శ్శ్లథసంధితా,
విషపీతస్య దష్టస్య దిగ్ధే నాభిహతస్య చ. 305
భవం త్యేతాని రూపాణి సంప్రాప్తే జీవితక్షయే,

నురుగు గ్రక్కుట, స్మృతి దప్పుట, కాళ్లుసేతులు ముఖము నల్లఁబడుట, ముక్కు చల్లదనము వహించుట, శరీరము స్వాధీనము తప్పుట, భేదులగుట, సంధులూడిపడినటు లుండుట — అనునీగుణములు విషజంతువులచే కఱవఁబడినవారికిని, విషము తినినవారలకును, విషలిప్తశస్త్రములచే గాయముపడినవారికి, కృత్రిమవిషగ్రస్తులకును జీవితక్షయమందు సంభవించును.

### సర్పదష్టఅసాధ్యలక్షణములు

హిధ్మా శ్వాసో వమిః కాసో దష్టమాత్రస్య దేహినః. 306
జాయంతే యుగప ద్యస్య స హృచ్ఛూలీ న జీవతి,

సర్పదష్టునకు ఎక్కిళ్లు, ఆయాసము, వమనము, దగ్గు, ఱొమ్ములో మంట, యొకేసారి యేర్పడిన జీవింపఁడు.

దష్టమాత్ర సితాతస్యాశీర్యమాణశిరోరుహాః. 307
స్తబ్ధజిహ్వో ముహుర్మూర్ఛ శ్శీతో చ్ఛ్వాసో న జీవతి,

సర్పదష్టునకు కన్నులు తెల్లఁబడినను వెండ్రుక లూడిపోయినను, నాలుక మొద్దుపాఱినను, చల్లనిశ్వాసము కలిగినను, మాటిమాటికి స్మృతి తప్పుచుండినను జీవింపఁడని తెలియవలెను.

### అన్యత్

న నస్యై శ్చేతనాతీక్ష్ణైః న క్షతా త్క్షతజాగమః. 308
దండాహతస్యనో రాజీ ప్రయాతస్యయమాంతికమ్,

సర్పదష్టుఁడు నస్య మాఘ్రాణింపలేకపోయినను, గాయమునందు గుంటబడుటయే కాక చుట్టును గుంటలుబడినను, కూర్చుండఁబెట్టినచో కఱ్ఱతోఁ గొట్టఁబడినవానివలె వ్రేలఁబడి పోవుచున్నను ఇట్టిలక్షణములు కలిగియుండిన జీవింపఁడని తెలియవలెను.

### పాముకాటుండఁగూడనివిధము

చక్రాకృతిశ్చ వా దంశః పక్వజంబూఫలాకృతిః. 309
సునీలశ్వేతరక్తో వా త్రిదశో౽పి న జీవతి,

పాముకాటు గుండ్రముగ నుండినను, నేరేడుపండువర్ణము కలిగి యుండినను, నీలపువర్ణము కలిగి యుండినను, రక్తహీనమై తెల్లగ నుండినను, రక్తము గూడుకట్టినటుల నెఱ్ఱగ నుండినను దేవజాతివాఁడైనను సర్పదష్టుఁడు జీవింపఁడు.

### సర్పదష్టున కుండఁదగనిగుణములు

స్రవే న్మూత్రం పురీషం వా హృచ్ఛూలం ఛర్దిదాహకృత్. 310
సానునాసికయా వాక్యం సంధిభేద మథాపి వా,
తామ్రాభం నేత్రయుగళం అథవా కాకనీలకం. 311
వియోగో దేవదత్తాఖ్య స్తం విద్యా త్కాలపార్శ్వగం,

సర్పదష్టున కప్రయత్నముగ మలమూత్రములు జాఱినను, హృదయము శూలించినను, వమన మైనను, దాహమేర్పడినను, ముక్కుతో మాట్లాడుచుండినను, కీళ్లలో పోట్లు కలిగినను, నేత్రము లెఱ్ఱఁబడినను, లేక నల్లఁబాఱినను ఈలక్షణములు కలవాఁడు జీవింపఁడు.

### పాముకాటున కుండఁగూడనిగుణములు

వేదనా దంశమూలే వా నష్టదంశో౽థవా భవేత్. 312
తత్క్షణా త్తీవ్రదాహ శ్చ సో౽పి కాలేన భక్షితః,

సర్పదష్టునకు గాయమునందు పోటు, మంట కలిగినను, గాయములో కోఱ విఱిగినను, గాయము కేలుకట్టినటుల వఁటపట్టినను అట్టివాఁడు జీవింపఁడు.

### సర్పదష్టుని పరీక్షింపవలసినవిధము

సోమం సూర్యం తథా దీప్తం న పశ్యతి చ తారకం. 313
దర్పణే సలిలే వాథ ఘృతతైలేఽథవా ముఖం,
న పశ్యేద్వీక్ష్యమాణోఽపి కాలదష్టో న జీవతి. 314
జ్ఞాత్వా కాల మకాలం చ పశ్చా ద్భేషజ మాచరేత్,

పాముచే కఱవఁబడినవానికి సూర్యుఁడు, చంద్రుఁడు, తేజస్సు, నక్షత్రములు కనఁబడకపోవుట, అద్దమునందుఁగాని, నీటియందుఁగాని, నేతియందుఁగాని, నూనెయందుఁగాని తనముఖము తనకు కనఁబడకపోవుట అను గురుతులు చూచి సాధ్యాసాధ్యములను కనిపెంచినపిమ్మటనే చికిత్స నారంభింపవలెను గాని పరీక్షింపక చికిత్స చేయకూడదు. పైలక్షణములు కలిగి యుండిన సర్పదష్టుఁడు జీవింపఁడు.

### సర్పదష్టచికిత్సానియమము

తథాపి తస్య కర్తవ్యా చికిత్సా జీవనావధి. 315
రసదివ్యౌషధీనాం చ ప్రభావా త్కాలజి ద్భవేత్,

సర్పదష్టునకు పూర్వోదాహృతము లైనమారకలక్షణములు కలిగియుండినను ప్రాణమున్నంతవఱకు వక్ష్యమాణము లగుమణిమంత్రౌషధాదులవలన చికిత్సలాచరించిన యెడల నోషధీమహిమవలన నొకవేళ జీవించినను జీవింపవచ్చును గాన చికిత్స నవశ్యము చేయవలసినదే.

### సర్పభీతినివారణక్రియాచికిత్స

1 వ క్రియ—

పుష్యే శ్వేతార్కమూలం తు శ్వేతవర్షాభుమూలకం. 316
సంగృహ్య పేయం తత్ ఋక్షే స్నాత్వా తండులవారిణా,
సర్పభీతివినాశార్థం ప్రతిసంవత్సరం నరైః. 317

పుష్యమీనక్షత్రదివసమందు సంగ్రహింపఁబడిన తెల్లజిల్లేడువేరు, తెల్లగలిజేరువేరు బియ్యపుకడుగుతో నూఱితాగియును, ఆనక్షత్రదివసమునందే నామూలికల నూఱి బియ్యపుకడుగులోఁ జేర్చి పూసికొని స్నానము చేయవలసినది. ఇటుల సంవత్సరమున కొకతూరిచొప్పున ప్రతిసంవత్సరము చేయుచుండిన నాయాసంవత్సరములలో నామనిషికి సర్పదంశనభయ మెంతమాత్రమును కలుగ నేరదు.

2 వ క్రియ.—

మసూరం నింబపత్రాణి ఖాదే న్మేషగతే రవౌ,
అబ్ద మేకం న భీతి స్స్యా ద్విషా త్తస్య న సంశయః. 318

సూర్యుఁడు మేషరాశియందుండఁగ చిఱుసెనగలు, వేపాకు కలిపి భక్షించిన నొకసంవత్సరమువఱకు సర్పవిషభయము కలుగదు.

3 అన్యత్.—

మసూరం నింబపత్రాణి యో౽త్తి మేషగతే రవౌ,
అతిరోషాన్వితస్తస్య తక్షకః కిం కరిష్యతి. 319

చిఱుసెనగలు, వేపాకు సమాంశములు కల్పి మేషమాసమందు భక్షించిన మనుజు నొకసంవత్సరమువఱకు పగఁబట్టినతక్షకుఁడైన నేమియు చేయఁ జాలఁడు.

4 అన్యత్.—

ఆషాఢశుక్లపంచమ్యాం కట్యాం శిరీషమూలకం,
తండులోదకపానేన సర్పదంశో న జాయతే. 320
భ్రమాద్వా దంశతే సర్ప స్తదా సర్పో వినశ్యతి,

ఆషాఢశుక్లపంచమినాఁడు సంగ్రహింపఁబడిన దిరిసెనపుచెట్టువేరును అదివసమందే ధూపదీపనైవేద్యాదు లొసంగి నడుమునకు కట్టుకొని బియ్యపుకడుగులో నావేరును నూఱి త్రాగిన నాసంవత్సరమందు సర్పభయము కలుగనేరదు. ఇటుల చేసినవాని నొకవేళ భ్రమపడి పాము కఱచినట్టయిన తక్షణమే యాసర్పము చచ్చును.

5 వక్రియ.—

కృకలాసస్య దంతా స్తు సితసూత్రేణ వేష్టయేత్. 321
బాహౌ బద్ధ్వా విషం హంతి విషం భుక్త్వా న బాధతే,
సర్పవృశ్చికమూషాణాం ముఖస్తంభః ప్రజాయతే. 322

అత్ర మంత్రః—శబరీ కీర్తయ, కీర్తయ, సంజావ సంజావస్వాహా, సహస్రజపా త్సిద్ధిః. అనేన మంత్రేణ కృకలాసదంతాన్ హస్తే బంధయేత్.

పూర్వోక్తమంత్రమును శౌచాచారనియమములతో వేయిమాఱులు జపించిన సిద్ధి యగును. తొండపల్లును తెల్లనినూలుతో చుట్టి పైమంత్రముచేత నభిమంత్రించి రెట్టకు కట్టుకొనిన సమస్తవిషములు హరించుటయేకాక దానిని ధరించియున్నంతవఱకు విషమున్నైత మెక్కదు. విషము భక్షించినను బాధింపదు. సర్పవృశ్చికమూషికాది విషజంతువులకు వాగ్బంధనమును కలుగును.

6 వక్రియ.—

పాతాళగారుడీమూలం లంబమానం గృహే స్థితం,
దృష్ట్వా గచ్ఛంతి తే దూరం సర్పాద్యా విషకీటకాః. 323

మూసరితీఁగవేరును తెచ్చి తా వసియించుగృహమునందు వ్రేలాడఁగట్టిన, దానిని చూచినసర్పాదివిషజంతువు లన్నియును నాయింటికి దూరముగా పరుగెత్తి పోవును.

7 వ క్రియ.—

మూలం తండులవారిణా పిబతి యః ప్రత్యంగిరాసంభవం,
నిష్పిష్టం శుచిభద్రయోగదివసే తస్యాహిభీతిః కుతః?. 324
దర్పా దేవ ఫణీ యదా దశతి తం మోహాన్వితో మూలపం,
స్థానే తత్ర స ఏవ యాతి నియతం చక్రీ యమ స్యాచిరాత్. 325

భద్రయోగముతో కూడినదివసమందు శుచియై దిరిసెనపుచెట్టువేరును తెచ్చి బియ్యపుకడుగుతో నూఱి త్రాగినవానిని సర్పము లెప్పటికిని కఱవవు. ఒకవేళ భ్రమ చేత కఱచిన నాసర్పము తక్షణమే మృతి నొందును.

8 వ క్రియ.—

గృహీత్వా పుష్యనక్షత్రే అమృతా మూలమాలకృత్,
తన్మాలాం ధారయే త్కంఠే సర్పబాధాభయం నహి. 326

పుష్యమీనక్షత్రమునందు తిప్పతీఁగవేరును తెచ్చి కణికలుగ ఖండించి దారమునకు మాలికగా కూర్చి కంఠమందు ధరించిన సర్పభయము కలుగదు. మఱియు సర్పదష్టునికంఠమందు ధరించిన విషము నివర్తించును.

9 వ క్రియ.—

ధవళపునర్నవజటయా తండులజలపీతయాచ పుష్యర్కే,
అపసరతి ఖలు విషధరో భీతి ర్నాస్త్యేవ పుంసాం చ. 327

పుష్యమీనక్షత్రయుక్త మగుభానువారమునందు బియ్యపుకడుగుతో తెల్లగలిజేరువేరును నూఱి త్రాగినట్టిమనుజుని చూచిన సర్పము దూరముగ వెళ్లును. అట్టిమనుజులకు సర్పభీతి యేమియును కలుగదు.

10 వ క్రియ.—

శ్వేతాపరాజితామూలం పిబే త్తండులవారిణా,
న దశంతి తతః సర్పాః షాణ్మాసావధి నిశ్చితం. 328

తెల్లగంటెనవేరును బియ్యపుకడుగుతో నూఱి పుచ్చుకొనిన మనుజునకు నాఱుమాసములవఱకు సర్పభయము కలుగదు.

11 వ క్రియ.—

పీతం చే ద్గారుడీమూలం తోయసిక్తం తథా ఫలం,

దూసరితీఁగవేరు ఉదకముతో నూఱి త్రాగినవాని నాలుగుమాసములపర్యంతము సర్పము కఱవదు. గారుడీయన దూసరితీఁగ యగును. దీనినే గరుడచూడామణి యనియుఁ జెప్పుదురు.

12 వక్రియ.—

అస్తికం మునిరాజం చ నమస్కృత్వా త్పునఃపునః. 329
స్వప్నే సర్పభయం నాస్తి నాన్యథా శంకరోదితం,

మనుజులు ప్రతిదినము పడుకొనునపుడు అస్తికమునిని గూర్చి ధ్యానించి నమస్కారము చేసి పడుకొనుచున్నట్లయిన నామనుజులకు సర్పభయము లేకపోవుటయే గాక స్వప్నమందు కూడ సర్పములు కనఁబడవు.

13 వక్రియ.—

వరాహకర్ణికామూలం హస్తే బద్ధ్వా విషాపహం. 330

పందిచెవిగడ్డను రెట్టకు కట్టిన సర్పవిషము హరించును.

14 వక్రియ.—

ఛత్రీ సర్షపపాణిశ్చ చరే ద్రాత్రౌ దివా తథా,
తచ్ఛాయాశబ్దవిత్రస్తాః ప్రణస్యంతి చ పన్నగాః. 331

గొడుగువేసుకొని ఆవాలు పిడికిటఁబట్టుకొని రాత్రియందుఁగాని పగటియందుఁగాని యేమనుజుఁడు సంచరింపుచుండునో వానిఛాయ పాటినను చప్పుడు వినినను సర్పములు భయపడి నశించును.

15 వక్రియ.—

మధుమధుకకాష్ఠదీప్తో యత్ర జ్వలతి ప్రదీపకోరాత్రౌ,
కులికాదయోఽపి నాగా స్తత్ర ప్రాణా న్విముంచంతి. 332

అతిమధురము, విప్పకట్టె యీరెంటిని చేర్చి మంట వేయఁబడినచోట ఆజ్వాలను చూచిన కులికాదిసర్పములు నాగుబాములు మొదలయినసర్పములు నశించును.

16 వక్రియ.—

మూర్తిం నిర్మాయ తార్క్ష్యస్య తరక్షుదశనేన యః,
సతతం ధారయే త్త్వంగే తం దూరా దురగ స్త్యజేత్. 333

సివంగిదంతముతో గరుడవిగ్రహమును చేయించి రాగి లేక బంగారు తాయెత్తులో పొదిగి శరీరమందు ధరించిన వానిని చూడఁగనే సర్పములు పలాయనమగును.

17 వక్రియ.—

ద్విముఖాహిదేహచూర్ణం నయనం నకులస్య కేకిభపిత్తం,

వినయే వినిహిత మేక ద్భుజగశిరస్స్ఫోటనం కురుతే. 334

రెండుతలలశిఖండి యనుసర్పమును చంపి యెండించినదేహచూర్ణము, ముంగిస కన్నులు, నెమలిచేఁదు యీమూఁడును కలిపి నూతి గుటికచేసి యుంచుకొని సర్పము కనుపడినప్పు డీగుటికను సర్పముమీఁద వైచిన దానిశిరస్సు పగిలిపోవును.

18 సర్పపలాయనమంత్రము.—

ఓం ప్లః సర్పకులాయస్వాహా, అశేషకులసర్పకులాయస్వాహా=అనేన సప్తాభిమంత్రితాం మృత్తికాం గృహమధ్యే క్షిపేత్, సర్పాః పలాయంతే.

పూర్వోక్తమంత్రముచేత నిసుక నేడుమారు లభిమంత్రించి గృహమధ్యమున చల్లిన గృహమున చొచ్చి యున్నసర్పములు గృహము విడిచి వెళ్లును.

దర్వీకరవిషవేగచికిత్స

అథ దర్వీకృతాం వేగే పూర్వే విస్రావ్య శోణితం,
అగదం మధుసర్పిభ్యాం సంయుక్తం త్వరితం పిబేత్. 335

దర్వీకర (పడిగగలపాము) దష్టునకు ప్రథమవేగమందు దష్టమైనచోటనే రక్తమును స్రవింపంజేసి వెంటనే తేనె, నెయ్యి సమాంశములు కలిపి త్రాగింపవలయును.

ద్వితీయే వమనం కృత్వా తద్వదే నాగదం పిబేత్,
విషాపహైః ప్రయుంజీత తృతీయేఽంజననావనే. 336

ద్వితీయవేగమునందు వమనము చేయించి పూర్వమువలె తేనె, నెయ్యి, సమభాగములు కూర్చి త్రాగింపవలయును. తృతీయవేగమందు విషహారోపచారములను చేయించి కన్నుల కంజనము వేయవలెను.

పిబేచ్చతుర్థే పూర్వోక్తం యవాగూం వమనే కృతే,
షష్ఠపంచమయో శ్శీతైః ధిగ్ధం సిక్తమభీక్ష్ణశః. 337
పాయయే ద్వమనం తీక్ష్ణం యవాగూం చ విషాపహైః,
అగదం సప్తమే తీక్ష్ణం యుంజ్యా దంజననస్యయోః. 338

చతుర్థవేగమందు, గంజి త్రాగించి వమనము చేయింపవలెను. పంచమషష్ఠవేగములయందు చల్లనియుదకము నెత్తిన ధారగా పోసి గంజి త్రాగించి వమనము చేయించి విషహారమైనమందులు త్రాగింపవలెను. సప్తమవేగమందు తీక్ష్ణమైనమందులుపయోగించి నశ్యము, అంజనము చేయవలయును.

సింధువారస్య మూలం చ శ్వేతా చ గిరికర్ణికా,

పానం దర్వీకరైర్దష్టే నస్యం మధు సపాకలం. 339

నల్లవావిలివేరు, తెల్లగంటెనవేరు యివి నీళ్లలో నూరి త్రాగి వానినే తేనెలో నూరి నస్యము చేయించిన దర్వీకరవిషము హరించును.

## మండలివిషచికిత్సా

దంశం మండలినాం ముక్త్వా పిత్తలత్వా దథాపరం,
ప్రతప్తైః హేమలోహాద్యైర్దహేదా శూల్కుకేన వా. 340
కరోతి భస్మసా త్సద్యో వహ్నిః కిం నామ రక్షణాత్,
అదూషే త్వూర్ణవక్త్రో వా మృద్భస్మాగదగోమయైః. 341
ప్రచ్ఛాయాంతరరిష్టాయాం మాంసలం తు విశేషితః,
అంగం సహైవ దంశేన లేపయే దగదైర్భృశం. 342
చందనోశీరయుక్తేన సలిలేన చ సేచయేత్,
విశే ప్రవిసృతే విధ్యాచ్ఛిరాం సా పరమా క్రియా. 343

మండలీసర్పవిషము, పిత్తమును ప్రకోపింపఁజేయును. నిప్పులో కాల్పఁబడిన బంగారు, వెండి, రాగి, యినుపశలాకలతో గాయమును పండఁ గాల్చవలయును. మట్టిపేళ్లను నమిలి గాయమందు పట్టింపవలయును. శరీరమునకు గాయమునకు విషహరౌషధములను పట్టింపవలయును. చందనము, వట్టివేళ్లు నీళ్లతో నూరి గాయమందును శరీరమునందును తడుపుచున్న యెడల విషము నివర్తించును.

అన్యత్.—

పంచవల్కవరాయష్టినాగపుష్పైలవాలుకం,
జీవకర్షభకౌశీరం సితో పద్మక ముత్పలం. 344
సక్షౌద్రో హిమవాన్ నామ హంతిమండలినాం విషం,
లేపా చ్ఛ్వయథువీసర్పవిస్ఫోటజ్వరదాహనుత్. 345

పంచవల్కములు, త్రిఫలములు, అతిమధురము, నాగకేసరములు, నూఁగుదోస, జీవకము, ఋషభకము, వట్టివేరు, చక్కెర, పద్మకము, కలువగడ్డ, తేనె, చందనము ఇవి నూరి పట్టించిన పింజరలవిషమువల్ల కలిగిన వాపు గుల్లలు దద్దులు బొబ్బలు జ్వరము మంటలు నివారించును.

అన్యత్.—

కాశ్మర్యవటశృంగాణి జీవకర్షభకౌ సితా,
మంజిష్ఠా మధుకం చేతి దష్టో మండలినా పిబేత్. 346

గుమ్ముడుగడ్డ, మఱ్ఱియూడలు, జీవకము, ఋషభకము, మంజిష్ఠి, అతిమధురము, చక్కెర యివి చూర్ణించి పుచ్చుకొనిన పింజరలవిషము హరించును.

### మండలీవిష వేగచికిత్స

కృత్వాఽవగాఢం శస్త్రేణ మూర్ధ్ని కాకపదం గతః,
మాంసం సురధిరంతస్య చర్మ వా తత్ర నిక్షిపేత్. 347
తృతీయే వమతః పేయాగ్ వేగే మండలినాం పిబేత్,
అతోఽష్టమగదం షష్ఠే గణంవా పద్మకాదికం. 348

మండలీవిషదష్టునకు ద్వితీయవేగమందు మాడు చివ్విచర్మమును గోసివేసి కాకి కాలియుండలిమాంసము నెత్తురు నుంచవలెను. తృతీయవేగమందు వమనము చేయించి గంజి త్రాగింపవలెను. షష్ఠవేగమునందు పద్మకాదిగణముతో మందు తయారుచేసి యియ్యవలెను.

అన్యత్.—

మంజిష్ఠా మధుయుష్ట్యాహ్వా జీవకర్షభకౌ సితా,
కాశ్మర్యం వటశృంగాని పానం మండలినాం విషే. 349

మంజిష్ఠి, తేనె, అతిమధురము, జీవకము, ఋషభకము, చక్కెర, నేలగుమ్మడు, మఱ్ఱియూడలు ఇవి నూటి పుచ్చుకొనిన పింజరలవిషము హరించును.

### రాజీమంతవిష వేగచికిత్స

ఆద్యేఽవగాఢం ప్రఛ్ఛాయ వేగే దష్టస్య రాజిలైః,
అలాబునా హరే ద్రక్తం పూర్వవ చ్ఛాగదం పిబేత్. 350
షష్ఠేఽంజనం తీక్ష్ణతమ మవలీఢం చ యోజయేత్,
అనుక్తేషు చ వేగేషు క్రియా దర్వీకరోదితాః. 351

రాజీమంతసర్పవిషమందు మొదట స్నానము చేయించి సొరకాయబెంకుతో రక్తమోక్షణము కావింపవలయును. పూర్వోక్తశ్లోకమందు చెప్పఁబడినయౌషధచికిత్స చేయవలెను. షష్ఠమవేగమందు కన్నులకు తీక్ష్ణమైన అంజనము వేయవలెను. ఇందు చెప్పఁబడనివేగములందు దర్వీకరములకు చెప్పఁబడినచికిత్సలే చేయవలెను.

### రాజీమంతవిషచికిత్స

అగదః ఫణినాం ఘోరే విషే రాజీమతా మపి,
సమా స్సుగంధా మృద్వీకా శ్వేతాఖ్యా గజదంతికా. 352
అర్ధాంశం సారసం పత్రం కపిత్థం బిల్వ దాడిమం,
సక్షౌద్రమండలివిషే విశేషా దగదో హితః. 353

సుగంధపాలయొల్పు, ద్రాక్ష, మొక్కపువేరు, నాగదంతివేరు ఇవి సమభాగములుగ కూర్చి యిందుకు సగము తామరాకు, వెలగపండుగుజ్జు, మారేడుపండుగుజ్జు,

దానిమ్మపండు ఇవి నూరి తేనెతో కల్పి పుచ్చుకొనిన రాజీమంతసర్పవిషము హరించును.

### ⟶ అన్యచ్చికిత్సా ⟵

కటుకా౽తివిషా కుష్ఠా గృహధూమహరేణుకా,
సక్షౌద్రవ్యోషతగరా ఘ్నంతి రాజీమతాం విషం. 354

కటుకరోహిణి, అతివస, కోష్టు, కరుదువ్వ, రేణుకలు, త్రికటుకములు, గ్రంధితగరము ఇవి చూర్ణించి తేనెతో పుచ్చుకొనిన రాజీమంతసర్పవిషము హరించును.

### ⟶ సర్వసర్పవిషసామాన్యచికిత్స ⟵

నిఖనే త్కాండచిత్రాయా దంశం యామద్వయం భువి,
ఉద్ధృత్య ప్రస్థితం సర్పిధాన్యమృద్భ్యాం ప్రలేపయేత్. 355
పిబే త్పురాణం చ ఘృతం వరాచూర్ణావచూర్ణితం,
జీర్ణే విరిక్తే భుంజీత యవాన్నం మూపసంస్కృతం. 356

ఎట్టచిత్రమూలమును రెండుజాములు భూమిలో పాతిపెట్టి పిమ్మట తీసి ప్రాతనెయ్యి, ధనియాలు, బురదమట్టి వీనిని నూరి గాయముపైన పూసి త్రిఫలచూర్ణమును కల్పినప్రాతనెయ్యిని లోపలికి త్రాగించి అది జీర్ణమై యొకవిరేచనమైన పిదప పెసరపప్పులో సంస్కరింపంబడిన యవాన్నమును భుజింపఁజేసిన సర్వసర్పములవిషము శాంతించును.

### ⟶ వ్యంతరసర్పచికిత్స ⟵

అన్యత్.—

కరవీరార్కకుసుమమూలలాంగలికా కణాః,
కల్కయే దారనాలేన పాఠామరిచసంయుతాః. 357
ఏష వ్యంతరదష్టానా మగద స్సార్వకార్మికః,

గన్నేరుపట్ట, జిల్లేడుపూలు, వేరుపట్ట, నేలతాటిగడ్డలు, పిప్పళ్లు, విషబొద్ది, మిరియాలు ఇవి కలితో కల్కముచేసి పుచ్చుకొనిన దారి కాచి మనుష్యులను కఱవవలె ననుయాచారముగల వ్యంతరసర్పవిషము హరించును.

అన్యత్.—

ద్విపలం నతకుష్టాభ్యాం ఘృతక్షౌద్రం చతుష్పలం. 358
అపి తక్షకదష్టానాం పాన మేత త్సుఖప్రదం,

ఒకపలము గ్రంధితగరము, ఒకపలము కోష్టు, రెండుపలములు నెయ్యి, రెండుపలములు తేనె చూర్ణించి కల్పుకొని త్రాగిన తక్షకదష్టవిష మైనను శాంతించును.

అన్యత్.—

దష్టమాత్రో దశే దాశు తం సర్పం లోష్ట మేవ వా. 359
ఉప ర్యరిష్టం బధ్నీయా దంశం భింద్యా ద్దహే త్తథా,

పాముకఱచినవెంటనే ఆపామును మఱల కఱచినఁగాని మట్టిపెడ్డనుసమలికొని పాముకాటుపైన కాల్చి కుంకుడాకు నలఁగఁ గొట్టి కట్టినయెడల సర్పవిషము హరించును.

—⟹ కృష్ణసర్పచికిత్సా ⟸—

కృష్ణసర్పేణ దష్టస్య లింపే ద్దంశం హృ తేఽసృజి. 360
చారటీనాకులీభ్యాం వా తీక్ష్ణమూలీవిషేణ వా,
పానం చ క్షౌద్రమంజిష్ఠాగృహధూమయుతం ఘృతం. 361
తండులీయకకాశ్మర్యకిణిహీ గిరికర్ణికా,
మాతులుంగీ సితా శేలుః పానన స్యాంజనై ర్హితం. 362

కృష్ణసర్పము కఱచినవానికి గాయమునుండి రక్తమును స్రవింపఁజేసి, గురుగు చెట్టు, సర్పాక్షి, తుంబురులు, నాభి ఇవి చూర్ణించి తేనెతో పుచ్చుకొని మంజిష్టి, కరుదుప్పు, చిత్తిపేరు, నేలగుమ్ముడు, ఉత్తరేణి, తెల్లగంటెన, మాదీఫలపుపేరు, చక్కెర, విరిగి అను నీవస్తువులను పానలేపన నస్యాంజనముల కుపయోగించిన విషము హరించును.

—⟹ గోనససర్పచికిత్సా ⟸—

వంశత్వగ్బీజకటుకాపాటలీబీజనాగరం,
శిరీషబీజాతివిషే మూలం గావేధుకం వచా. 363
పిష్టో గోవారినాఽష్టాంగో హంతి గోనసజం విషం,

వెదురుచెక్క, వెదురుబియ్యము, కటుకరోహిణి, కలగొట్టివిత్తులు, సొంటి, దిరిసెనపువిత్తులు, అతివస, అడవిగోధుమలు, వస ఇవి యావుపంచితమున నూఱి శరీరమునకు పూసికొనినట్టయిన గోనససర్పవిషము హరించును.

1 వ చికిత్స.—

—⟹ అనుభవసిద్ధ మయినసర్పచికిత్సలు ⟸—

సేచనా దుదకే నాథ శీతలేన ముహు ర్ముహుః. 364
రోమాంచో న భవే ద్యస్య తం వింద్యా త్కాలభక్షితం,

పాము కఱచినందువలన సాధారణముగ మనుజులకు మృతి సంభవింప దని వైద్యశాస్త్రమున చెప్పబడియున్నది; పాము కఱచి స్మృతితప్పి నిశ్వాసోచ్ఛ్వాసము లడఁగి

హృదయచలన మాఁగి నాడీగమన ముడిగి కరచరణాద్యంగప్రత్యంగచలనము నశించి మృతుఁ డైనట్లు స్పష్టముగ నిశ్చయింపఁబడినమనుజుని చక్కఁగఁ గూర్చుండఁబెట్టి యిన్నూఱు, మున్నూఱు, నన్నూఱు, నేనూఱుబిందెల యుదకమును నెత్తిన ధారగా పోసిన బొందిలోనికి ప్రాణము తేతెంచి జీవించును. ఇటులచేసినను ప్రాణము రాని యెడల నొకగచ్చుతొట్టికిఁగాని కొయ్యతొట్టికిఁగాని శిలతొట్టికకాయికిఁగాని నిండుగ నుదకము నింపి యాయుదకమునందు సర్పదష్టశవము మూఁడహోరాత్రము లుంచిన తప్పక జీవము ప్రాదుర్భవించును. ఉదకధారాసేచనమువలనఁ గాని, యుదకమునం దుంచినందువలనఁగాని ప్రాణ మావిర్భవించునప్పుడు శరీరమునందలిరోమములు గగుర్పాటును జెందును. ఏనూఱుబిందెలయుదకమున సేచనము చేసినంతట రోమాంచ మగపడనియెడల నుదకమందు శవమును పడవేసి మూఁడుదినము లుంచినప్పు డుదకము లోనుండి బుద్బుదములు బయలుదేఱును. బుద్బుదము లారంభమైనయెడల శవములోనికి ప్రాణము లాసన్న మగుచున్నవని తెలియవలెను. బుద్బుదములు ప్రారంభించిన గడియసేపటికి శవమును బైటతీసి కూర్చుండఁబెట్టి శిరముపైన నుదకధారాసేచనము సేయుచుండిన క్రమముగ ప్రాణములు కలుగును. జలబుద్బుదములు కలుగనియెడల మృతుఁడైనట్లు నిశ్చయింపవలసినది. ఇది ధన్వంతర్యాదివైద్యకమత మై యున్నది. తొమ్మిదిదినములవఱకు నుదకమునం దుంపవలసినట్లు సిద్ధ నాగార్జునమతము.

2 వ చికిత్స.—

సర్పదష్టో యదా నష్ట స్తం సర్పో దంశతే స్వయం. 365
జీవితో మ్రియతే సర్పః స్వయం నిర్విషతాం వ్రజేత్,

పాముచే కఱవఁబడినవాఁడై చచ్చిపోయినను వానిని మరల నాసర్పమువలనఁ గాని మఱియొకసర్పమువలనఁగాని కఱపించినచో సర్పదష్టుఁడు జీవించును. సర్పము మృతిఁజెందును.

3 వ చికిత్స.—

యస్తు సంరోషిత స్సర్పో ధూమం వక్త్రా ద్విముంచతి. 366
తుండాగ్రే ప్రేషితం భుక్త్వా బహుళః స్తేన దంశితః,
అశక్య మగదై ర్మన్త్రై ర్విషే నైవ చికిత్సయేత్. 367
క్షీరతూద్రఘృతై ర్యుక్తం ద్విగుంజం పాయయే ద్విషం,
విషేణ లేపయే ద్దంశం కాలదష్టోఽపి జీవతి. 368

ఏసర్పము కోపోద్రేకముతో నుండునో, అట్టిసర్పము నోటినుండి పొగ వెడలుచుండును. ఏమనుజుఁడైన నట్టిసర్పముచే కఱవఁబడినను ఆసర్పముఖముచే స్పృశింపఁబడినపదార్థముల భక్షించినను వెంటనే విష మెక్కును. అవిష మెట్టిచికిత్సలకు

నశక్యమై యుండును. గనుక నావిషార్తునకు ఆవుపాలు, ఆవునెయ్యి, తేనె సమాంశములుగ కూర్చి అందు కొండుగురిగింజలయెత్తు వత్సనాభిని కలిపి త్రాగించి గాయమునకు సైతము నాభినే చాఁది పట్టించిన తత్క్షణమే విషము హరించును.

4 వ చికిత్స.—

మంత్రౌషధప్రయోగేణ యది దష్టో న జీవతి,
భేదయే త్తీక్ష్ణశస్త్రేణ దంశస్థానే భిషగ్వరః. 369
స్థావరంతు విషం దద్యాత్ దష్టో జీవతి తత్క్షణమ్,

సర్పదష్టునకు మంత్రౌషధప్రయోగాదులవలన విషయవిమోచనము కానియెడల దంశస్థానమును కత్తితో చివ్వి కండ నెత్తివేసి దానిపైని వత్సనాభిని చాఁది పట్టించిన తత్క్షణమే విషము నివర్తించి జీవించును.

5 వ చికిత్స.—

అత్యంతవిషరోగార్తాన్ జలమధ్యే వినిక్షిపేత్. 370
సర్పదష్టవిషం నశ్యేత్ ఆరోగ్యం భవతి స్ఫుటం,

చేష్టలుడిగినసర్పదష్టుని జలమధ్యమునం దుంచినట్టయిన విషవిముక్తుఁడై నిశ్చయముగ జీవించును.

6 వ చికిత్స.—

సద్య స్సర్పేణ దష్టస్య నిక్షిపే ద్వామనాసికే. 371
లిప్త్వా కర్ణమలం చాపి నృమూత్రై స్సేచనం తథా,

సర్పదష్టమైనవానికి తత్క్షణమే యెడమముక్కునందు చెవిగుబిలిపట్టించి నరమూత్రము నాముక్కులో నుంచిన విష మెక్కదు.

7 వ చికిత్స.—

మృతసంజీవనం ఖ్యాతం నిర్గుండీ తగరం విషం. 372
పిండీతగరమూలం చ పుష్యే ణోత్పాట్య యోజయేత్,
దంశే దేయం మృత స్యాపి దష్టో జీవతి తత్క్షణాత్. 373

పుష్యమీనక్షత్రమునాఁడు నల్లవావిలి, గ్రంథితగరము, వత్సనాభి, ప్రంగవేరు అను యోషధులను తెచ్చి మృదువుగ నూఁటి సర్పదష్టుని గాయమునకు బట్టించిన మృతుఁడైనను జీవించును.

8 వ చికిత్స.—

బిదారికందగంధేన దుష్టోరగవిషం హరేత్,

నేలగుమ్ముడుగడ్డను గంధముతీసి సర్పదష్టుని గాయమునకు లేపనము చేసిన విషము హరించి జీవించును.

9 వ చికిత్స.—

అశ్వగంధా మేఘనాదో గోమూత్రే మహిసాక్షికం. 374
గృహధూమయుతం లేపో శివకంఠవిషాపహం,

పెన్నేరుగడ్డ, చిర్రివేరు, మహిసాక్షి, కఱిదువ్వ, ఈవస్తువులను గోమూత్రముతో నూఱి పట్టించిన సర్పవిషము హరించుటయే కాక ఈశ్వరునికంఠమువరకు రాచినట్టియిన నావిషమును హరించును.

10 వ చికిత్స.—

కర్కటీకందలేపేన సర్పదష్టో సుఖీ భవేత్. 375

ఆగాకరగడ్డను గంధము తీసి పట్టించినయెడల సర్పదష్టునివిషము హరించి జీవించును.

11 వ చికిత్స.—

వృశ్చికావీరణామూలం లేపా త్సర్పవిషాపహం,

తెల్లగలిజేరు వేరు, అవురుగడ్డివేరు అనువానిని నూఱి గాయమునకు పట్టించిన సర్పవిషము హరించును.

12 వ చికిత్స.—

కటుతుంబ్యుద్భవం మూలం సూక్ష్మం గోమూత్ర పేషితం 376
ఛాయాశుష్కం వటీమాత్రే పాణిలేపో విషాపహం,

నాగసారవేరు నావుపంచితమున నూఱి మాత్రలు చేసి నీడ నెండించియుంచుకొని మాత్రముతో చాది సర్పదష్టుని అఱచేతులకు పట్టించిన విషము హరించి జీవించును.

13 వ చికిత్స.—

అర్కమూలేన సంలేప్యం దంశే విషహరం మహత్. 377
రక్తచిత్రేంద్రగోపాభ్యాం తథా విషవినాశనం,

సర్పదష్టగాయమునకు జిల్లేడువేరును చాది పట్టించినను, ఎఱ్ఱచిత్రమూలము, ఇంద్రగోప (ఆర్ద్రపురుగు) నూఱి పట్టించినను విషము హరించును.

14 వ చికిత్స.—

కుంకుమం లక్తకం లోధ్రం శిలా చైవాథ రోచనా. 378
గుటికాలేపనం హంతి విషం స్థావరజంగమం,

కుంకుమపువ్వు, లత్తుక, లొద్దుగచెక్క, మణిశిల, గోరోచనము, సమాంశములు నూఱి గుటిక చేసి చాది పట్టించిన స్థావరజంగమవిషములు హరించును.

15 వ చికిత్స.—

ద్వే హరిద్రే శిలా తాలం కుంకుమం ముస్తకం జలైః. 379
గుటికా లేపమాత్రేణ విషం హంతి మహాద్భుతం,

కూరపసపు, మానిపసపు, మణిసిల, తాళకము, కుంకుమపువ్వు, తుంగముస్తలు సమాంశముగ నుదకమున నూటి మాత్ర చేసి నీడ నెండించి యుంచుకొని వలసినప్పు డుదకమునచాది సర్పదష్టగాయమునకు పట్టించిన నత్యద్భుతముగ విషము హరించును.

16 వ చికిత్స.—

పిండీతగరజం మూలం పుష్యే ణోద్ధృత్య యోషితం. 380
లేపనం క్రియతే సద్యః మృతోఽపి స తు జీవతి,

పుష్యమీనక్షత్రమున మ్రంగచెట్టువేరును తెచ్చి గంధముతీసి సర్పదష్టగాయమునకు లేపనము చేసిన మృతుఁడైనను జీవించును.

17 వ చికిత్స.—

శ్వేతా పరాజితా మూలం దేవదానీయామూలకం. 381
వారిణా పేషితం నస్యం కాలదష్టోఽపి జీవతి,

తెల్లగంటెనవేరు, డావరడంగివేరు నుదకముతో నూటి నస్యము చేయించిన విషము హరించి సర్పదష్టుఁడు జీవించును.

18 వ చికిత్స.—

పుష్యోద్ధృతం చ తన్మూలనస్యం చ విషనాశనం. 382
మూలం తు శ్వేతగుంజాయాం సర్వసర్పవిషాపహం,

పూర్వోక్తమగు తెల్లగంటెనవేరును గాని, తెల్లగురిగింజవేరునుగాని పుష్యమీనక్షత్రమున తెచ్చి నూటి నస్యము చేయించిన సమస్తసర్పవిషములు హరించును.

19 వ చికిత్స.—

అహేర్హరితవర్ణస్య పుచ్ఛాగ్రం పాటయేచ్ఛిరః. 383
శుక్లం కృష్ణం పృథక్కార్యం నస్యం సర్పవిషాపహం,
శుక్లం శుక్లే సవ్యనాసే కృష్ణం కృష్ణే చ వామకే. 384
మృతసంజీవనం హ్యేతత్ కాలదష్టోఽపి జీవతి,

పసుపువన్నెసర్పముయొక్క శిరస్సు, తోఁక తెగనటికి వేఱువేఱుగా నెండఁబెట్టి చూర్ణించి యుంచుకొనవలెను. ఆచూర్ణములు ఒకటి తెల్లగను, మఱియొకటి నల్లగ నుండును. శుక్లపక్షములో పాము కఱచినట్టైన కుడిముక్కునకు తెల్లనిచూర్ణమును నస్యము చేయింపవలెను. కృష్ణపక్షమందు కఱచిన వాని యెడమముక్కునకు

వల్లనిచూర్ణమును నశ్యము చేయింపవలెను. ఇటుల చేయించిన కాలాసన్నమైనసర్ప దష్టుఁడు సైతము జీవించును. ఇది మృతసంజీవినీనస్య మనఁబడును.

20 వ చికిత్స.—

పథ్యాక్షౌద్రం మరీచం చ పత్రం హింగు శిలా వచా. 385
జలేన గుటికా నస్యే త్కాలదష్టోఽపి జీవతి,

కరక్కాయ, తేనె, మిర్యాలు, ఆకుపత్రి, యింగువ, మణిసిల, వస వీనిని సమాంశము లుదకమున నూరి నస్యము చేయించిన సర్పదష్టుఁడు జీవించును.

21 వ చికిత్స.—

శిలా హింగు వచా వ్యోషా మభయా త్వక్పత్రకం. 386
నస్యం వాసుకిదష్టస్య నిర్విషం శీతవారిణా,

మణిసిల, ఇంగువ, వస, త్రికటుకములు, కరక్కాయలు, లవంగపుచెక్క, ఆకుపత్రి అనునివి సమాంశము లుదకమున నూరి నస్యముఁ జేసినట్లైన వాసుకిచే దష్టుఁడైనవాఁడైనను విషము హరించి జీవించును.

22 వ చికిత్స.—

కులికామూలనస్యేన కాలదష్టోఽపి జీవతి. 387

దేవకాంచనపువేరు గంధమును నస్యము చేయించినట్టయిన అసాధ్యమగు సర్ప విషమైనను హరించును.

23 వ చికిత్స.—

జలేన లాంగలీకందనస్యం సర్పవిషాపహం,

చెన్నచెల్లగడ్డ నుదకముచే నూరి నస్యము చేసిన సర్పవిషము హరించును.

24 వ చికిత్స.—

జయపాలభవాం మజ్జాం భావయే జ్జంభలద్రవైః. 388
ఏకవింశతివారం తు తతో వర్తిం ప్రకల్పయేత్,
మనుష్యలాలయా ఘృష్టా తతో నేత్రే తయాఽంజయేత్. 389
సర్పదష్టవిషం జిత్వా సంజీవయతి మానవం,

విశ్వామిత్రపాత్రే జయపాలబీజం త్వగ్ఘాటనం కృత్వా గ్రాహ్య మేతద్దృష్టఫలం.

నేపాళపుపప్పులను నిమ్మపండ్లరసములో నిరువదొక్కమారు భావనచేసి ఉమ్మితో నూరి కణికలుచేసి యెండించి కావలసినప్పుడు ఉమ్మితో చాఁది గాయమునకు పట్టించినను కన్నుల కంజనము వేసినను సర్పదష్టుఁడు జీవించును.

25 వ చికిత్స.—

పుత్రజీవిఫలా న్మజ్జా గవాం క్షీరేణ పేషయేత్. 390
లేపనాంజననస్యేన కాలదష్టోఽపి జీవతి,

పుత్రజీవిఫలములపప్పును ఆవుపాలతో నూఱి సర్పదష్టులకు గాయమునకు పట్టించినను అంజనము వేసినను నస్యము చేయించినను విషము హరించి జీవించును.

26 వ చికిత్స.—

భృంగరాజస్య మూలం తు త్రిశూల్యానంతమూలకం. 391
తోయై ర్ఘ్వా తండులీమూలం ప్రత్యేకం విషజి ద్భవేత్,

గుంటగల్గరవేరు గాని త్రిశూలి అనుచెట్టువేరు గాని, తిప్పతీఁగెవేరు గాని, చిఱ్ఱివేరు గాని యివి యుదకముతో నూఱి పానలేపననస్యములు చేసిన సర్పవిషము హరించును.

27 వ చికిత్స —

సోమరాజీబీజచూర్ణం సకృద్గోమూత్రభావితం. 392
చరాచరవిషఘ్నం తం మృతసంజీవనం పిబేత్,

భావంచివిత్తులు గోమూత్రములో నానఁబెట్టి గోమూత్రముతోనే నూఱి పుచ్చుకొనినయెడల స్థావరజంగమవిషములు హరించును.

28 వ చికిత్స.—

మూలం తు శ్వేతగుంజాయా వక్త్రస్థం విషనాశనం. 393
పాఠాద్రవేణ తన్మూలం పానే స్యాత్కాలకూటజిత్,

తెల్లగురిగింజవేరును నోటిలో నుంచుకొని రసము మ్రింగుచుండినను, లేక దానినే విషబొద్దియాకురసముతో నూఱి త్రాగినను స్థావరజంగమవిషములు హరించును.

29 వ చికిత్స.—

రాజవృక్షత్వచం గ్రాహ్యం శుక్లం కృష్ణం పృథక్పృథక్. 394
శుక్లపక్షే తు శుక్లాం తాం చతుర్వింశతిభి స్సహ,
మరిచైః పాననిష్ఠస్య కృష్ణే కృష్ణత్వచం తథా. 395
పీత్వా తై ర్నిర్విషో దష్టః కథితం హారమేఖలే,

తెల్లరేలచెక్కను, నల్లరేలచెక్కను తెచ్చి శుక్లపక్షమందు సర్పదష్టుఁడైన వానికి తెల్లరేలచెక్కను, కృష్ణపక్షమందు దష్టుఁడైనవానికి నల్లరేలపట్టను ఇరువది నాలుగుమిరియములను చేర్చి మృదువుగ నూఱి యుదకమున గల్పి పానము చేయించిన సర్పవిషము నిస్సంశయముగ హరించునని హారమేఖలయను విషవైద్యశాస్త్రమందు చెప్పఁబడి యున్నది.

30 వ చికిత్స.—

పూతీకరంజబీజస్య మజ్జానం కారవేల్లకం. 396

పిష్ట్వా పిబే త్ససర్పిష్కం విషం హంతి న సంశయః,

తపసివిత్తులపప్పు, కాకరవిత్తులపప్పు, ప్రాతనేతితో నూతి మాత్ర చేసికొని భక్షించిన సర్పవిషము హరించును.

31 వ చికిత్స.—

పంచాంగ మశ్వగంధాయాం ఛాగీమూత్రేణ పేషయేత్. 397

లేపా త్పానా న్న సందేహో నానావిషవినాశనం,

పెన్నేరుపంచాంగమును మేకపంచితముతో నూతి త్రాగి దానినే గాయమున పట్టించిన సర్వవిషజంతువులవిషము హరించును.

32 వ చికిత్స.—

కృష్ణదుత్తూరమూలస్య చూర్ణం గ్రాహ్యం పలోన్మితం. 398

కరంజతైలకల్కేణ వటీం కృత్వా తు ధారయేత్,

జంబీరస్యరసైః పీత్వా రాద్రీవిషవినాశనం. 399

నల్లయుమ్మెత్తవేరును పలప్రమాణము గ్రహించి తులమెత్తు కానుగవిత్తులనూనె వేసి నూతి మాత్ర చేసి పుక్కిట పెట్టుకొనవలసినదే కాక ఆమాత్రను నిమ్మపండ్లరసమునఁ గలిపి త్రాగిన సర్పవిషము సమస్తవిషములుఁ హరించును.

33 వ చికిత్స.—

లజ్జాలుమూలం నీల్యా వా మూలం స్వచ్ఛేన వారిణా,

పీత్వా రాద్రీవిషం హంతి లేపా ద్గుంజాఫలం తథా. 400

అత్తపత్తివేరును, నీలివేరును, శుద్ధోదకముతో నూతి పుచ్చుకొని తెల్లగురిగింజపప్పులగంధమును కాటుపైన పట్టించిన సర్పవిషము హరించును.

34 వ చికిత్స.—

గృహధూమం హరిద్రే ద్వే సమూలం తండులీయకం,

అపి వాసుకినా దష్టః పిబే ద్దధిఘృతాన్వితం. 401

కరుదువ్వ, కూరపసుపు, మానిపసుపు, చిట్టివేరు మెత్తగ నూతి యందు నావు పెరుఁగు నావునెయ్యి కలిపి త్రాగిన క్రూరసర్పములవిషము హరించును.

35 వ చికిత్స.—

తండులీయకమూలం తు పీత్వా తండులవారిణా,

తక్షకే నాపి దష్టస్య నిర్విషం కురుతే ధ్రువం. 402

చిత్తివేరును బియ్యపుకడుగులో నూరి త్రాగిన తక్షకదష్టవిష మైనను హరించును.

36 వ చికిత్స.—

శిరీషపుష్పస్వరసై స్సప్తాహం మరిచం సితం,
భావితం సర్పదష్టానాం పానేచాభ్యంజనే హితం. 403

దిరిసెనపువ్వులరసముతో తెల్లమిర్యాల నేడుదినములు భావనచేసి వానిని పుచ్చుకొనినను, అంజనము వేసికొనినను, తలంటుకొనినను సర్పదష్టవిషము హరించును.

37 వ చికిత్స.—

దేవదారూచిత్రకం చ కరవీరార్కలాంగలీ,
మూలాని వారిణా పిష్ట్వా కాలదష్టహరం పిబేత్. 404

దేవదారుచెక్క, చిత్రమూలము, గన్నేరువేరు, తరిగొట్టుచెక్క అనువానినుదకముచే నూరి త్రాగిన విషము హరించును.

38 వ చికిత్స.—

పలప్రమాణం ముసలీస్వరసం టంకణాన్వితం,
ముహుర్ముహుః పిబేత్త్వాశు ఘటికాద్వితయం తథా. 405
యామేకంసర్పదష్టోఽపి విషం హరతి సత్వరం,

నేలతాటిగడ్డలరసము పలమాత్రములో పరకతులము వెలిగారమును కల్పి అరగంట కొకతూరివంతున జాముదనుకు త్రాగించిన సర్పవిషము హరించును.

39 వ చికిత్స.—

తిక్తకోశాతకీమూలం ముసలీమూలకం రసం. 406
యామేకం త్రితయం పీత్వా ద్వితులం విషనాశనం,

చేదుబీరవేరురసము రెండుతులములు, నేలతాటిగడ్డలరసము రెండుతులములు వీని నేకము చేసి యొకజాములోపల మూడుమారులు పుచ్చుకొనిన సర్పవిషము హరించును.

40 వ చికిత్స.—

తిక్తకోశాతకీబీజం తిక్తతుంబీఫలబీజకం. 407
కరంజస్య శిరీషస్య బీజాః ప్రత్యేకకర్షకాః,
గోమూత్రే మర్దయే త్పీత్వా సర్వసర్పవిషం హరేత్. 408

చేదుబీరవిత్తులు, చేదుసొరవిత్తులు, కానుగవిత్తులు, దిరిసెనపువిత్తులు, ప్రత్యేకము తులముచొప్పున కూర్చి ఆవుపంచితమున నూరి పుచ్చుకొనిన సర్వసర్పముల విషము హరించును.

41 వ చికిత్స.—

బలాబీజాని సఙ్గృహ్య మర్ద్యం కర్షం చ కాంజికే,

మద్భిః పీత్వా యామ మేకం దర్వీకరవిషం జయేత్. 409

పేరాముట్టిగింజలు కర్ష (తుల) ప్రమాణము చూర్ణించి కలిలో కల్పుకొని అఱ గంట కొకతూరిచొప్పున జాములోపల నాలుమూరులు పుచ్చుకొనిన సర్పవిషము హరించును.

42 వ చికిత్స.—

పుత్రజీవిఫలే మజ్జా శీతతోయేన పేషయేత్,

లేపనే చాంజనే పానే నస్యే సర్పవిషాపహం. 410

పుత్రజీవివిత్తులపప్పును శీతోదకముతో నూఱి పానలేపనస్యాంజనములు చేసిన సర్పవిషము హరించును.

43 వ చికిత్స.—

శ్వేతార్కమూలం కుటజస్య మూలం

కోశాతకీహింగువచాసమేతం,

అజస్య మూత్రేణ కటుత్రయం చ

పిష్టం విషం హంత్యపి కాలకూటం. 411

తెల్లజిల్లేడువేరు, కొడిసెవేరు, చేదుబీరవిత్తులు, ఇంగువ, వస, త్రికటుక ములు మేకపంచితముచే నూఱి ముద్దచేసి పుచ్చుకొనిన సమస్తసర్పములవిషము హరించును.

44 వ చికిత్స.—

గోమూత్రై ర్నరమూత్రై ర్వా పురాణేన ఘృతేన వా,

హరిద్రాపానమాత్రేణ విషం హంతి చరాచరం. 412

గోమూత్రములోఁగాని నరమూత్రములోఁగాని ప్రాఁతనేతిలోఁగాని పసుపు చూర్ణమును కల్పి పుచ్చుకొనిన స్థావరజంగమవిషములు హరించును.

జ్ఞాపిక.

పురాణఘృతము (ప్రాఁతనెయ్యి) సమస్తము లగుస్థావరజంగమకృత్రిమయోగజవిషములను హరించుటయం దమోఘవీర్యముకలది గనుక ప్రాఁతనేతియొక్క స్వరూప మిట్టిది యని సమస్తజనమునకు తెలియఁదలసిన దావశ్యకమైనందున నిందు క్రింద పురాణసర్పిస్స్వరూప మిట్టి దని తెలుపుచున్నాను.

45 వ చికిత్స.—

పురాణసర్పిస్స్వరూపము

దశవర్షాత్పరం సర్పిః పురాణ మితి కథ్యతే,
యది సర్వవిషార్తానాం సర్వస్థానగతాపహమ్. 413

పదిసంవత్సరములకాలమునకు ముందటినుండి యుంచఁబడియున్న నేయి పురాణసర్పి (ప్రాఁతనెయ్యి) యనఁబడును. దొరకినంత అవునేయి నొకమృద్ఘటమునఁబోసి పైన శరావమును మూసి యేడుచీరమన్నులిచ్చి భూమిలో నాలుగుమూరల పల్లము త్రవ్వి యందు దాఘటమునుంచి పూడ్చివేసి పదసంవత్సరములు వెళ్లనిచ్చి పిమ్మట నాఘటమును తీసి జాగ్రతగ నుంచికొని ఆయాసమయములలో నుపయోగించుకొనుచుండవలయును. ఈ ప్రాఁతనేయి సర్వవిషములకును తక్కిన స్థావరజంగమవిషములకు నుపయోగించుచుండిన తప్పక విషహరణ మగును.

46 వ చికిత్స.—

జలేన లాంగలీకందనస్యా త్సర్వవిషాపహం,
వారిణా టంకణం పీత్వా అథవాఽర్కస్య మూలకం. 414
దర్వీకరంవిషం హంతి శీఘ్ర మేవ న సంశయః,

చెన్నచెర్లగడ్డ నుదకమున నూరి నస్యము చేసినను, వెలిగార ముదకమందు గల్పి త్రాగినను జిల్లేడువేరు నుదకమున నూరి త్రాగినను సర్వవిషము హరించును.

47 వ చికిత్స —

ఇంద్రవారుణికామూల మీశ్వరస్య చ మూలకమ్. 415
తండులీయకమూలస్య రసం సర్వవిషాపహం,

పొట్లపాపరవేరును గాని, ఈశ్వరివేరునుగాని, చిట్టివేరునుగాని, నూరి రసమును పిడిచికొని పుచ్చుకొనిన సర్వవిషము హరించును.

48 వ చికిత్స.—

ఖరకందాన్ ఖండయిత్వా రవిజే సప్తభావితమ్. 416
ఛాయాశుష్కా న్భక్షయిత్వా సర్వసర్పవిషాపహం,

కాసరగడ్డను బిళ్లలుగ తరిగి జిల్లేడుపాలలో నేడుమారులు భావనచేసి నీడనార నిచ్చి చింతగింజంత భక్షించిన సర్పవిషము హరించును.

49 వ చికిత్స.—

నరమూత్రం పిబే చ్ఛ్వాను కాలదష్టోఽపి జీవతి. 417

పాముకఱచినతక్షణమే పుడిసెడుతనమూత్రమును గాని యితరునిమూత్రమును గాని పుచ్చుకొనిన విష మెక్కదు. ఇది మిక్కిలి అనుభవసిద్ధ మైనయోగము.

50 వ చికిత్స.—

కటుకీముషలీమూలం పీత్వా తోయై ర్విషాపహం,

కటుకరోహిణి, నేలతాటిగడ్డలు నీళ్లతో నూరి పుచ్చుకొనిన సర్వవిషము హరించును.

51 వ చికిత్స:—

గోక్షీరైః రజనీం క్వాథ్య పిబే త్సర్వవిషాపహమ్. 418

కూరపసుపు నావుపాలతో కషాయమును కాచి పుచ్చుకొనిన సర్వవిషము హరించును.

52 వ చికిత్స.—

గోక్షీరైః రజనీం కుష్ఠం క్వాథ్యమానం విషాపహం,

ఆవుపాలతో కూరపసపు, కోష్టులను కషాయము గాచి పుచ్చుకొనిన సర్వ విషము హరించును.

53 వ చికిత్స.—

హరిద్రాకుష్ఠమధ్వాజ్యం భుక్తం సర్వవిషాపహమ్. 419

కూరపసుపు, కోష్టు సమముగ చూర్ణించి అందు తేనె, ఆవునెయ్యి కలిపి పుచ్చుకొనిన సర్వవిషము హరించును.

54 వ చికిత్స.—

పిబే దరిష్టమూలం చ విషరోగా ద్విముచ్యతే,

కుంకుడువేరును నూరి కుంకుడుగింజప్రమాణము పుచ్చుకొనిన సర్వవిషము హరించును.

55 వ చికిత్స.—

పిబే దస్రం విషం హంతి నాగతిందుకమూలకమ్. 420

నాగముష్టివేరురసమును తీసి త్రాగిన సర్వసర్పవిషములు శాంతించును.

56 వ చికిత్స:—

మూషలీ టంకణం పానే కాలదష్టోఽపి జీవతి,

నేలతాటిగడ్డలరసములో వెలిగారమును కలిపి త్రాగిన సర్వవిషము హరించును

57 వ చికిత్స.—

పొడపాము (పెంజర)లకు విషహరౌషధము.

అమృతా నాగమల్లీ చ వల్మీకాంకోలచాలికా. 421
చండాలీ తిందుకీ చైవ మరీచా న్సర్దయే జ్జలే,
అంబష్ఠబీజమాత్రేణ సేవయే దుష్ణవారిణా. 422
రాజిలానాం విషం హంతి పథ్యం చోష్ణోదకాంధసం,

తిప్పతీఁగవేరు, నాగమల్లెవేరు, పుట్టపాదరువేరు, ఊడుగవేరు, వస్త్రగాలితపువేరు, నిలివేరు, తీఁగముష్టివేరు, మిరియాలు ఇవి సమభాగములుగ గ్రహించి యుదకమున నూఱి కుంకుడుగింజంతమాత్రలు చేసి నీడనారఁబెట్టి యుదయము నొకమాత్రయు, సాయంకాల మొకమాత్ర చొప్పున నుష్ణోదకముతో పుచ్చుకొనిన నన్నివిధములయిన పెంజరలవిష మొకవారములో హరించును. పథ్యము వరియన్నము వేఁడినీరును మాత్రమే పుచ్చుకొనవలెను.

58 వ చికిత్స.—

ఖరకందాన్ ఖండయిత్వా రవిజే సప్తభావితమ్. 423
ఛాయాశుష్కం ప్రకుర్వీత భుక్త్వా చే త్సార్ధకర్షకం,
షడ్వార మేకయామే చ సర్పదష్టవిషం హరేత్. 424

కాసరగడ్డను బిళ్లలవలె తరిగి జిల్లేడుపాలతో నేడుమారులు భావనచేసి నీడ నారించి సర్పదష్టుఁడు తడవ కఱతులముచొప్పున జాముసేపటిలో నాఱుమాఱులు పుచ్చుకొనిన విషము హరించును.

59 వ చికిత్స.—

అర్కకోరక మాదాయ తద్దుగ్ధేన విమర్దితం,
బదరీఫలమాత్రేణ వటుకాన్ కారయే ద్భిషక్. 425
వారంవారం ప్రదాతవ్యం యామమేకం షట్పదష్టకే,
దర్వీకరవిషం హంతి అహిబాధాభయం నహి. 426

తెల్లజిల్లేడు లేక, జిల్లేడుయొక్క లేఁత మొగ్గలను కోసి యామొగ్గలను త్రెంచునప్పుడు స్రవించుపాల నొకగ్లాసులోనికి పట్టి యాపాలతో నామొగ్గలను నూఱి రేగుపండుప్రమాణము మాత్రలను చేసి పచ్చిమాత్రలనే తమలపాకుమొదలయినవానిలో పొదిగి కాలగంట కొకతూరి జాముసేపు మ్రింగించిన సర్పవిషము హరించును. సర్పదష్టుఁడు మ్రింగఁజాలనిస్థితియం దుండిన నుదకమున కలిపి త్రాగింపవలెను. ఇవి యాఱుమాత్రలకు తక్కువ లేకుండ మ్రింగింపవలెను. అనుభవసిద్ధౌషధము.

60 వ చికిత్స.—

అలాభే తద్వటీ సద్యః వక్ష్యమాణౌషధం పిబేత్,
తూలధూర్త్యర్కపత్రాణాం క్షీరవృంతద్రవాన్వితమ్. 427
గుంజామాత్రం వటీం కృత్వా కాచకుప్యాంతరే క్షిపేత్,
సర్పదష్టస్య దాతవ్యం విషం హరతి తత్క్షణాత్. 428

పైఁజెప్పఁబడినజిల్లేడు మొగ్గలవటుకములు సమయమునకు తటస్థింపనప్పు డుపయోగించుట క్రిందఁ జెప్పఁబడునౌషధమును ముందుగ తయారు చేసి యుంచుకొని సర్పదష్టుల కుపయోగించినతక్షణమే విషము హరించును.

జిల్లేడాకుల కిరువైపుల నంటుకొనియుండెడు దూదివంటి తెల్లనినూఁగును చేతితో గీచి సంపాదించి యొకగాజుపాత్రలో వేసి జిల్లేడులేఁతమొగ్గలను త్రుంచునప్పుడు తొడిమలనుండి స్రవించుపాలతో తడిపి చేతితో చక్కఁగా పిసికి కుంకుడుగింజంతమాత్రలు చేసి నీడ నెండించి యావటుకములను గాలితగులకుండ సీసాలో వేసి కార్కు మూసి యుంచవలెను. ఈమాత్రలను కాలుగంట కొకటిచొప్పున మూఁడుగంటలసేపు మ్రింగించిన సర్పవిషము నిస్సంశయముగ నివర్తించును. ఈమాత్రలు రెండుమాసములు గతించినపిదప నిర్వీర్యము లగును గావున రెండునెలలకొకతూరి క్రొత్తగా మాత్రలను తయారు చేసి యుంచుకొనుచుండవలయును.

61 విషసంజీవినీరసము.—

శుద్ధసూతం గంధకం చ టంకణం శిఖితుత్థకం,
హరిద్రాసమభాగాని నాగవల్లీరసేన చ. 429
దినైకం మర్దనం కుర్యా న్మాషమాత్రం వటీకృతం,
ప్రాతఃకాలే తు సాయాహ్నే మాత్రైకం నరమూత్రకే. 430
పీత్వా సర్పవిషం హంతి మృతసంజీవనం భవేత్,

శుద్ధి చేసినరసము, గంధకము, పొంగించిన వెలిగారము, పొంగించిన మైలతుత్తము, కూరపసపు ఇవి సమభాగములు కూర్చి యొక్కదిన మంతయు తమలపాకుల రసముతో నూరి ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్కమాత్రచొప్పున నరమూత్రములో కలిపి పుచ్చుకొనిన సర్పవిషము హరించును. ఇది మృతసంజీవనీరసమని చెప్పఁబడును. ఈయౌషధమును మాషప్రమాణము మాత్రలను చేయవలయును.

62 కాలశైలాశనీరసము.—

సూతకం గంధకం తుత్థం టంకణం రజనీసమం. 431

దేవదాళ్యాద్రవై ర్మర్ద్యం దినే నిష్కం తు భక్షయేత్,
కాలశైలాశని ర్నామా రస స్సర్పవిషాపహః. 432

రసము, గంధకము, మైలతుత్తము, వెలిగారము, కూరపసపు ఆయవానిని సమాంశములు కూర్చి దేవతాళీస్వరసమున మర్దించి వటుకములు చేసి ప్రాటకు నిష్క ప్రమాణము గలమాత్రను పుచ్చుకొనిన నొకదినమందే సర్పవిషము శాంతించును.

63 విషభంజనీరసము.—

పిప్పలీం మరిచం కుష్ఠం గృహధూమం మనశ్శిలా,
తాళకం సర్షపా శ్శ్వేతాః గోపిత్తేనచ లోడయేత్. 433
గుటికాంజనన స్యేన పానా దంజనలేపనాత్,
తక్షకేణాపి దష్టస్య నిర్విషం కురుతే క్షణాత్. 434

పిప్పళ్లు, మిరియాలు, కోష్ఠు, కరుదుమ్మ, మణిసిల, తాళకము, తెల్లావాలు వీనిని సమాంశములు కూర్చి ఆవుపేరున నూఱి మాత్రలు చేసి నీడ నారఁబెట్టి పానాంజనలేపననస్యముల నుపయోగించిన తక్షకదష్టవిష మయినను తప్పక హరించును.

64 విషవజ్రపాతరసము.—

నిశా చ టంకం చ సజాతికోశం తుల్యం సమాంశం కురు దేవదాళ్యాః,
రసేన పిష్టో విషవజ్రపాతో రసోభవే త్సర్వవిషాపహం తా. 435
నిష్కోఽస్య సంజీవయాతి ప్రయుక్తో
నృమూత్రయోగేన చ కాలదంష్టం,
జడావిషే ణాకులితం తథాన్యైః
విషైశ్చ యుం ఘ్నంతి త మాతురం చ. 436

పసుపు, వెలిగారము, జాజికాయలు సమాంశములు కూర్చి దేవతాళీరసములో నూఱి వటుకములు నిష్కప్రమాణముగ చేసి నీడ నారించి యొకమాత్రను నరమూత్రముతో నూఱి కలిపి పుచ్చుకొనిన నన్నివిషజంతువులవిషములు స్థావర కృత్రిమయోగజవిషములు హరించును.

65 తండులీయకఘృతము.—

తండులీయకమూలేన గృహధూమేన చైకతః,
క్షీరేణ సఘృతం సిద్ధం సమస్తవిషరోగనుత్. 437

చిర్రివేళ్లు, కరుదుమ్మ ఆవుపాలలో కలిపి నాలవపాలు మిగులునట్లు కషాయము కాచి వడియఁగట్టి అందు ఆకషాయప్రమాణము ఆవునెయ్యి కలిపి సిరుచుండించి ఘృతపక్వమున దించి సేవించిన సమస్తవిషములు హరించును.

66 మృత్యుపాశాపహఘృతము.—

అభయాం రోచనాం కుష్ఠ మర్కపత్రం తథోత్పలం,
నలవేతసమూలాని సరళం సురసాంవచామ్. 438

సకలింగాం సమంజిష్ఠా మనంతాం సశతావరీం,
శృంగాటకం సమంగా చ పద్మకేసర మిత్యపి. 439

కల్కీకృత్య పచే త్సర్పిః పయో దత్వా చతుర్గుణం,
సమ్య క్పక్వేఽవతీర్ణే చ శృతశీతే వినిక్షిపేత్. 440

సర్పిస్తుల్యం భిషక్ క్షౌద్రం కృతరక్షం నిదాపయేత్,
నాశయ త్యంజనాభ్యంగం పానవస్తిసు భోజనే. 442

సర్పకీటాఖులూతాభి ర్దష్టానాం విషముత్పరం,
యోగజం తమకం కండూః మాంససాదం విసంజ్ఞతామ్. 442

విషాణి హంతి సర్వాణి జంగమస్థావరాణి చ,
కృత్రిమాణి చ యావంతి గరదోషకృతాని చ. 443

స్పర్శా దేవ విషం హంతి గవేరుపహాతం త్వచం,
మృత్యుపాశాపహం నామ ఘృత మేత త్ప్రకీర్తితమ్. 444

కరకకాయలు, ఎఱ్ఱకలువగడ్డ, కోష్టు, పండుజిల్లేడాకులు, నల్లకలువగడ్డ, బచ్చలిగడ్డలు, ప్రబ్బలివేరు, సరళదారు, తులసి, వస, వెట్టిపుచ్చవేరు, మంజిష్ఠి, తిప్పతీఁగ, పిల్లిగడ్డలు, పరికగడ్డలు, అంతరతామర, పద్మకేసరములు అను నీవస్తువ లను సమాంశములుగ కూర్చి వక్కాముక్కగా నలిచి గొట్టి బానకు వేసి యిందుకు నాలుగువంతులు ఆవుపాలు పోసి అందు కర్ధాంశము ఆవునెయ్యి పోసి నీరుచుండు నటుల ఘృతపక్వమున కాచి వడియగట్టి యాఘృతమునకు సమముగ తేనె కల్పి జాడీ లకు పోసి ధాన్యపుటమువేసి తీసి జాగ్రతగ నుంచుకొని పానాభ్యంజనవస్య వస్తిలేప నాదుల నుపయోగించిన సర్ప వృశ్చిక లూతామూషికాదిసమస్తజంగమవిషములు, స్థావర కృత్రిమ యోగజ దిగ్ధ దూషీవిషాదు లన్నియుఁ హరించును. ఇదియె మృత్యు పాశాపహఘృత మని చెప్పంబడును.

67 మంత్రచికిత్సలు.—

అథ గరుడమన్త్రః.

ఓం ఓం ఓం వాఖ్యేవాః=అనేన మన్త్రేణ సర్పదంశస్య శిఖాబంధనం కుర్యాత్.

ఓం ఓం ఓం దాఖ్యేదాః=అనేన మన్త్రేణ దంష్ట్రిస్య నిర్విషం నిర్వాహయేత్.

### పిత్తవృశ్చికలక్షణము.

అగ్నేయై రల్పసంస్రావో దాహారాగవిసర్పవాన్,
పక్వపీలుఫలప్రఖ్యః ఖర్జూరసదృశోఽథవా. 5

కుట్టినగాయము అగ్నితో కాల్చినటువలె మండుచు శరీరమంతయు మంటలు పుట్టి కుట్టినప్రదేశమునందును చుట్టుప్రక్కలను గురుగుకాయవంటివిగాని ఖర్జూరపు కాయవంటివిగాని బొబ్బ లేర్పడిన పిత్తప్రకృతి గలవృశ్చిక మని తెలియవలెను.

### శ్లేష్మవృశ్చికములు.

కఫాధికై ర్మందరుజః పక్వోదుంబరసన్నిభః,

కుట్టినగాయమందు మందవేదనయు, నోటజొల్లు, నురుగుస్రవించుట కుట్టిన చోట అత్తిపండువంటి గ్రంధి కలుగుట యిట్టిలక్షణము లుండిన కఫప్రకృతివృశ్చిక మని తెలియవలెను.

### త్రిదోషవృశ్చికలక్షణము.

స్రావాద్యః సర్వలింగస్తు విపర్యైః సాన్నిపాతికైః. 6

త్రిదోషవృశ్చికమునకు వాతపిత్తకఫవృశ్చికముల లక్షణము లన్నియు కలిగి యుండును. ఈవృశ్చికదష్టుల [illegible]పవలెను.

### వృశ్చికభేదలక్షణము.

సర్పకోథాశ్చ సంభూతా మందమధ్యమహావిషాః,
మందాః పీతాః సితా శ్యావా రూక్షకర్బుర మేవ చ. 7

వృశ్చికములు మంద మధ్య మహావిషములు కలవిగ నుండును. పసుపువర్ణము కలవి మందవిషము కలిగి యుండును. తెలుపువర్ణము కలవి మధ్యవిషము లనఁబడును. నలుపువర్ణము గలవి మహావిషస్వభావము కలిగి యుండును. రూక్షత్వము చిత్రవర్ణము కలిగి యుండునవి అత్యంతవిషాధికవృశ్చికము లని తెలియవలెను.

### మధ్యవిషవృశ్చికలక్షణము.

[illegible]వర్ణా[illegible]హితాః పాండురోదరాః,
[illegible]వర్ణా[illegible] మధ్యాస్తు కపిలారుణాః. 8

[illegible]ష్టసశరీరవర్ణమును పొట్టక్రింద తెల్లనిరంగు [illegible]వర్ణము గాని కలిగి కొండికి అనేకగణుపులు కలిగి యుండినను నలుపు [illegible] గలు కలిగి మూఁడుగణుపులు గలకొండి కలిగి యుండినను మధ్యవిషవృశ్చిక[illegible]యవలయును.

### మహావిషాధికవృశ్చికలక్షణము.

పిశంగా శ్శబలా శ్చిత్రాః శోణితాభా మహావిషాః,
అగ్న్యాభా ద్వ్యేకపర్వాణో రక్తాః కేచి త్సితోదరాః. 9

పసుపురంగుగాని, చిత్రవర్ణము గాని, రక్తవర్ణముగాని కలిగి పొట్టక్రింద తెల్లనిరంగు గలిగి యొకగణుపు గలకొండిగలది అగ్నికి సమాన మైనమహావిషవృశ్చిక మని తెలియవలెను.

### వృశ్చికదష్టలక్షణము.

తై ర్దష్టః శూనరసనః స్తబ్ధగాత్రో జ్వరార్దితః,
ఖై ర్వమే చ్ఛోణితం కృష్ణ మింద్రియార్థా నసంవిదన్. 10
స్విద్యన్ మూర్ఛన్ విశుష్కాస్యో విహ్వలో వేదనాతురః,
విశీర్యమాణమాంసశ్చ ప్రాయశో విజహా త్యసూన్. 11

పూర్వోక్త మగువృశ్చికములచే దష్ట మైనవారికి నాలుక మొద్దుపాఱి శరీరము బిగియఁబట్టుకొని పోయి జ్వరము సంభవించి నల్లనిరక్తము గ్రక్కుచు పంచేంద్రియములశక్తు లుడిగి వివశత మూర్ఛ నోరు ద్రవము లేకుండ శుష్కించి దిక్కు తోఁపక విపరీత మైనవేదన కలిగి శరీరమందలి మాంసమంతయు నుడికి సడలి పోయి మరణము కలిగినను కలుగును.

అన్యత్.—

వృశ్చికస్య విషం యాతి దంశే పశ్చాత్తు తిష్ఠతి,
దష్టో సాధ్యస్తు దృగ్ ఘ్రాణరసనోపహతే నరః. 12
మాంసైః పతద్భి రత్యర్థం వేదనార్తో జహా త్యసూన్,
విసర్పః శ్వయథు శ్శూలో జ్వర శ్ఛర్ది రథాపి వా. 13

తేలువిషము కుట్టుటతోడనే పైకెక్కి పిమ్మట మరల కాటునందే వచ్చి చేరుచున్నది. అవిషోపద్రవమువలన కన్నులకు, ముక్కునకు, నాలుకకు, వానిసహజగుణములు పోయి విపరీతగుణములు కలిగి శరీరమందలిమాంస మంతయు సడలి యూడిపోవుచున్నటుల తోఁచుచు నిదమిత్థ మని తెలియని వేదనయు, శరీరమందు బొబ్బలు, వాపు, నొప్పి, వమనము, జ్వరము కలిగినట్టైన నామనుజుఁడు మృతిఁజెందును.

### వృశ్చికదష్టదూషీవిషలక్షణము.

గాత్రం రక్తం సితం కృష్ణం శ్యావం వా పిడకాన్వితం,
సకండూదాహవీసర్పపాకి స్యా త్తోదనం తథా. 4
కీటై ర్దూషీవిషై ర్దష్టే లింగం ప్రాణహరం స్మృతం,

సర్పదష్టే యథా శోఫే వర్ధతే సోగ్రగం ధ్యసృక్. 15
దంశో ఙ్గౌరవం మూర్ఛా సరుగార్తిః శ్వసి తృపి,
దంశస్య మధ్యే యత్కృష్ణం శ్యావం వా జాలకావృతం. 16
దగ్ధాకృతిర్భృశం పాకి క్లేదశోఫజ్వరాన్వితం,
తృష్ణారుచిపరీత శ్చభవే ద్దూషీవిషార్దితః. 17

దూషీవిష మనఁగా: విషజంతువువలన దష్టమై శరీరము కుళ్లుబట్టి చికిత్సల కన ర్హమై మరణము కలుగఁజేయుట కాయత్తమగునో దానికి దూషీవిష మని పేరు. (అనఁగా: శరీరమందలివిషము దుష్టమైనదని భావము) తేలు కుట్టినవానికి శరీరము రక్తవర్ణముగఁ గాని, తెల్లగఁగాని, నల్లగఁగాని, నీలవర్ణముగఁగాని మాఱి గ్రంధులు కలిగి నవి, దాహము, గుల్లలులేచుట, శరీరమాంసము పండుట, ఊడి పడునటు లుం డుట, సర్పదష్టునకువలెఁ గాయపుస్థలము వాచి నెత్తురు కాఱుచు దుర్గంధయుక్త మగుట, కన్నులు మొద్దుబాఱి బరువెక్కుట, మూర్ఛకలుగుట, దీర్ఘశ్వాసము, కుట్టి నచోట కాలినట్లు నల్లఁబడి పగుళ్లేర్పడుట, మాంసము పండి రాలిపోవుట, వాపు, ఈవ్వు, దాహము, జ్వరము కలుగుట ఈలక్షణములు సంభవించిన తేలువిషము శరీర మంతు దౌష్ట్యమును జెందిన దనియు నట్టిరోగి ప్రాణముల హరించు ననియు తెలియ వలెను.

## వృశ్చికవిషవేగలక్షణము.

వేగాశ్చ సర్పవ చ్ఛోఫో వర్ధిష్ణు ర్విస్రరక్తతా,
శిరోఽక్షిగౌరవం మూర్ఛా భ్రమశ్వాసోఽతి వేదనః 18
సర్వేషాం కర్ణికాశోఫో జ్వరః కండూ రరోచకః,

తేలు కుట్టినప్పుడు పాముకవిషమువలె నెక్కును. వాపు కలుగును. దుర్గంధ ముతో కూడినరక్తము స్రవించును. తలయందు కన్నులందు బరువు, మూర్ఛ, భ్రమ ము, శ్వాసము, నొప్పి, కాటునందు కదుములు కట్టుట, జ్వరము, దురద, అరుచి, మొదలైనవి కలుగును.

## వృశ్చికవిషప్రారంభలక్షణము.

వృశ్చికస్య విషం తీక్ష్ణ మాదౌ దహతి వహ్నివత్. 19
ఊర్ధ్వ మారోహతి క్షిప్రం దంశే పశ్చాత్తు తిష్ఠతి,
దంశ స్సద్యోఽతిరు క్శ్యావ స్తుద్యతే స్ఫుటతీవ చ. 20
తేగవా దిశకృతో త్రిధా ద్దిగదష్టాదికోధతః,
సర్పకోధాత్పసంభూతాః మందమధ్యమహావిషాః. 21

తేలువిషము తీక్ష్ణగుణము కల దగుటచే కుట్టినతోడనే నిప్పులోఁ గాల్చినటుల మండును. పిదప నూర్ధ్వముగ నెక్కి శరీరతాపమును పోటును కలుగఁజేసి పిమ్మట దిగఁజారి గాటులోనికివచ్చును. అనంతరము ఆకుట్టినచోట నూదులతోఁ గుచ్చినటులను పట్టుకార్లను పట్టి లాగినటులను పంజామండును ఇట్టివిషము గలతేళ్లు పేడ మొదలైన మురుగుడునందు జనించినవని తెలియవలెను.

## వాతవిషవృశ్చికలక్షణము.

హృత్పీడోర్ధ్వానిల స్తంభః సిరాయామోఽస్థిపర్వరుక్,
ఘూర్ణనోద్వేష్టనం గాత్రశ్యావతా వాతికే విషే. 22

వాతికవిషము గలతేలు కుట్టినపుడు, గుండెలో నొప్పి, శ్వాసము బంధించుట, బోలునరము లుబ్బుట, ఎముకలు, కీళ్లు కాలుసేతులవ్రేళ్లగణుపులు నొచ్చుట, ఒగర్పు, మెలియఁబెట్టినటుల శరీరమంతయు నొప్పి, దేహము నల్లఁబడుట, ఈలక్షణములు కలుగును.

## పిత్తవృశ్చికవిషలక్షణము.

సంజ్ఞానాశోష్ణ నిశ్వాసో హృద్దాహః కటుకాస్యతా,
మాంసావదరణంశోఫో రక్తపీతశ్చపైత్తికే. 23

పైత్తికవిషముగల తేలుకుట్టినపుడు స్మృతిని తప్పి నిశ్చేష్టితుఁడగుట, ఉష్ణశ్వాసమేర్పడుట, గుండెలో మంట, నోరు కారముగ నుండుట, చేదుగనుండుట, శరీరము చీల్చుచున్నటుల బాధగలుగుట, శరీర ముబ్బి పచ్చగగాని, యెఱ్ఱగగాని రంగు గలుగుట యీలక్షణములుండిన పిత్తవృశ్చికమని తెలియవలెను.

## శ్లేష్మవృశ్చికలక్షణము.

వమ్యరోచక హృల్లాస ప్రసేకోత్క్లేశ పీనసైః,
సశైత్య ముఖమాధుర్యం వింద్యాత్ శ్లేష్మాధికం విషమ్. 24

కఫకరవృశ్చికము కుట్టినపుడు వాంతి, రుచి తెలియకుండుట, హృదయమందు వేదనతోకూడిన వికారము, డోకు, నోట నీరూరుట, ముక్కు అడుచుకొనుట, శరీరము శీతలించుట, నోరు తియ్యగ నుండుట యీలక్షణములు కలుగును.

## వృశ్చికచికిత్సాపద్ధతి.

యస్య యస్యైన దోషస్య లింగాధిక్యం ప్రతర్కయేత్,
తస్య తస్యౌషధైః కుర్యా ద్విపరీతగుణైః క్రియాః. 25

వృశ్చికదష్టున కేదోషలక్షణము లెక్కువగ గానిపించుచుండునో వానిని చక్కఁగఁ గనిపించి ఆయాదోషశమనార్హము లగుచికిత్సలను జాగ్రతగఁ జేయుచుండవలెను.

→ వృశ్చిక, ఉచ్చిటింగ (మండ్రగబ్బ) చికిత్సాపద్ధతి. ←

విషేష్వపి చ సర్వేషు సర్వస్థానగతేషు చ,
ఆవృశ్చికోచ్చిటింగేషు ప్రాయశ్శీతో విధిర్హితః. 26
వృశ్చికే స్వేద మభ్యంగం ఘృతేన లవణేన చ,
సేకాం శ్చోష్ణాన్ ప్రయుంజీత భోజ్యం పానం చ సర్పిషః. 27
పత దేవోచ్చిటింగేఽపి ప్రతిలోమం చ పాంశుభిః,
ఉద్వర్తనం సుఖాంబూష్ణై స్తథా వాచ్ఛాదనం ఘనైః. 28
స్యా త్త్రిదోష ప్రకోపాద్వా తథా ధాతువిపర్యయాత్,
శిరోభితాపి లాలాస్రా వ్యథో నక్ర స్తథా భవేత్. 29
అన్యే ప్యేవంవిధా వ్యాలాః కఫవాతప్రకోపనాః,
హృచ్ఛిరోరుగ్జ్వర స్తంభ తృషామూర్ఛాకరా మతాః. 30
కండూనిస్తోద వైవర్ణ్యసుప్తి క్లేదోపదూషణం,
విదాహరాగరుక్పాకాః శోఫో గ్రంధి ర్నికుంజనమ్. 31
దంశావదరణం స్ఫోటాః కర్ణికామండలాని చ,
స్వరశ్చ సవిషో లింగం విపరీతం తు నిర్విషే. 32
తత్ర సర్వే యథావస్థం ప్రయోజ్యా స్స్యు రుపక్రమాః,
పూర్వోక్తం విధిమన్యం చ యథావ ద్బృహతీ శ్శృణు. 33
హృద్విదాహే ప్రసేకే వా విరేకే వమనం భృశం,
యథావస్థం ప్రయోక్తవ్యం శుద్ధే సంసర్జనక్రమః. 34
శిరోగతే విషే న స్త్యైః కుర్యా న్మూలాని బుద్ధిమాన్,
బంధుజీవశ్చ గార్గ్యాశ్చ సురసస్యాసితస్య చ. 35
రక్షకాకమయూరాణాం మాంసాసృజ్మ స్తకే క్షతే,
మూర్ధ్ని దేయ మధో దష్ట స్యోర్ధ్వదష్టస్య పాదయోః. 36

తేలు మొదలగు సర్వవిషములు శరీరావయవంబు లన్నింటియందును, వ్యాపించి యుండినపు డెల్లను, ప్రాయికముగ శీతోపచారముతే విహితమై యుండును. అందు ముఖ్యముగ తేలు గాని, మండ్రగబ్బ గాని కుట్టినపుడు ఘృతము, లవణము, వీనిచే నభ్యంగమును, ఉష్ణోదకస్నానమును, ఘృతపానమును చేయింపవలెను. ప్రతిలోమముగ నలుగుఁబెట్టి కొంచె ముష్ణముగ నుండునీరు ధారగ పోసి గాటుపైన ముతుకగుడ్డను గాని ఫ్లానల్ గుడ్డను గాని కప్పి యుంచవలెను. పాములవిషము తెక్కినపుడు త్రిదోషప్రకోపము, ధాతువిపర్యయము కలిగినచో శిరమునందు

తాపము, నోట చొంగ కారుట, తల త్రేలాడవేయుట, అను లక్షణములు కలుగును. మరికొన్ని పాములు కఱచినపుడు త్రిదోషములు ప్రకోపించి గుండెలు తల వీని యందు నొప్పి, జ్వరము, దేహము స్తంభించుట, దప్పి, మూర్ఛ, కురద, పోట్లు, నిద్దుర, గాయమైనచోటు మొద్దుబారి స్పర్శజ్ఞానము లేకుండుట, కాటునందు కుళ్లు పట్టుట, విదాహము, ఎఱుపు, పుండగుట, వాపు, గ్రంథులు కట్టుట, పంజాట, కఱచినస్థలమందు శరీరము పగుళ్లు పాఱుట, పొక్కులు, గాయమునందు పులిపిరులవంటి గ్రంథులు, మచ్చలు ఇట్టిలక్షణములు కలుగును. విషము దిగినవెనుక నివి యన్నియు తగ్గును. ఇట్టి విషములయందు నవస్థల ననుసరించి పైఁజెప్పినవిధమగుచికిత్సలనుగాని వేఱుచికిత్సలను గాని చేయందగును. హృద్విదాహము, నోట నీరూరుట, యివి కలిగినపుడు అవస్థానుసారముగ విరేకమును గాని, వమనమును గాని చేయింపవలెను. శోధనానంతరము సంసర్జనక్రమము (శుద్ధిస్యానంతరవిధి) నాచరింపవలెను. విషము శిరస్సు కెక్కినట్లైన దాసాని గార్గి యను నోషధి, కృష్ణతులసి, వీనివేళ్లను నూఱి నస్యముఁ జేయింపవలెను. అధోకాయమునందు దష్టమైనచో ఊర్ధ్వాంగము (అనఁగా: తలయందును), పైభాగమునందు దష్టమైనచో పాదములందును కత్తితో గీచి గాయము చేసి అందులో కాకి, గద్ద, నెమలి, అనువానిమాంసములను రక్తమును వేసి కాటు గక్తములో కలిసి పోవునటుల రాచుటయు నౌషధముల నుపయోగించుటయు నాచరింపవలయును.

### త్రిదోషవిషహారణచికిత్సాపద్ధతి.

పిణ్యాకేన వ్రణాలేప స్తైలాభ్యంగశ్చ వాతికే,
స్వేదో నాడీపులాకాద్యై ర్బృంహణశ్చ విధి ర్హితః. 37
పైత్తికం స్తంభయే త్సేకైః ప్రదేహై శ్చాతి శీతలైః,
లేఖనస్వేదనచ్ఛేద వమనైః శ్లేష్మికం జయేత్. 38

వాతికవృశ్చికవిష మెక్కినపుడు వ్రణమునందు నువ్వులపిండిని (అనఁగా: గానుగపిండిని) నూఱి పట్టించుట, తైలాభ్యంగము, పులాకాదులచే నాడీస్వేదము, బృంహణము, చేయఁదగును. పైత్తికవిషమునందు మిగుల శీతలమగుజలముచే స్నానము చేయింపవలయును. శ్లేష్మికవిషమునందు లేఖనము, భేదనము, స్వేదము, వమనము, వీనిచే చికిత్స చేయవలెను.

అన్యత్.—

కీటానాం త్రిప్రకారాణాం త్రైవిధ్యేన ప్రతిక్రియా,
స్వేదాలేపనసేకాంస్తు కోష్ణా న్ప్రాయోఽపచారయేత్. 39

అన్యత్ర మూర్ఛితా ద్దంశపాకతః క్రోధతో౽థవా,
వాతిక పైత్తిక శ్లేష్మికము లగుత్రివిధకీటములు కఱచినపుడు క్రమముగ, ఆలేపనము, సేకము, స్వేదము చేయందగును.

—— అక్షిగతవిషచికిత్స ——

పిప్పలీ మరిచక్షార వచాసైంధవశిగ్రుకాః. 40
పిష్ట్వా రోహితపిత్తేన ఘ్నంత్యక్షిగతమంజనాత్,
పిప్పళ్లు, మిర్యాలు, యవక్షారము, వస, సైంధలవణము, మునగచెక్క, వీనిని ఎఱ్ఱగోలచేపపిత్తముచే నూఱి అంజనము వేసిన కన్నులకు వ్యాపించిన విషము శాంతించును.

—— కంఠగతవిషచికిత్సా. ——

విషే కంఠగతే మాంసం కాపిత్థం ససితా మధు. 41
విషము కంఠగతమై గద్గదస్వరము కలిగినపుడు వెలగపండుగుజ్జులో చక్కెర తేనె కలిపి త్రాగింపవలెను.

—— ఆమాశయగతవిషచికిత్స. ——

ఆమాశయగతే లిహ్యా తాభ్యాం చూర్ణపలం నరః,
విషే పక్వాశయప్రాప్తే పిప్పలీ రజనీద్వయమ్. 42
మంజిష్ఠా చ సమం పిష్ట్వా గోపిత్తేన నరః పిబేత్,
విషమామాశయగతమైనపుడు పూర్వోక్తములగునోషధుల, తేనె, నెయ్యిలో కలిపి త్రాగింపవలెను. పక్వాశయమును జెందినచో పిప్పళ్లు, పసుపు, మ్రానిపసుపు, వెలగపేరుకపాయము లేక ఆకుస్వరసమునందు పైచూర్ణములో గోరోచనము కలిపి సేవింపవలెను.

—— రసగతవిషచికిత్స. ——

మాంసం రక్తం చ గోధాయాః శుష్కం చూర్ణీకృతం హితమ్. 43
విషే రసగతే పానం కాపిత్థరససంయుతం,
విషము రసగతమైనపుడు వెలగపండుగుజ్జులో ఎండించినయుడుము రక్తము, మాంసచూర్ణమును కల్పి త్రాగిన శాంతించును.

—— మాంసగత రక్తగతవిషచికిత్స. ——

శేలుమూలత్వగగ్రాణి వాదరౌదుంబరాణి చ. 44
కటభ్యాశ్చ పిబే ద్రక్తగతే మాంసగతే పిబేత్,
సక్షౌద్రం ఖదిరారిష్టం కోలజం మూలి కుంభసా 45

విషము రక్తము నాశ్రయించినచో విరిగి, మాల్కాంగిణి, రేగు, అత్తి, వీని వేళ్లను, పట్టను, చిగుళ్లను, జాంగలికుని మేధాశక్తి ననుసరించి తేనెతో సేవింపం జేయవలెను. విషము మాంసగతమాయెనేని చంద్ర, వేప, రేగు, వీనివేళ్లను తేనెతో నూతి సేవింపవలెను.

### విషప్రతిసారణచికిత్సా.

సర్వేషు చ బలే ద్వే తు మధూకం మధుకం నతం,
పిప్పలీం నాగరం క్షారం నవనీతేన మూర్ఛితమ్. 46
కఫే భిషగుదీర్ణే తు విదధ్యా త్ప్రతిసారణం,
చందనం తగరం కుష్ఠం హరిద్రే ద్వే త్వగేవ చ. 47
మనశ్శిలా తమాలశ్చ రసః కేసర యేవ చ,
శార్దూలస్య నఖ శ్చైవ సుపిష్టం తండులాంబునా. 48
హంతి సర్వవిషా ణ్యేవ వజ్రివజ్ర మి వాసురాన్,

సమస్తవిషములందు మూర్ఛంజెందినపుడును, కఫము ప్రకోపించినపుడును, చినముత్తవపులగము, పెదముత్తవపులగము, ఇప్ప, అతిమధురము, గ్రంధితగరము, పిప్పళ్లు, సొంటి, యవక్షారము, వీనిని వెన్నతో ప్రతిసారణము చేయవలెను. మఱియు చందనము, గ్రంధితగరము, కోష్టు, పసుపు, మ్రానిపసుపు, లవంగపట్ట, మణిశిల, నాగకేసరములు, వ్యాఘ్రినఖము, వీనిని చూర్ణించి బియ్యపుకడుగులో కలిపి అందు కొనగచెక్కరసమును గలిపి త్రాగించిన రాక్షసులను వజ్రాయుధమువలె విషనాశనము చేయును.

### ధూపచికిత్స.

స్నుకేశాః సర్షపాః పీతాః గుడో జీర్ణశ్చ ధూపనమ్. 49
విషదంశస్య సర్వస్య కాశ్యపః పరమౌషధం,

నరునివెండ్రుకలు, పచ్చావాలు, పాతబెల్లము, ధూపము వేసిన అన్నివిషములు శమించును.

**అన్యత్ చికిత్స.—**

విషఘ్నం చ విధిం సర్వం కుర్యా త్సంశోధనాని చ. 50
సాధయేత్ సర్పవ ద్దష్టాన్ విషోగ్రైః కీటవృశ్చికైః,

పాములు కఱచినపుడు చేయుక్రియలనే తేలు మొదలయిన విషజంతువులు కఱచినపుడును శోధనాదిచికిత్సలెల్లను జేయవలెను.

**1 వ వృశ్చికవిషచికిత్స.—**

శిరీషపుష్ప త్వగాలేపః శుద్ధకీటవిషాపహః. 51

ముక్తాలేపో వర శ్లేష్మః దాహతోదజ్వరాపహః,

పిన్నయిప్పపట్టను నూతి పట్టించిన వాపు, మంట, పంజాటు, జ్వరము, దాహము, మొదలైన వృశ్చికవిషగుణములు హరించును.

2 వ చికిత్స.—

తండులీయకతుల్యాంశాం త్రివృతం సర్పిషాపిబేత్. 52
యాతి కీటవిషైః కంపం న కైలాస ఇ వానిలైః,

చిట్టివేళ్లు, తెల్లతెగడ తేనెతో నూతి త్రాగినచో నెట్టి వృశ్చికవిషమైనను గైలాసమును వాయువువోలె మనుష్యుని జలింపఁ జేయలేదు.

3 వ చికిత్స:—

వచాహింగువిడంగాని సైంధవం గజపిప్పలీ. 53
పాఠా ప్రతివిషా వ్యోషం కాశ్యపేన వినిర్మితం,

వస, ఇంగువ, విడంగాలు, సైంధలవణము, గజపిప్పళ్లు, విషబొద్ది, అతివస, త్రికటుకములు ఇవి చూర్ణించి, శుద్ధోదకములో కల్పి త్రాగిన వృశ్చికవిషము హరించును.

4 వ చికిత్స.—

దశాంగ మగదం పీత్వా సర్వకీటవిషం జయేత్. 54
సద్యో వృశ్చికజం దంశం చక్రతైలేన సేచయేత్,
బిదారిగంధసిద్ధేన కవోష్ణే ణేతరేణ వా. 55
లవణోత్తమయుక్తేన సర్పిషా వా పునః పునః,
సించేత్కోష్ఠారనాళేన సక్షీరలవణేన వా. 56
ఉపనాహో ఘృతే భృష్టః కల్కోజాజ్యా ససైంధవః,
ఆదంశం స్వేదితం చూర్ణైః ప్రచ్ఛాయ ప్రతిసారయేత్. 57

దశాంగ మని చెప్పంబడు ధూపచూర్ణము నుదకములో త్రాగిన సర్వకీటవిషములు హరించును. అయిద్దాయినూనె, (అనఁగా: గానుగలో నుంచి తీయఁబడక, గానుకయుండే యుండినూనె దీనినే కఁచంనూనె యనియు నందురు.) తో సేచనము చేసిన వృశ్చికవిషము హరించును. నేలగుమ్ముడుగడ్డ గంధములో సైంధలవణము చేర్చి కొంచె ముడికించి నెయ్యి కలిపి సేవించి, పిమ్మట కోష్టు, సైంధలవణము, పాలు, కలి, యివి నూతి నేతిలో కల్పి యుడికించినది గాని, జిలకఱ సైంధలవణము కల్కము చేసి కాని గాయమందు పట్టించి ఫ్లానల్ గుడ్డ కప్పి చెమటను పట్టించిన తేలువిషము హరించును.

5 వ చికిత్స.—

రజనీసైంధవవ్యోష శిరీష ఫలపుష్పకైః,
మాతులుంగ్రమ్రగోమూత్రపిష్టం చ సురసాగ్రజమ్. 58
లేప స్సుఖోష్ణ శ్చ హితః పిణ్యాకో గోమయోఽపి వా,
పానే సర్పిర్మధుయుతం క్షీరం వా భూరిశర్కరా. 59

పసువు, సైంధవలవణము త్రికటుకములు, గిరిసెనపుకాయ, పువ్వులు, మాదీఫలము, మామిడిచెక్క, తులసిఆకురసముతో నూరి పట్టించినను, తేనెమైనము, ఆవుపేడ, వీనిలో నెయ్యి, తేనె, పాలు కల్పి కాచి అందు చక్కెరకల్పి పుచ్చుకొనినను తేలుకుట్టినబాధ తొలఁగును.

6 వ చికిత్స.—

పారావతశకృత్పథ్యా తగరం విశ్వభేషజం,
బీజపూరరసోన్మిశ్రః పరమో వృశ్చికాగదః. 60

పావురపుమలము, కరకకాయ, గ్రంథితగరము సొంటి ఇవి చూర్ణించి మాదీఫలరసముతో కలిపి త్రాగిన తేలు కుట్టినబాధ తొలఁగును.

7 వ చికిత్స.—

సశైవలోష్ఠ్రదంష్ట్రా చ హంతి వృశ్చికజం విషం,
హింగునోహరితాలేన మాతులుంగరసేన చ. 61
లేపాంజనాభ్యాం గుటికాపరమం వృశ్చికాపహం,

సిల్లమీఁదిపాచి, ఒంటెపల్లు గాని, ఇంగువ, తాళకము గాని మాదీఫలరసముతో నూరి పట్టించినను, కన్నుల కంజనము చేసినను తేలుబాధ నెమ్మదించును.

8 వ చికిత్స.—

కరంజార్జునశైలూషాం కటభ్యాం కుటజస్య చ. 62
శిరీషస్య చ పుష్పాణి మస్తునా దంశలేపనం,
యో ముహ్యతి ప్రశ్వసితి ప్రలప త్యుగ్రవేదనః. 63

కానుగచెక్క, మద్దిచెక్క, మారేడుచెక్క, ఒక్కింగిణిచెక్క, కొడిశచెక్క, దిరిసెనపుపువ్వులు వీనిని పెరుఁగుమీఁదినీటితో నూరి పట్టించిన తేలుకుట్టుటవల్ల కలిగిన అయాసము, అరాటము మొదలైనబాధలు తొలఁగును.

9 వ చికిత్స.—

తస్య పథ్యా నిశా కృష్ణా మంజిష్ఠాతివిషామణం,
సాలాంబుపృత్తవార్తాకరసపిష్టం ప్రలేపనమ్. 64

సర్వత్ర జోగ్రాళివిషే పాయయే ద్దధి సర్పిషీ,

కరకకాయ, పసుపు, పిప్పళ్లు, మంజిష్టి, అతివస, మిర్యాలు, వంగకేశ, ఏపి శొక్క యివి నీళ్లతో నూతి పట్టించినను నేతిలోఁ గాని పెరుఁగులోఁ గాని కలిపి త్రాగినను తేలువిషబాధ నెమ్మదించును.

10 వ చికిత్స.—

విధ్యేచ్చిరాం విదధ్యాచ్చ వమనాంజననావనమ్. 65
ఉష్ణస్నిగ్ధామ్లమధురం భోజనం చానిలాపహం,

కుట్టినచోట కత్తితో గీచి రక్తము స్రవింపఁజేసి వమనము జేయించి కన్నులకు అంజనము వేసి యుష్ణముగా నున్న మృదువైనఆహారము పులుసు, తీపు చేర్చి యిచ్చిన తేలుకుట్టుటవల్ల కలిగినవాయువు హరించును.

11 వ చికిత్స.—

నాగరం గృహకపోతపురీషం బీజపూరకరసో హరితాలం. 66
సైంధవం చ వినిహంత్యగదోఽయం లేపతోఽళికులజంవిషమాశు,

సొంటి, సాకుడు పావురాయి పెంట, తాళకము, సైంధవలవణము, ఇవి మాదీఫలరసముతో నూతి పట్టించిన తేలుఁగుట్టినబాధ నశించును.

12 వ చికిత్స:—

అంతే వృశ్చికదష్టానాం సముదీర్ణే భృశం విషే. 67
విషేణాలేపయే ద్దంశ ముచ్చిటింగేఽప్యయం విధిః,

తేలుకుట్టినగాయమునకుఁ గాని మండ్రగబ్బకుట్టినగాయమునకుఁ గాని నాభి చాది పట్టించిన విషము దిగిపోవును.

13 వ చికిత్స.—

నాగపురీషచ్ఛత్రం రోహిషమూలం చ శేలుతోయేన. 68
కుర్యాద్గుటికాం లేపా దియ మళివిషనాశనీ శ్రేష్ఠా,

పుట్టకొక్కు కామంచిపూరివేళు, వీనిని విరిగిచెట్టుపట్టరసముతో నూతి మాత్ర చేసి అరఁ బెట్టి చాది పట్టించిన తేలువిషము దిగి పోవును.

14 వ చికిత్స.—

అర్కస్య దుగ్ధేన శిరీషబీజం త్రిర్భావితం పిప్పలిచూర్ణమిశ్రం. 69
ఏషో గదో హంతి విషాణి కీటభుజంగలూతోందురువృశ్చికానాం,

జిల్లేడుపాలలో దిరిసెనపువిత్తులచూర్ణము, పిప్పలీచూర్ణము వేసి మూఁడుభావనలు చేసి యుపయోగించిన, తేలు, పాము, (లూత) సాలెపురుగు, ఎలుక, ఈ విషకీటకములవిషము నివర్తించును.

15 వ చికిత్స.—

శిరీషపుష్పం నకరంజబీజం కాశ్మీరజం కుష్ఠమనశ్శిలే చ. 70
ఏషోఽగదో రాత్రికవృశ్చికానాం సంక్రాంతకారీ కథితోఽంజనేన,

దిరిసెనపుష్పాలు, క్రానుగవిత్తులు, కుంకుమపువ్వు, కోష్టు, మణిశిల, యివి యుదకముతో నూఱి పట్టించినను అంజనము వేసినను తేలువిషము మండ్రగబ్బ విషము హరించును.

16 వ చికిత్స.—

కాకజంఘీయుమూలం చాప్యారనాళేన పేషయేత్. 71
పానాద్వా లేపనాచ్చైవ విషం వృశ్చికజం హరేత్,

వెలమసంధివేరును కలితో నూఱి త్రాగినను, లేక కలితో గంధము చాది తేలు కుట్టినచోట పట్టు వేసినను తత్క్షణమే వృశ్చికవిషము హరించును.

17 వ చికిత్స.—

తలపోటజటాం చారనాళేన సహ భక్షయేత్. 72
శమయే ద్రక్తవమనం వృశ్చిదష్టోత్సముద్భవం,

తంగేడుకొనలరసమును స్వచ్ఛముగాఁ గాని, కలిలోఁ గల్పుకొని కాని పానము చేసిన తేలుకుట్టినందువల్ల కలిగిన రక్తవమనము హరించును.

18 వ చికిత్స.—

బాణపుంఖరసో పీతో మేఘనాదరస స్తథా. 73
శర్కరాసహితం పానం విషం వృశ్చికజం హరేత్,

వెంపలివేరురసములోఁ గాని, చిత్తివేరురసములోఁ గాని, చక్కెర గలుపుకొని త్రాగిన తత్క్షణమే వృశ్చికవిషము హరించును.

19 వ చికిత్స.—

వంధ్యాకర్కోటకీకందం జలైః పిష్ట్వా పిబే ల్లిపేత్. 74
సర్పమూషక మార్జారవృశ్చికాది విషాపహం,

గొడ్డుబోగాకరగడ్డ నుదకముతో నూఱి త్రాగినను, పటు వేసినను, సర్ప వృశ్చిక మూషక మార్జారవిషములు హరించును.

20 వ చికిత్స.—

తోయైర్వా నాగరం నస్యం పిబే ద్వా సైంధవం ఘృతమ్. 75
అర్కదుత్తూరమూలం వా జలపానే విషాపహం,

ఉదకములో చాదినశొంఠిగంధమును నస్యము చేసినను, గోఘృతమందు

సైంధలవణము కలిపి త్రాగినను, జిల్లేడువేరు, ఉష్త్రివేరు నుదకముతో నూరి త్రాగినను వృశ్చికవిషము హరించును.

21 వ చికిత్స.—

హింగు శ్చార్కపయోఘృష్టో దేయోపరి చ దాపయేత్. 76
వృశ్చికస్య విషం హంతి రజనీం ద్యుపతి ర్యథా,

ఇంగువను జిల్లేడుపాలతో చాది పట్టించిన సూర్యునిగనినచీకటివలె వృశ్చిక విషము తత్క్షణమే నశించును.

22 వ చికిత్స.—

హింగుర్వా జలలేపేన విషహా వృశ్చికస్య తు. 77
ధుత్తూరార్కజలో లేపో నిహంతి వృశ్చికంవిషం,

ఇంగువ నుదకముతో చాది లేపనము చేసినను, ఉష్త్రిత్తికొనలు నూరి పట్టించినను వృశ్చికవిషము హరించును.

23 వ చికిత్స —

శ్వేతం పునర్నవామూలం రవివారే సముద్ధరేత్. 78
కార్పాసమూలం చర్విత్వా విషం వృశ్చికజం హరేత్,

ఆదివారమునాఁడు ధూపదీపాదు లిచ్చి సంగ్రహించిన తెల్లగలిజేరు వేరును, ప్రత్తివేరు నుదకముతో గంధము తీసి పట్టించిన వృశ్చికవిషము హరించును.

24 వ చికిత్స.—

పుత్రజీవఫలాన్మజ్జాం పలాశోత్థాం కరంజజామ్. 79
మజ్జాం తోయైః ప్రలేపోఽయం హంతి వృశ్చికజం విషం,

పుత్రజీవిఫలములగుజ్జును, మోదుగఫలములగుజ్జును, కానుగకాయలగుజ్జును ఉదకముతో చాది పట్టించిన వృశ్చికవిషము హరించును.

25 వ చికిత్స.—

సిక్థకం సప్తధా భావ్యం స్నుహ్యార్కపయసాఽతపే. 80
తత్తప్తం వహ్నినా స్పృష్టం దంశస్థానే విషం హరేత్,

తేనెమైనమును జెముడుపాలతో నేడుమారులు జిల్లేడుపాలతో నేడుమారులు భావనఁ జేసి యెండించి యుంచుకొని యీమైనమును తేలుకుట్టినచోట నిప్పుసెగను కరిగించి పట్టించిన వృశ్చికవిషము హరించును.

26 వ చికిత్స.—

ఘృతార్కదుగ్ధలేపేన యష్ట్యా వా ధూపితేన వా. 81

బీజపూరకమూలేన లేపో ద్వాపి హరీతకీ,
లేపో జాతిగుడాభ్యాం వా హారిద్రాలేపనేన వా. 82
వృశ్చికస్య విషం హంతి ప్రత్యేకేన న సంశయః,

పాతఆవునెయ్యి, జిల్లేడుపాలు మర్దించి లేపనము చేసినను, అతిమధురచూర్ణము ధూపము వేసినను, మాదీఫలమువేరు, కరక్కాయ గంధము తీసి పట్టించినను, జాజివేరు బెల్లము నూరి పట్టించినను పచ్చిపసుపుకొమ్ము చాది పట్టించినను తేలు విషము హరించును.

27 వ చికిత్స.—

జీరకస్య కృతః కల్కో ఘృతసైంధవసంయుతః. 83
సుఖోష్ణా మధునా లేపో వృశ్చికస్య విషం హరేత్,

జీలకఱ్ఱకల్కములో నెయ్యి సైంధవలవణము కల్పి తేనెతో మర్దించి పట్టించిన వృశ్చికవిషము శాంతించును.

28 వ చికిత్స.—

భ్రష్టమాయూరతుండస్య చూర్ణం క్షిప్త్వాఽథ దంశకే. 84
జలే నార్ద్రీకృతం సద్యః వృశ్చికస్య విషం హరేత్,

నిప్పుసెగను పేల్చిన మైలుతుత్తము చూర్ణమును, తేలుకుట్టిన గాయముపై వైచి యొకనీటిబిందువు దానిపై విడిచిన తత్క్షణమే వృశ్చికవిషము హరించును.

29 వ చికిత్స —

సన్యాగ్నిమర్దితం సద్యః మాక్షికే నావలం సుధా. 85
తేన లిప్తేన శాంతి స్స్యాత్ వృశ్చికస్య విషం పరం,

నీరు చక్కగా పిడిచినరాతిసున్నము తేనెతో చాది పట్టించిన వృశ్చికవిషము తత్క్షణమే హరించును.

30 వ చికిత్స —

జలేన లేపయే ద్గంధ మగ్నికాష్ఠస్య భాస్వరం. 86
వృశ్చికస్య విషం హంతి శూకకీటవిషం సహ,

అగ్గిపుల్లయందుండు ఫాస్పరస్ అనుమందు తీసి యుదకముతో చాది పట్టించిన వృశ్చికవిషము మండ్రగబ్బవిషము హరించును.

31 వ చికిత్స.—

గంధ మాఘ్రాయ మృదితం సూర్యావర్తదలస్య తం. 87
వృశ్చికేన నరో విద్ధః క్షణా ద్భవతి నిర్విషః,

మూర్వావర్తపుఆకును మృదువుగ చూర్ణించి నస్యము చేసిన వృశ్చికవిషము తత్క్షణమే హరించును.

32 వ చికిత్స.—

రంజనీచూర్ణధూపేన విషం వృశ్చికజం హరేత్. 88
వస్త్రేణాసాధ్య మాసాధ్య ధూప ధూమం చ పాయయేత్,
దంశే చ ధూపయే త్తూర్ణం సర్వధూపే ష్వయం విధిః. 89

నీలియాకుచూర్ణమును ధూపము వేసి, ధూపధూమమును పానము సేయవలయును. అట్లు పానము చేయుట శక్యము కాకున్న నేని వస్త్రమును అడ్డముగా నుంచియైనను పానంబొనర్చుటయే కాక, కుట్టినచోట సైతము పొగ వేయవలెను. తేలు విషము హరించును. ధూప మని చెప్పినచోట నంతయు నిదే విధముగ జరిగింపవలెను.

33 వ చికిత్స —

శిరీషబీజం గోమేదం దాడిమస్య చ మూలకం,
అర్కక్షీరయుతంహంతి ధూపో వృశ్చికజం విషమ్. 90

దిరిసెనపుగింజలు, పసుపు, దానిమ్మవేరు, జిల్లేడుపాలతో నూరి యుంచిన యౌషధమును తేలుకుట్టినచోట ధూపము వేసిన విషము హరించును.

34 వ చికిత్స.—

మయూరపారావతకుక్కుటానాం
గ్రాహ్యం పురీషం సహ భానుమూలైః,
ధూపో నిహం త్యాశు విషం సమస్తం
చతుర్విధం వృశ్చికసర్పజాతమ్. 91

నెమలిమలము, పావురపుమలము, కోడిమలము, జిల్లేడువేరు, వీనిని సమభాగములుగ చూర్ణించి సీసాకు వేసియుంచుకొని వలసినప్పుడు తేలుకుట్టినగాయమునకు ధూపము వేసిన తత్క్షణమే విషము హరించును.

35 వ చికిత్స.—

రజనీచూర్ణధూపేన విషం వృశ్చికజం హరేత్,
వస్త్రేణాచ్ఛాద్యతే గాత్రం ధూపధూమం చ పాయయేత్. 92
దంశం చ ధూపయే చ్ఛీఘ్రం సర్వధూపే ష్వయం విధిః,

పసుపుచూర్ణమును, నిప్పుమీఁదవేసి దానిపొగ శరీర మాపాదమస్తకమునకు తగిలి చెమటపట్టునట్టు దుప్పటి కప్పుకొని ఆపొగను కొంతితడవు మ్రింగవలసినది. తేలుకట్టినగాయమునకు నాపొగను చక్కఁగా చేయవలసినది. ఇటుల చేసిన వృశ్చిక

విషము అతిశీఘ్రములో నివారించును. ధూమపాన మని చెప్పినచోట నంతయు నిదే విధముగ జరిగింపవలయును.

36 వ చికిత్స.—

ధారయే ద్దక్షిణే కర్ణే వృశ్చికానాం భయం న హి. 93
గృహీత్వా శుభనక్షత్రే అపామార్గస్య మూలకం,

శుభనక్షత్రమందు సంగ్రహింపఁబడిన యుత్తరేణివేరును కుడిచెవియందు ధరించి యుండిన నెప్పుడును వృశ్చికభయ ముండ నేరదు.

37 వ చికిత్స.—

కార్పాసమూలం చర్విత్వా విషజి త్కర్ణపూత్కృతే. 94

ప్రత్తివేరును నమలి తేలుకుట్టిన వానిచెవియం దూదిన వృశ్చికవిషము హరించును.

38 వ చికిత్స.—

గ్రాహ్యం హంసపదీమూలం ప్రాత రాదిత్యవాసరే,
ముఖస్థం ఫూత్కృతే కర్ణే విషం వృశ్చికజం హరేత్. 95

ఆదివారమునాఁ డుదయమునఁ బెల్లగించిన హంసపాదిచెట్టువేరును నమిలి తేలుకుట్టినవారిచెవిలో నూదిన విషము దిగిపోవును.

39 వ చికిత్స.—

మాతులుంగస్య మూలం తు రవివారే సముద్ధరేత్,
ఉత్తరాభిముఖో నైవం క్రూం మంత్రోచ్చారణాత్ స్పృశేత్. 96
వామాంగే దక్షిణే దష్టో వామదష్టే చ దక్షిణే,
మార్జనేన విషం హన్యాత్ సదంశం దృష్టప్రత్యయం. 97
సప్తధా మార్జనే నైవ విషం వృశ్చికజం హరేత్,

ఆదివారమునాఁ డుత్తరాభిముఖుఁడై (క్రూం) అనుబీజాక్షరము నుచ్చరించుచు మాదీఫలపువేరు నున్మూలించి తెచ్చి యుంచుకొని తేలుకుట్టినవారికి ఎడమవైపున కుట్టిన కుడిపార్శ్వమునను, కుడివైపున కుట్టిన ఎడమపార్శ్వమునను ఏడేసిమార్లు పైనుండి క్రిందికి నీళ్లలో ముంచి దిగతుడిచిన వృశ్చికవిషము హరించును.

40 వ చికిత్స.—

వకులత్వచబీజం వా సిప్త్వాద్యం దంశనస్థలే,
ప్రలేపా ద్వృశ్చికవిషహరణం చాభిమంత్రితా. 98

పొగడచెక్కను గాని విత్తులను గాని నూటి స్వరసమును తీసి తేలుకుట్టిన

చోట(ఓం-ఝుం-హుం-యుం-క్రిం-బ్రం-వం-వం-లం-క్షం-ఏం-ఐం-ఓం-ఔం-హం-హః. అనునీమంత్రంబున నభిమంత్రించి లేపనమును జేసినట్టయిన వృశ్చికవిషము నిశ్చయముగ తత్క్షణమే హరించును.

41 వ చికిత్స.—

హాం-హీం-మం-చం-ఓం-ఇతిమంత్రేణ ఓలవృంత మభిమంత్ర్య. తేనమార్జనాత్ వృశ్చికవిషనాశో భవతి.

ఈమంత్రముచే దిరిసెనపుతొడిమ నీళ్లలో ముంచి యుదకమును ప్రోక్షించిన తేలువిషము హరించును.

42 వ చికిత్స.—

ఓం-క్షః-ఫట్-స్వాహా.

ఈమంత్రంబున నేడుమారు లుదకము నభిమంత్రించి తేలుకుట్టినచోట నేడుమార్లు చల్లినట్టయిన విషశాంతి యగును.

43 వ చికిత్స.—

శాంఖో-మాంఖో-మాం-హీం-ఖోం-హీం.

అనునీమంత్రముచేత నభిమంత్రించుచు గన్నేరకఱ్ఱ నుదకమందు ముంచి తేలుకుట్టినచోట స్పృశించవలయును. యిట్ల నేడుమారు లభిమంత్రించిన విషము నివృత్తించును.

వృశ్చికవిషచికిత్స ముగిసినది.

---

ఉచ్చిటింగ (మండ్రగబ్బ)చికిత్సా.

మండ్రగబ్బకు బర్యాయనామములు.

ఉష్ట్రధూమ స్స ఏవోక్తో రాత్రిచార శ్చ రాత్రికః,
ఉచ్చిటింగో బృహత్కీటో రోమాంగీకృష్ణవర్ణినీ. 99

ఉష్ట్రధూమము, రాత్రిచారము, రాత్రికము, ఉచ్చిటింగము,బృహత్కీటము, రోమాంగి, కృష్ణవర్ణిని అనునవి మండ్రగబ్బపేళ్లు.

ఉచ్చిటింగదష్టలక్షణము.

ఉచ్చిటింగస్తు వక్త్రేణ దశ త్యభ్యధికవ్యథా,
సాధ్యాతో వృశ్చికా స్తంభం శేఫసో హృష్టరోమతామ్. 100
కరోతి సేక మంగానాం దంశ శ్శీతాంబు సేవ చ,

మండ్రగబ్బ నోటితో కఱచును. మిగుల వేదన కలుగును. తేలుకుట్టినప్పటి విషముకన్నను లింగము స్తబ్ధమగును. గగుర్పాటు కలుగును. శరీరమును శీతోదకముతో తడిపినటుల చల్లగ నుండును. ఇట్టి లక్షణములు మండ్రగబ్బ కఱచినపుడు కలుగును.

అన్యత్.—

హృష్టరోమోచ్చిటింగేన స్తబ్ధలింగోభృశార్తిమాన్. 101
దష్టశ్శీతోదకే నేవ సిక్తాన్యంగాని మన్యతే,

మండ్రగబ్బచే దష్టమైనవానికి శరీరమందలి రోమములు నిక్కపొడుచుకొనును. లింగము స్తబ్ధమగును. విశేషమైనమంట గాయమందు కలుగును. శరీరము చల్లగ నుండును.

1 వ చికిత్స.—

అంతే వృశ్చికదష్టానాం సముదీర్ణే భృశం విషే. 102
విషేణాలేపయే ద్దంశ ముచ్చిటింగే వ్యయం విధిః,

తేళ్లు కుట్టినపుడే చికిత్సలకు తగ్గక విషాధిక్యమైనయెడల వత్సనాభమును చాది పట్టింపవలయును. ఉచ్చిటింగదష్టమునకు సైత మదేవిధముగఁ జేయవలెను.

2 వ చికిత్స.—

శిరీషస్య చ మూలేన అథవా స్వరసేన వా. 103
జలే నాలేపనం కుర్యాత్ ఉచ్చిటింగవిషం హరేత్,

దిరిసెనపువేరు గంధమును గాని స్వరసమును గాని గాయమునకు పట్టించిన మండ్రగబ్బవిషము హరించును.

3 వ చికిత్స.—

శ్వేతం పునర్నవామూలం పారిభద్రస్య మూలకం. 104
తండులీయకమూలం చ గోధికాపసయాసహా,
అర్కక్షీరేణ సమ్మర్ద్య వటుకాం కారయేద్భిషక్. 105
హారిణా లేపనం కుర్యా దుచ్చిటింగవిషాపహం,

తెల్లగలిజేరువేరు, ముడుఁరు వేపవేరు, చిట్టివేరు, ఉడుము క్రొవ్వు, సమభాగములు కూర్చి జిల్లేడుపాలతో నూఱి కణికలు చేసి అరఁబెట్టి మండ్రగబ్బ, తేలు, కుట్టినపుడు చాది గాయమందు పట్టించిన విషము హరించును.

4 వ చికిత్స.—

శ్వేతార్కమూలం సంగ్రాహ్యం తద్దుగ్ధేన విమర్దితమ్. 106

వటిం తోర్వాయె ర్వ లేపోఽయం శమయేదుచ్చిటింగజం,

తెల్లజిల్లేడువేరును దానిపాలతోనే నూరి కణికలు చేసి యెండవేసుకొని చాది పట్టించిన నుచ్చిటింగవిషము హరించును.

5 వ చికిత్స.—

పుత్రజీవిఫలానాం చ విషతిందుఫలోద్భవమ్. 107

మజ్జాం సమ్మేళయే ల్లేపా దుచ్చిటింగవిషం జయేత్,

పుత్రజీవిఫలములగుజ్జు, ముష్టిపండ్లగుజ్జు కలిపి పట్టించిన మండ్రగబ్బవిషము హరించును.

6 వ చికిత్స —

సర్పాక్షీమూలం సంగ్రాహ్యం తినిశస్వరసం పిబేత్. 108

ఉచ్చిటింగవిషం హంతి పటీరేణ చ తత్ఫలం,

సర్పాక్షీవృక్షపువేరు, నెమ్మిపట్ట, కల్కము చేసి పుచ్చుకొనినను, చందనము పుచ్చుకొనినను మండ్రగబ్బవిషము హరించును.

—— పత్త్రాళి (ఆకుతేలు) విషచికిత్స. ——

1 చికిత్స —

నింబపత్త్రరసాలేపాత్ లేపా త్కుక్కుటవిష్ఠయా. 109

హరీతక్యాను లేపేన పత్త్రాళే ర్విషనాశనం,

వేపాకురసము పైనను, కోడిమలము పైనను, కరకకాయగంధము పైనను, గాయమందు పట్టించిన ఆకుతేలువిష మడఁగును.

2 వ చికిత్స.—

ప్రత్యంగిరాభవం బీజం అపామార్గస్య బీజకం. 110

జలే విలేపనం కుర్యా త్పత్త్రాళే ర్విషనాశనం,

దిరిసెనపువిత్తులను గాని, ఉత్తరేణివిత్తులను గాని, నీళ్లతో నూరి పట్టించిన ఆకుతేలువిషము శమించును.

3 వ చికిత్స —

సురసాస్వరసం లేపా త్పత్త్రాళే ర్విషనాశనమ్. 111

తులసియాకురసము పట్టించిన ఆకుతేలువిషము శమించును.

—— తుమ్మెదలకాటుచికిత్స. ——

మాహిషీం చ గవీనేన టంకణై స్సహ మర్దయేత్,

మాక్షికభ్రామర స్యాంతం నాగఫేనేన తత్సమమ్. 112

బట్టివెన్నలో వెలిగారమును గాని, అభినిమందును గాని కలిపి పట్టించిన తుమ్మెదలు అడవియీఁగలు మొదలగునవి కఱచినబాధ నివర్తించును.

—— కందిరీగలకాటుచికిత్స. ——

కర్దమం వా పటీరం వా తిల్యం చాపి విలేపయేత్,
తత్ క్షణేన వినశ్యంతి కండోలీక్షతివేదనం. 113

బురదమట్టిని గాని, చందనమును గాని, నువ్వులనూనెను గాని పట్టించిన కందిరీగలు కుట్టినదద్దులుమానును.

—— మశకమక్షికదష్టలక్షణము. ——

కండూమార్గ మశకై శ్వేత చ్ఛోఫస్స్యా న్మర్మవేదనః,
అసాధ్యకీటసదృశ మసాధ్యమశకార్దితం. 114
సద్యః ప్రస్రావిణీ స్యావా ద్దాహ మూర్ఛాజ్వరాన్వితా,
పిడకామాక్షికాద్దంశే తా సాంతుస్థాపికానుహృత్. 115

మశకమక్షికాదులు కఱచినపుడు శోఫ మర్మములయందు వేదన కలిగి యుండును. అసాధ్యకీటలక్షణము లిందు కలిగి యుండెనేని యిదియు నసాధ్యమే యగును. ఈఁగలు కఱచినపుడు కాటునుండి రక్తము స్రవించుట, శ్యావవర్ణము కలిగి యుండుట, దాహము, మంట, మూర్ఛ, జ్వరము ఈలక్షణములును కలిగియుండును. ఇందుకు స్థావిక మనగా యొఱ్ఱతెగడ ప్రసిద్ధమైనచికిత్సౌషధి.

—— అడవియీఁగలకాటుచికిత్స. ——

జిహ్వయా స్తాలుకాయోగాత్ లాలాద్రావేన తత్క్షణే,
విలిప్తస్య తేనధంకస్య చర్వణస్య విషం హరేత్. 116

అడవియీఁగలు జోరీగలు కుట్టినదద్దులమీఁద నోటిజొల్లును పట్టించిన వాని బాధ శాంతించును.

—— జుంటీగలకాటుచికిత్స. ——

అఫేనబీజం పాటీరం లేపయే త్సరఘాక్షతే,
రక్తచందనలేప స్స్యాత్ దద్రూర్తి హారతి తత్ క్షణాత్. 117

జుంటీగలు కుట్టినదద్దులపైన గసగసాలు గాని, చందనము గాని, చందనపు గంధము గాని పట్టించిన మంట, పోటు, దద్దురు అణఁగిపోవును.

—— దోమకాటుచికిత్స. ——

సుఖోష్ణవారిణా స్నానం చందన స్యానులేపనం,
మశకానాం క్షతాని హంతి శీఘ్ర మేవ న సంశయః. 118

సుఖోష్ణ మైనయుదకమున స్నానము చేసి శరీరమునకు చందనమును లేపనము చేసిన దోమకాటుదద్దులు పోవును.

### ⟶ కర్ణప్రవేశమైనజోరీగచికిత్స. ⟵

కర్ణప్రవేశే ఖర్జూరతత్కర్ణే మూత్రకం క్షిపేత్,
తథా చ తిలతైలం చ ధంకే నత్సస్య శ్లక్ష్ణకం. 119

గోమూత్రము, నువ్వులనూనె నేకముఁ జేసి కించిదుష్ణముగ కాచి చెవిలో పోయుచుండినను, అవుపేడరసమును పిండుకొని పోయుచుండినను చెవిలో ప్రవేశించినజోరీగలు బైట వచ్చును. వానివలన కలిగినబాధయును శమించును.

### ⟶ శతపాద్యాదివిషజంతుగణము. ⟵

మహాశతపదీ చైవ శతపాదీ చ మాసలీ,
శతపాదాదికాః ప్రోక్తాః సకూర్రా విషజంతవః. 120

తాటిజెఱ్ఱి, జెఱ్ఱి, రోకటిబండపురుగు అనునవి క్రూరవిషము గలశతపాదాది జంతువు లనఁబడును.

### ⟶ జెఱ్ఱికాటువిషలక్షణము. ⟵

దంశే స్వేదం రుజం దాహం దద్రూత్థం రోమహర్షణం,
జిహ్వావక్త్రే చ కండుశ్చ కరోతి చ శతాపది. 121

జెఱ్ఱికఱచినప్పుడు కాటునందు చెమట, నొప్పి, మంట, దద్దురులు లేచుట, గగుర్పొడుచుట, నోరు, నాలుక, వీనియందు దురద ఈలక్షణములు కలుగును.

1 వ చికిత్స —

సర్జికాజశకృత్క్షారః సురసోఽభాంక్షపీడకః,
మదిరామండసంయుక్తో హింతి శ్శతపదీ విషే. 122

సర్జక్షారము, మేకపెంటికలబూడిదయొక్క క్షారము, తామరవిత్తులు, రుద్రాక్ష, తులసి, ఇవి మద్యముతోఁగాని, మీగడతోఁగాని కల్పి పుచ్చుకొనిన జెఱ్ఱి విషబాధ నెమ్మదించును.

2 వ తాటిజెఱ్ఱిచికిత్స —

శ్వేతోషరం పచే త్తోయే పీత్వా తన్మస్తు తత్క్షణే,
తత్తోయేసేచనం కుర్యా న్మహాశతపదీక్షతే. 123

తెల్లనిచవుడు నుదకములో కలిపి యుండకఁబెట్టి యందలితేటనీటిని గ్రహించి పానము చేసి యాయుదకమునే గాయమందును శరీరమందును సేచనముచేసిన తాటి జెఱ్ఱికాటువలన కలిగినమంట జిల, దద్దురులు నెమ్మదించును.

3 వ చికిత్స.—

శాద్బలం టంకణం తుత్థం కట్ఫలం రజనీ వచా,
కల్కం పిబే దారనాళే మహాశతపదీవిషే. 124

తెల్లగరిక, వెలిగారము, మైలుతుత్తము, పెగ్గుమ్ముడు, పసుపు, వస, యీావస్తువులు కూటిసీటితో కల్కము చేసి పుచ్చుకొనిన జెఱ్ఱి, తాటిజెఱ్ఱి కఱచినందున కలిగినవిషము నెమ్మదించును.

4 వ చికిత్స.—

ప్రత్యంగిరాభవం బీజం తండులీయకమూలకం,
నవనీతేన సమ్మర్ద్యం లేప్య మాపాదమస్తకే. 125
తక్షణేన వినశ్యంతి మహాశతపదీవిషం,

దిరిసెనపువిత్తులు, చిఱ్ఱివేళ్లు అవువెన్నతో నూఱి ఆపాదమస్తకము లేపనము చేసిన జెఱ్ఱి, తాటిజెఱ్ఱి విషము తక్షణము హరించును.

5 వ చికిత్స.—

గుంజాద్వయం స్ఫుటామం చ శారిబావల్కలద్రవే. 126
పలమాత్రం పిబే త్సద్యః హరే చ్ఛతపదీవిషం,

పలప్రమాణము సుగంధపాలవేరు కషాయములో రెండు గురిగింజలయెత్తు, (పాటేష్ఐదిడం) అనుఉప్పును కలిపి పుచ్చుకొనిన జెఱ్ఱివిషము హరించును.

6 వ చికిత్స.—

గుహూచిసారం సంగ్రాహ్యం నవనీతసమన్వితం. 127
లేపయే ద్దేహ మాద్యంతం శమయే చ్ఛతపదీవిషం,

తిప్పసత్తును అవువెన్నలో కలిపి దేహ మాద్యంతము పట్టించిన జెఱ్ఱివిషము శాంతించును.

7 వ చికిత్స.—

కుందురోర్మూలకం భక్ష్యేత్ శతపాదివిషంహరేత్. 128

రెండుదినములు కుందురువేళ్లను నమిలి యారసమును మ్రింగుచుండిన జెఱ్ఱివిషము హరించును.

## రోకటిబండపురుగు కాటుచికిత్స.

విషతిందుభవం బీజం గోమూత్రేణ విమర్దయేత్,
తక్షణేన విషం హంతి లేపయే న్మానలీవిషమ్. 129

ముష్టివిత్తును గోమూత్రములో చాది యాగంధమును కాటుపైన పట్టించిన రోకటిబండపురుగు కాటు విషము హరించును.

2 వ చికిత్స.—

సర్పాక్షీమూల మాదాయ జలేన క్వథితం పిబేత్,
నరమూత్రానులేపేన శమయే న్మూసలీవిషమ్. 180

సర్పాక్షీవేరు నుదకమున కషాయము గాచి పుచ్చుకొనినను, దానినే పిల్లవాం డ్రమూత్రముతో చాది పట్టించినను రోకటిబండపురుగు కాటువిషము హరించును.

## లూతాదివిషజంతుగణచికిత్సాప్రకరణము.

లూతా బిలేశయ శ్చైవ జలమండలికా తథా,
అగ్నిమండలినామ్నీ చ కణభో గలగోడికా. 131
పతంగశలభ శ్చైవ భృంగారాగ్నిపిపీలికా,
ఇదం లూతాదికగణ మత్యంతవిషకీటకాః. 132

లూతా (దీనిని సాలెపురు గందురు. కాని యాజాతిలోనిది కాదు; అత్యంత విషజాతిలోని యొకవిధమైనకీటకము) బొరియపురుగు, జలమండలి, అగ్నిమండలి, కణభము, (ఇది పిడుదజాతిలో చేరినవిషకీటకము) పులికొను, చిమ్మట, మిడుత, చీరక, చలిచీమ యీపదియును లూతాదిగణ మనఁబడును.

## లూతోత్పత్తివివరణము.

విశ్వామిత్రో నృపవరః కదాచి దృషిసత్తమః,
వసిష్ఠం కోపయామాస గత్వాఽశ్రమపదం కిల. 133
కుపితస్య మునే స్తస్య లలాటా త్స్వేదబిందవః,
అపత న్దర్శనా దేవ హ్యధస్తా త్త్రిప్రవర్షసః. 134
లూనే తృణే మహర్షేస్తు ధేన్వర్థే సంభృతేఽపి చ,
తతో జాతా స్త్విమే ఘోరా నానారూపా మహావిషాః. 135
తాసా మష్టౌ కష్టసాధ్యా వర్జ్యా స్తావత్య ఏవ హి,

విశ్వామిత్రుఁడు రాజ్యము చేయుచు మృగయావినోదమునకు వెళ్లి వసిష్ఠాశ్రమముచేరి అచ్చట నాతనిచే విందారగించి అతని యాశ్రమమున నుండునందిని ధేనువు నపహరింప యత్నింప విశ్వామిత్రునిపై వసిష్ఠమహర్షి కత్యంతకోపం బొందవిచూచుచు చూచునప్పుడు వసిష్ఠునకు ముఖమందు కలిగినచెమటబిందువులు ధేన్వర్థము తెచ్చియుండుగడ్డిపైనఁ బడి పదనాలు విధములగు లూత లను విషకీటకములు జనించినవి. అందు ఎనిమిదిసాధ్యములు ఎనిమిది అసాధ్యములు.

### లూతలవివరణము.

కీటేభ్యో దారుణతరా లూతా షోడశధా జగుః।
అష్టావింశతి రిత్యేకే తతోఽప్యన్యే తు భూయసీః, 136
సహస్రరశ్మ్యనుచరా వదంత్యన్యే సహస్రశః.
బహూపద్రవరూపా చ్చ లూతైకైవ విషాత్మికా. 137
రూపాణినామత స్తస్యా దుర్జ్ఞేయా న్యతిసంకరాత్.
నాస్తి స్థానవ్యవస్థాచ దోషతోఽతః ప్రచక్షతే, 138
కృచ్ఛ్రసాధ్యా పృథగ్దోషై రసాధ్యా నిచయేన చ. 139

లూతలు విషకీటకము లన్నిటికన్నను క్రూరతరములు. లూతలు పదునా అని కొందఱును ఇరువదెనిమిది యని కొందఱును మఱికొంద ఱంతకన్న నెక్కుడని యును జెప్పెదరు. ఉపద్రవము లెక్కువగ నుండుటచే లూతలు విషస్వరూపము గలవి. వాని లక్షణములఁ దెలిసికొనుట దుర్లభము. దోషభేదములచే లక్షణముల నిర్ణయింపవలెను. ప్రత్యేకదోషలక్షణము లుండిన కష్టసాధ్యము. సన్నిపాతలక్షణ ములు కలిగి యుండిన నసాధ్యము.

### సర్వలూతాదంశలక్షణము.

అసాధ్యాయాం తు హృన్మోహశ్వాసహిధ్మాశిరోరుజాః,
శ్వేతాః పీతా స్సితా రక్తాః పిటికాశ్వయథూద్భవాః. 140
వేపథుర్వమథు ర్దాహ స్తృడాంధ్యంవక్త్రనాసతా,
శ్యావోష్ఠవక్త్రదంతత్వం పృష్ఠగ్రీవాసభంజనం. 141
పక్వజంబుసవర్ణం చ దంశా త్స్రవతి శోణితం,
సర్వాపి సర్వజా ప్రాయో వ్యపదేశస్తు భూయసా. 142
తీక్ష్ణ మధ్యావరత్వేన సా త్రిధాఽహం త్యుపేక్షితా,
సప్తాహేన దశాహేన పక్షేణ చ పరం క్రమాత్. 143
లూతాదంశశ్చ సర్వోఽపి దద్రూమండలసన్నిభః,
సితాసితోఽరుణః పీతః శ్యావో వా మృదు రున్నతః. 144
మధ్యేకృష్ణోఽథవా శ్యావః పర్యంతే జాలకావృతః,
విసర్పవాన్ శోఫయుతః తప్యతే బహు వేదనః. 145
జ్వరాశుపాకవిక్లేద కోథావతరణాం త్వితః,

లూతలు కఱచినపుడు గుండెలలో నొప్పి, మోహము, శ్వాసము, ఎక్కిళ్లు, తలనొప్పి, వాపు పైనగలిగెడి పొక్కులు, తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపురంగులు

కలిగి యుండుట, వడఁకు, వాంతి, మంటలు, దప్పి, చీఁకట్లు గ్రమ్మిన ట్లుండుట, ముక్కు వంకరపోవుట, పెదవులు నోరు దంతములు నల్లఁబడుట, వీపు మెడ వీని యందు బ్రద్దలు గొట్టిన ట్లుండుట, గాయములో నుండి నేరేడుపండు వర్ణము గల రక్తము కాఱుచుండుట, ఈలక్షణములు కలిగి యుండిన నసాధ్యం బని తెలియవలెను. ఈవిషము నుపేక్షించినచో తీవ్రవిష మేడురోజులకును మధ్యమవిషము పదిరోజులకును హీనవిషము పదునైదుదినములకును చంపును. లూతాదంశంబు లన్నియు మచ్చల వంటిదద్దులు కలిగి అందు తెలుపు, నలుపు, ఎఱుపు, పసుపు, వర్ణములలో నేదేని కలిగి మధ్యప్రదేశమున కృష్ణవర్ణము, లేక శ్యావవర్ణము కలిగి అంచులకు చుట్టును వలవలె రంధ్రములు కలిగి విసర్పమువలె పొక్కులు లేచి వాపుతోగూడి వేదన కలిగి జ్వరము, త్వరగపండి పుండగుట, చీముపట్టి కుళ్లుట, వ్రణము పగులుట, ఇట్టిలక్షణములు కలుగును.

### లూతాదూషీవిషలక్షణము.

దూషీవిషాభి ర్లూతాభి స్తం దుష్ట మితి నిర్దిశేత్. 146
శోఫాః శ్వేతా సితా రక్తాః పీతా వా పిడకా జ్వరః,
ప్రాణాంతకీ భవేచ్ఛ్వాసో దాహో హిక్కా శిరోగ్రహః. 147
ఆదంశాచ్ఛోణితం పాండుమండలాని జ్వరోఽరుచిః,
లోమహర్షశ్చ దాహ శ్చా ప్యాశుదూషీవిషార్దితే. 148
మూర్ఛాంగశోషవైవర్ణ్యక్లేదశబ్దాహ్యతిజ్వరాః,
శిరోగురుత్వం లాలాసృక్ఛర్దిశ్చాసాధ్యదూషికైః. 149
శ్యావత్వ మథ కార్ష్ణ్యం వా నానావర్ణత్వ మేవ వా,
మోహః పురీషభేదో వా దష్ట స్యా ప్యకృకంటకః. 150
దహ త్యగ్ని రివాదౌ తు భింద తీవోర్ధ్వ మాశు చ,

లూతలు కఱచినపుడు శరీరమందలి విషము దూష్యత్వమును జెందినయెడల తెలుపు నలుపు పసుపు యెఱుపురంగులలో నేదియో యొకరంగు గలవాపు, బొబ్బలు, జ్వరము, శ్వాస, దాహము, ఎక్కిళ్లు, తల బిగఁబట్టినట్లుండుట, గాయమునం దెప్పుడు నెత్తురు కాఱుచుండుట, తెల్లనిమచ్చలు, అరుచి, తలబరువు, నోటచొంగ, నెత్తురు పడుట, శ్యావము లేక నలుపు లేక అనేకవర్ణములు కలుగుట, మోహము, పురీషభేదనము, నిప్పుతో కాల్చినటు లుండుట, పైకెగరవేసినట్లు విషముచే బాధ కలుగుట, ఈలక్షణములు దూషీవిషమందు కలుగును.

### వాతలూతాలక్షణము.

వాతికః పరుష శ్శ్యావః పర్వభేదః జ్వరప్రదః. 151
తద్విభాగం యథాస్త్వం చ దోషలింగై ర్విభావయేత్,

వాతికలూత ఖరస్పర్శము, శ్యావవర్ణము, పర్వభేదము కలిగి జ్వరమును కలిగించునదిగ నుండును. మఱికొన్ని వాతలక్షణములు కలుగును.

### పిత్తలూతాలక్షణము.

తద్దంశః పైత్తికో దాహతృట్ స్ఫోటజ్వరమోహవాన్. 152
భృశోష్మా రక్తపీతాభః క్లేదీ ద్రాక్షాఫలోపమః,

పిత్తలూత కఱచినచో మంట, దప్పి, పొక్కులు, జ్వరము, మోహము, వేఁడి యావిరివెడలుట, పుండు కుళ్లుట, ఈలక్షణములు కల్పించునదియై కొంచె మెఱుపు కలిసినపసపురంగు గలిగి ద్రాక్షపండు ఆకారము కలిగి యుండును.

### శ్లేష్మలూతాలక్షణము.

శ్లేష్మికః కఠినః పాండుః పరూషకఫలాకృతిః. 153
నిద్రాం శీతజ్వరం కాసం కండూం చ కురుతే భృశం,

శ్లేష్మలూత కఱచినపుడు కాఠిన్యము, పాండురవర్ణము, చిట్లీతపండు ఆకారము కలిగి కఱచినపుడు నిద్ర చలిజ్వరము, దగ్గు, దురద, అనువానిని కలిగించును.

### లూతావిషలక్షణము.

క్లేదేన యత్స్పృశ త్యంగం తత్రాపి కురుతే వ్రణమ్. 154
శ్వాసదంష్ట్రాశకృన్మూత్ర శుక్ర లాలాచన ఖార్తవైః,
అష్టాభి రుద్వమ త్యేషా విషం వక్త్రై ర్విశేషితః. 155

లూతాదంశవిషముచలన జనించినవ్రణమునం దుండు చీము ఎచ్చట తగిలిన నచ్చట వ్రణమును కలుగఁ జేయును. మఱియు నాదష్టునియొక్క శ్వాసము, కోఱలు, పురీషము మూత్రము, శుక్రము, చొంగ, గోళ్లు, ఆర్తవము అనునెనిమిదింటిచేతను, లూతలు మనుజులకు విషమును గల్గించును.

### లూతావిషవేగసప్తకలక్షణము.

సూచీవ్యధవ దాభాతి తతోఽసౌ ప్రథమేఽహని,
అవ్యక్తవర్ణః ప్రచలః కించి త్కండూరుజాన్వితః. 156
ద్వితీయేఽభ్యున్నతోఽన్తేషు పిటకై రివ వాచితః,
వ్యక్తవర్ణో నతో మధ్యే కండూమా న్గ్రంధిసన్నిభః. 157

తృతీయే సజ్వరో రోమహర్షకృ ద్రక్తమండలః,
శరావరూప స్తోథాఢ్యో రోమకూపేషు సంస్రవః. 158
మహాంశ్చతుర్థే శ్వయథు పశ్వాసభ్రమప్రదః,
వికారాన్ కురుతే తాంస్తాన్ పంచమే విషకోపజాన్. 159
షష్ఠే వ్యాప్నోతి మర్మాణి సప్తమే హంతి జీవితం,
ఇతి తీక్ష్ణం విషం మధ్యం హీనం చ విభజే త్తతః. 160
ఏకవింశతిరాత్రేణ విషం శామ్యతి సర్వదా,

లూత కఱచిన మొదటిరోజున సూదులతో పొడచినట్లుండి అవ్యక్తవర్ణము కలిగి జిలజిల మనుచు కొంచెముగ దురద గలుగును. రెండవదినమందు కాటుచుట్టు నున్నతమగు బొబ్బలు కలిగి మధ్యమున పల్లమేర్పడి వ్యక్తవర్ణము కలిగి దురదతోడ గ్రంధివలె నుండును. మూడవదినమున జ్వరము,గగుర్పాటు, మూకుడువలె రక్తమండలము కలిగి పోట్లతో కూడి రోమకూపములనుండి రక్తము స్రవించును. నాల్గవరోజున విపరీతమైనవాపు, తాపము, శ్వాసము, భ్రమ కలుగును. అయిదవరోజున విషలక్షణము లన్నియు కలుగును. ఆఱవదినమున విషము మర్మముల కెగఁబ్రాకును. ఏడవరోజున రోగిని చంపును. ఇటుల, తీక్ష్ణమధ్యహీనవిషభేదములచే క్రమముగ నెఱుఁగవలయును. ఏడవదినమున రోగి చావకుండిన నిరువదొకటవదినమునకు విషము స్వయముగనే హరించి రోగి బ్రతుకును.

### లూత కఱచినది మఱియొకకీటకము కఱచినది తెలియు విధము.

లూతా నాభే ర్దశ త్యూర్ధ్వ మూర్ధ్వం వాఽధశ్చ కీటకాః. 161
తద్దూషితం చ వస్త్రాది దేహే పృక్తం వికారకృత్,
దినార్థం లక్ష్యతే నైవ దంశో లూతావిషోద్భవః. 162

లూతలు బొడ్డుకు పైభాగమునందు కఱచును. తేళ్లు మొదలైనవి నాభి కూర్ధ్వమునఁ గాని క్రిందివైపునఁ గాని కుట్టును. పైవానిచే (పైలూతావిష) దూషితములగువస్త్రాదుల నుపయోగించినట్లయిన విష మెక్కును. అయ్యది యొకపూటమాత్రమే బాధించును. శరీరమందు గాయముమాత్ర ముండదు.

### లూతాదష్టప్రథమకర్తవ్యము.

అథాశులూతాదష్టస్య శస్త్రేణాదంశ ముద్ధరేత్,
దహేచ్చ జాంబవోష్ఠాద్యై ర్న తు పిత్తోత్తరం దహేత్. 163

లూత కఱచినవెంటనే కత్తిచే నాదంశమును గీరి జాంబవోష్ఠమును నాయుధముచే కాల్చవలయును గాని పిత్తమధికముగ నుండిన కాల్చఁదగదు.

1 లూతాదష్టచికిత్స.—

చందనం పద్మకోశీరం పాటలీ సింధువారికా,
క్షీరకుష్టానతం కుష్టం శిరీషోదీచ్యశారిబా. 164
శేలుస్వరసపిష్టాయాం లూతానాం సార్వకార్మికః,
సర్వాగదాయథా దోషం ప్రయోజ్యా స్యుః కృకంటకే. 165

చందనము, పద్మకము, వట్టివేళ్లు, పాదిరివేళ్లు, వావిలి, మట్టిపట్ట, చెంగల్వకోష్టు, గ్రంధితగరము, దిరిసెనపుచెక్క, కురువేరు, సుగంధపాల వీనిని విరిగిచెట్టు రసముతో ముద్దగా నూరి లోపలికి పుచ్చుకొనుట, గాయమందు వేసి కట్టుగట్టుట, శరీరమునకు లేపనము చేయుటచే లూతావిషము శమించును. అందు ములుగోరంట వేరును చేర్చవచ్చును.

2 వ చికిత్స.—

ఫలినీ ద్వినిశా క్షౌద్రసర్పిభిః పద్మకాహ్వయః,
అశేషలూతాకీటానా మగద సర్వకార్మికః. 166

ప్రేంకణపుచెక్క, కూరపసుపు, మానిపసుపు, పద్మకము, వీనిని చూర్ణించి అంగు తేనె నెయ్యి కలిపి లూతాదష్టమందు సర్వకర్మలయం దుపయోగింపవలయును.

3 వ చికిత్స:—

నతలోధ్రవచాకట్వీపాఠైలాపత్రకుంకుమైః,
విషఘ్నం బహుదోషేషు ప్రయుంజీత విశోధనమ్. 167

గ్రంధితగరము, లొద్దుగుచెక్క, వస, కటుకరోహిణి, విషబొద్ది, ఏలకులు, ఆకుపత్రి, కుంకుమపువ్వు, వీనిని చూర్ణించి, లూతావిషమం దుపయోగించిన మేలు కలుగును.

4 వ చికిత్స.—

యష్ట్యాహ్వమదనాంకోల జాలినీమిందువారికా,
కఫే శ్రేష్ఠాంబునా పీత్వా విష మాశు నివారయేత్. 168

అతిమధురము, నల్లయుమ్మెత్త, ఊడుగపువ్వులు, గురువిందచెక్క, వావిలి, ఇవి శుద్ధజలముతో నూరి త్రాగిన లూతావిషము వల్ల కలిగిన కఫోద్రేకము శాంతించును.

5 వ చికిత్స —

శిరీషపత్రత్వఙ్మూలఫలం వాంకూ మూలవత్,
విరేచయేచ్ఛ త్రిఫలానీలినీత్రివృతాదిభిః. 169

నివృత్తే దాహశోషాదికర్ణికాం పాతయే ద్వ్రణాత్,

త్రిఫలకషాయము, నీలివేరు, తెల్లతెగడ, వీనిలో దేనిని గాని యిచ్చి విరేచనమును చేయించి దిరిసెనపు ఆకు, పట్ట, వేరు, కాయ, చిగురు వీనిని నూరి సేవించి నట్టయిన లూతావిషశమనము కలుగును.

6 వ చికిత్స.—

కుసుంభపుష్పం గోదంతం స్వర్ణక్షీరీకపోతవిట్. 170
త్రివృత్తాసైంధవం దంతీ కర్ణికాపాతనం తథా,
మూలముత్తరవారుణ్యాం వంశనిర్లేఖసంయుతమ్. 171

కుసుమపువ్వుల, తాళకము, అత్తిచెక్క, పావురపురుసలు, తెల్లతెగడ, సైంధలవణము, ఏనుఁగమదము, జుష్టుపువేరు, వెదురుగొమ్ము ఇవి నూరి శరీరమునకు రాచినను పుచ్చుకొనినను లూతావిషము హరించును.

7 వ చికిత్స.—

తద్వచ్చ సైంధవం కుష్టం దంతీకటుకదార్థికం,
రాజకోశాతకీమూలం కిణ్వామధితోద్భవః. 172
కర్ణికాపాతసమయే బృంహయేచ్చ విషాపహైః,

సైంధవలవణము, కోష్టు, దంతెవేళ్లు, కటుకరోహిణి, పిన్నపాల, నేతిబీరవేరు, ఇవి మజ్జిగతో నూరి గ్రంథులుత్పన్నమగునపుడు రాచిన నవి నిశ్శేషముగ నశించును.

8 వ చికిత్స.—

స్నేహకార్య మశేషం చ సర్పిషైవ సమాచరేత్,
విషస్య వర్ధయే త్తైల మగ్నే రివ తృణోలుపం. 173

లూతావిషమందు చేయఁబడు స్నేహోపచారము లన్నియు నేతితో చేయవలయునే కాని నూనెతో చేసినయెడల అగ్నియం దెండుగడ్డిని వేసినటుల విష మభివృద్ధిఁ జెందును.

9 వ చికిత్స.—

హ్రీబేరవైకంకతగోపకన్యా ముస్తాశమీ చందనటిందుకాని,
శైవాలనీలోత్పలవక్ర యష్టీ త్వఙ్నాకులీ పద్మకరాటమధ్యం. 174

కురువేరు, కానరేగు, సుగంధపాల, తుంగముస్తలు, జమ్మికాయలు, చందనము, గుండిగపువేరు, నీటినాచు, నల్లకలువగడ్డ, గ్రంధితగరము, అతిమధురము, లవంగపుచెక్క, సర్పాక్షీచెట్టు, తామరగడ్డ, ఇవి చూర్ణించి యుంచుకొని కరాటమునం దుంచి వలయునప్పుడు లూతఘాతల కుపయోగింపవలసినది.

22

10 వ చికిత్స.—

లోధ్రం సేవ్యంపద్మకం పద్మరేణుః
కాలేయాఖ్యం చందనం యచ్చ రక్తం,
కాంతాపుష్పం దుగ్ధినీకా మృణాళం
లూతా స్పర్శా ఘ్నంతి సర్వక్రియాభిః. 175

లొద్దుగు, వట్టివేళ్లు, పుష్కరమూలము, తామరపరాగము, కృష్ణాగరు, చందనము, రక్తచందనము, ప్రేంఖణపుష్పము, పిన్నపాల, తామరతూడు అనునవి లూతావిషమును హరించునౌషధులు గాన సర్వక్రియలందు నుపయోగింపవలెను.

11 వ చికిత్స.—

రజనీఘనసర్పలోచనీ కణశుంఠీకణమూలచిత్రకాః,
వరుణాగురుబిల్వపాటలీ పిచుమందాభయశేలుకేసరం. 176
బిల్వచందనతోత్పలశుంఠీ పిప్పలీనిచుల వేతసకుష్ఠం,
శుక్తిశాకవరపాటలిభార్గి సింధువారకకరోటివరాంగం. 177
పిత్తకఫానిలలూతాః పానాంజననస్య లేపసేకేన,
అగదవరా వృత్తస్థాః కుమతివివవారయంత్యేతే. 178

కూరపసుపు, సర్పాక్షిచెట్టు, పిప్పళ్లు, సొంటి, మోడి, చిత్రమూలము, మొగలింగచెక్క, కృష్ణాగరు, మారేడు, కలిగొట్టు, వేము, కరకకాయ, విరిగిచెక్క, నాగకేసరాలు, చందనము, గ్రంధితగరము, కలువగడ్డ, శొంఠి, అమ్లవేతసము, కోష్టు, ఎలుకచెవికూర, కరకతాడిఉసిరికలు, భారంగి, తెలపురియపెంకు, ఇవి సర్వక్రియలందుపయోగించుచు పానలేపన నస్యాంజనసేకముల కుపయోగించిన త్రిదోషలూతల విషము హరించును.

12 వ చికిత్స:—

రజనీయుగ్మపతంగ మంజిష్ఠా నాగకేసరైః. 179
శీతాంబుపిష్టై రాలేపః సద్యో లూతాం వినాశయేత్,

కూరపసుపు, మానిపసుపు, రసకర్పూరము, మంజిష్ఠి, నాగకేసరములు, ఇవి సమాంశములు గూర్చి శీతోదకమున నూరి శరీరమునకు లేపనము చేసిన లూతవిషము తక్షణమే హరించును.

13 వ చికిత్స.—

మాక్షిక స్యానుపానేన తప్తస్వర్ణరజః పిబేత్. 180
సప్తవాసరపర్యంతం సర్వలూతావిషాపహం,

అపరంజిరాపాడిని తేనెలో గలిపి యేడుదినములు సేవించిన సర్వలూతావిష ములు హరించును.

## బిలేశయాది ప్రాణహరలూతలదంశలక్షణము.

శోథశ్శ్వేతాసితా రక్తాపీతా చ పిడికా జ్వరాః. 181
ప్రాణాంతకీభవే ద్దాహః శ్వాసహిక్కాశిరోగ్రహః,
క్షతేషు రుధిరస్రావం సద్యః ప్రాణాపహారకాః 182

బిలేశయము, జలమండలము, అగ్నిమండలము అనునవి కఱచిన వారికి శోప, జ్వరము, శ్వాస, ఎక్కిళ్లు, శిరస్సు, మొద్దుపాఱి జ్ఞానహీనమగుట, శరీరమునకు తెలుపులేక పసుపురంగు వ్యాపించుట, తాపము, శరీరము కందుబాఱి యెఱ్ఱనగుట, పిటికలు జనించుట, గాయమునుండి జలజల రక్తము కాఱుట, జాములోపల ప్రాణములుపోవుట సంభవించును.

## బిలేశయ (బొరియపరిఱె) దంశలక్షణము

బిలేశయో బిలే భూమేః స్థిత్వా దంశతి మానవాన్,
తస్యాచ్ఛోభశ్చ పీతాభో జాయతే విస్మృతి ర్భృతిః. 183

బొఱియపరిఱె యనులూత భూమిలోనిబొఱియలో నుండియే కఱచును. కఱచునపుడు గాని అంతకు మందు గాని వెనుకఁగాని కఱవఁబడినమనిషికి కనఁబడదు. తదితరులకును కనఁబడదు. అది కఱచినతోడనే గాయమునుండి బొటబొట రక్తము కాఱును. ఆయోగ్యానన్నేదియో కఱచినదని యితరులకు చెప్పులోపలనే స్మృతి తప్పి పడిపోయి శరీరమునకు పసుపురంగు వ్యాపించి విశేషముగ నుబ్బి యొకగంటలోపల చచ్చిపోవును.

## అగ్నిమండలియనులూతదంశలక్షణము.

అగ్నిమండలిసందంశా ద్గాత్రం కుంకుమసన్నిభం,
తాపక్షోభవిదాహైశ్చ యామార్ధే మరణం భవేత్. 134

అగ్నిమండల మనులూత కఱచిన శరీరమంతయు రక్తవర్ణ మయి తాపము, క్షోభము, విదాహము, కలిగి అఱజాములో చచ్చి పోవును.

## జలమండలదంశలక్షణము.

జలమండలిసందంశా ద్గాత్రం శీతం హిమోపమం,
విస్మృతి శ్చాంగశైథిల్యం యామార్ధేన మృతి ర్భవేత్. 185

జలమండల మనులూత కఱచినపుడు శరీర మంతయు మంచుగడ్డవలె చల్లనై మైకము కలిగి సర్వాంగములు వికలతఁ జెంది అఱజాములో మరణము కలుగును.

తేషాం విషాణాం త్రయాణాం ప్రతికారో న విద్యతే,

పైఁ జెప్పంబడినబొాతియపరిటె, అగ్నిమండలము, జలమండలము, అనుమూఁడులూతలదంశములకు లోకమం దిప్పటి కేలాటిచికిత్సలును కనుపింపలేదు.

పులికోనుచికిత్స

కపిత్థం సర్షపోపేతం గలగోడివిషాపహమ్. 186
అథ వా కాపిత్థసర్వస్వం పిబే ద్విషనాశనం,

వెలగపండుగుజ్జు ఆవాలు మెత్తగా నూఱి భక్షించినను లేక, వెలగపండు గాని, కాయ గాని, పిందె గాని, కాయయొక్క పెంకుగాని భక్షించినను ఇందు నేవియు తటస్థింపనిచో నెండుకాయయొక్క పెంకు తటస్థించినను చూర్ణించి యుదకమందు కల్పి త్రాగినను పులికోనువిషము తప్పక హరించును.

అన్యచ్చికిత్సా.—

కపిత్థ మక్షిపీడోర్క బీజం త్రికటుకం తథా. 187
కరంజో ద్వే హరిద్రే చ గలగోడీవిషం జయేత్,

వెలగపండు, అక్షిపీడము, జిల్లేడువిత్తులు, త్రికటుకములు, కానుగు, కూరపసుపు, మానిపసుపు, వీనిని సేవించిన పులికోనువిషము హరించును.

పులికోనుదష్టలక్షణము.

దాహతోదస్వేదశోఫకరీ తు గలగోడికా. 188
విస్మృతి శ్చాంగశైథిల్యం యామార్ధే మృతిసంభవః,

పులికోను కఱచినట్లయిన శరీరతాపము గాయమునందు పంజడము, చెమట, శరీరము వాపు, స్మృతితప్పుట, శరీరము పడఁగొట్టినటు లుండుట, అఱజాములోపల మరణము కలుగును.

కణభదష్టలక్షణము.

విసర్పి శ్వయథుశ్శూల జ్వర శ్ఛర్దిరథాపి వా. 189
లక్షణం కణభై ర్దష్టే దంశ శ్చేదావశీర్యతే,

కణభ మనునది పిడుగుజాతిలో చేరినయొక విషకీటకము. ఇది కఱచిన శరీరమంతయు పొక్కులు కలిగి వాపు, నొప్పి, జ్వరము, వాంతి యేర్పడి శరీరము పగలఁగొట్టినటుల శ్రమ యేర్పడును.

కణభవిషచికిత్స

శిరీషవల్కలం కుష్ఠం వారిణా క్వథితం పిబేత్. 190
కణభస్య విషం హంతి తత్క్షణేన న సంశయః,

దిరిసెనపుపట్ట, కోష్టు, కషాయము గాచి పుచ్చుకొనిన కణభదష్టవిషము హరించును.

### మిడతకాటుచికిత్స.

చందనం చ తిలాశుంఠీ శీతతోయేన మర్దయేత్. 191
తద్గంధం లేపయే దంగే పతంగస్య విషం హరేత్,

చందనము, నువ్వులు, సొంటి, నీళ్లతో నూరి శరీరమునకు పట్టించిన మిడతకాటువిషము హరించును.

### చిమటకాటుచికిత్స.

ఘనచూర్ణసమాయుక్తం దధి మస్తు విలేపయేత్. 192
గాత్రే తక్రపిశేషా చ్చ భృంగారీవిషనాశనం,

పెరుగుమీఁదతేటనీటిలో తుంగముస్తలచూర్ణము పుచ్చుకొని అదియే శరీరమునకు లేపనము చేసిన, చిక్కనిమజ్జిగను శరీరమునకు లేపనము చేసినను చిమటకాటువిషము హరించును.

### చలిచీమకాటుచికిత్స.

శిలాక్షారం కర్దమం చ అథవా కర్దమేన చ. 193
క్షతే విలేపనం కుర్యా త్పిపీలికవిషం హరేత్,

రాతిసున్నము బురదమట్టి కల్పి గాని, బురదమట్టినే కాని చలిచీమకాటుకు పట్టించిన బాధ నివర్తించును.

### మూషికాదివిషజంతుగణము.

మూషకో దీర్ఘదేహీ చ గిరికా గంధమూషికా. 194
మూషికాద్యగణం ప్రోక్తం ప్రాణినాం చ భయంకరం,

ఎలుక, పందికొక్కు, చిట్టెలుక, మంచెలుక, అనునవి మూషికాదిగణ మనఁబడును.

### మూషికాభేదములు.

లాలన శ్చపలః పుత్రో హసిరః చిక్కిరోఽజిరః. 195
కషాయదంతః కులకః కోకిలః కపిలోఽసితః,
అరుణ శ్శబల శ్శ్వేతః కపోతః ఫలితోఽందురుః. 196
ఛుచ్ఛుందరో రసాలాఖ్యో దశాష్టా చేతి మూషికాః,

లాలనము, చపలము, పుత్రకము, హసిరము, చిక్కిరము, జిరము, కషాయదంతము, కులకము, కోకిలము, కపిలము, సిముత, అరుణము, శబలము, శ్వేతము,

కపోతము, ఫలితము, ఉందురు, ఛుచ్ఛుందరము, రసాలము అని యెలుకలు పదునైని మిదిజాతులు కలిగి యుండును.

## మూషికావిషలక్షణము.

వీర్యం యత్ర పతే దేషాం వీర్యదిగ్ధై ర్యదంగకైః. 197
అంగం స్పృశంతి తత్రాస్రే, పాండుభూతే ప్రదూషితే,
శోఫో భగ్నిమోఽరుచిః క్రోధో గ్రంధయో మండలాని చ. 198
రోమహర్షోఽతిరుజ్మూర్ఛా విస్మృతిః పర్వభేదనం,
కంపశ్శీతజ్వర స్సాదో దీర్ఘకాలానుబంధనం. 199
శ్లేష్మణ స్సహబహ్వాఖు డింభక శ్ఛర్దనం సత్రుట్,
భవం త్యేతే గుణా ఘోరా హ్యై ర్మనుష్యోపసీదతి. 200
విషం రతిరతాఖూనాం కుచ్ఛ్రం కుప్యతి నై ముహుః,
మూర్ఛాక్లేద శిరోభార లాలాశోఫవివర్ణతాః. 201
శబ్దాశ్రుతిజ్వరో రక్తఛర్ది శ్చాసాధ్యలక్షణం,
ఆఖ్వాభై ర్గంధిభి ర్యుక్తం గంధే చుచ్ఛుందరోపమం. 202
వివర్ణాష్ఠం శూనవస్తి మూఖుదష్టం వివర్జయేత్,

ఎలుకలవీర్యము మనుజునియొక్క యేయంగమందు పడునో? వీర్యముచేత తడుపఁబడిన యెలుకలయంగముల మనుజుని యేయంగము స్పృశించునో, అచ్చట రక్తముచెడి పాండురవర్ణము కలిగి దూషీవిషతఁ జెంది వాపు, తెలివిదప్పుట, అరుచి, మంట, మినమిన లాడుగ్రంధులు, శరీరమంతయు మచ్చలు, రోమములు గగుర్పొడుచుట, అనివార్య మైననొప్పి, మూర్ఛ, స్మృతితప్పుట, కాలుసేతుల గణుపులందు పగులఁ గొట్టినటుల నొచ్చుట, శరీరము వణఁకు, చలిజ్వరము, సన్నగిలుట, వ్యాధిశరీరమందు బహుకాల మాపాదించి యుండుట, శ్లేష్మపునురుగువాంతియై అందు ఎలుక పిల్లలను బోలినరూపము లనేకము లుండుట, శరీరము నొచ్చుట, అతిదాహము కలిగి యుండుట, మొదలగు లక్షణములు కలుగును. మైథునము చేయునట్టి ఎలుకలమూత్రము, జొల్లు, రేతస్సు మొదలైనవి మనుజులశరీరమునకు తగిలినట్లైన అందువలన నేర్పడువిష మమితకష్టసాధ్య మగును. మూర్ఛ శరీరశైథిల్యము, తలనొప్పి, చొంగ కారుట, వాపు, శరీరము వివర్ణ మగుట, చెవులు వినరాకుండుట, జ్వరము, రక్తవమనము, ఇవి కలిగియుండిన మూషికవిష మసాధ్య మని తెలియవలయును. శరీరమందు ఎలుకలవలె గ్రంధు లేర్పడి యెలుకలవాసన యేర్పడి పెదవులు తెల్లఁబడి పొత్తికడుపు వాచిన అట్టిమూషికదష్టవిషార్తుని వర్జింపవలయును.

## సశేషమూషికవిషలక్షణము.

సశేషం మూషికవిషం ప్రకుప్యత్యభ్రదర్శనే. 203
యథాయథం వా కాలేషు దోషాణాం వృద్ధిహేతుషు,
తత్ర సర్వే యథావస్థం ప్రయోజ్యాః స్యురుపక్రమాః. 204
యథాస్వం యే చ నిర్దిష్టా స్తథా దూషీవిషాపహాః,

చికిత్సలవలన నుపశమింపక శేషించి యుండిన యెలుకవిషము వర్షాకాలములో ప్రకోపించును. దోషముల కభివృద్ధిహేతువు లున్నయెడల నితరకాలములందు సైతము ప్రకోపించును. అప్పు డాయాయవస్థలకు తగినటుల దూషీవిషాపహము లగుచికిత్స లను చేయవలయును.

## మూషికదూషీవిషలక్షణము.

ఆదంశా చ్ఛోణితం పాండుమండలాని జ్వరోఽరుచిః. 205
లోమహర్ష శ్చ దాహ శ్చా ప్యాఖుదూషీవిషార్దితే,

దూషీవిష మనఁగా, శరీరమందు జీర్ణించి బహుకాలము బాధించెడు విషము నకు పేరు. మూషికవిషము దూష్య మైనయెడల గాయమందు రక్తము స్రవించుచుం డుట, దేహము పాండురవర్ణ మగుట, మచ్చ లేర్పడుట, జ్వరము కలుగుట, అరుచి, రోమములు గగుర్పొడుచుట, దాహము మొద లైనవి కలుగును.

## పందికొక్కు చుంచెలుకవిషలక్షణము.

మూర్ఛాంగశోథవైవర్ణ్యం క్లేదశబ్దాశ్రుతిజ్వరాః. 206
మూషికాకారగ్రంథ్యత్వం శరీరం కాలవర్ణకం,
శిరోగురుత్వం లాలాస్ర చ్ఛర్దిశ్చాప్యసాధ్యమూషికాత్. 207

శరీరము వాచుట, మూర్ఛ, వైవర్ణ్యము, దౌర్బల్యము, చెవుడు, జ్వరము, శరీ రమున, మూషికలవంటిగ్రంథు లేర్పడుట, దేహము బొగ్గువలె నల్లనగుట, తల బరు వెత్తుట, రక్తవమనము, సొల్లుగారుట, శ్వాస మొద లైనవి, పందికొక్కు, చుంచె లుక కఱచినవిషార్తులకు కలుగును.

1 వ మూషికవిషచికిత్స.—

ఆఖూనా దష్టమాత్రస్య దంశం కాండేన దాహయేత్,
దర్పణే నాథవా తీవ్రరుజా స్యా త్కర్ణికాఽన్యథా. 208
దగ్ధంవిస్రావయే ద్దంశం ప్రచ్ఛిన్నం చ ప్రలేపయేత్,

ఎలుకకాటును కఱ్ఱతోఁ గాని గాజుపెంకుతోఁ గాని కాల్చి పిమ్మట రక్త

మును స్రవింపఁజేయవలయును. పిమ్మట నౌపధమును లేపనము చేయవలయును. ముందు కొల్పక పోయినయెడల గొప్ప వేదన గలకర్ణిక లుత్పన్న మగును.

2 వ చికిత్స.—

శిరీషరజనీవక్ర కుంకుమామృతవల్లిభిః. 209
ఆగారధూమమంజిష్టా రజనీలవణోత్తమైః,
లేపో జయ త్యాఖువిషం కర్ణికాయా శ్చ పాతనం. 210

దిరిసెనపుపువ్వులు, పసుపు, గ్రంథితగరము, కుంకుమపువ్వు, తిప్పతీఁగె, కరదువ్వ, మంజిష్టి, మ్రానిపసుపు, సైంధలవణము, ఇవి యుదకముతో నూఱి పట్టించిన ఎలుకవిషము శాంతించుటే కాక గ్రంధులు కఱిగి పోవును.

3 వ చికిత్స:—

తతోఽమ్లైః తిలైశయిత్వా నుత్తోయై రను చలేపయేత్,
పాలిందీశ్వేతకటభీ బిల్వమూల గుడూచిభిః. 211
అన్యై శ్చ విషశోఫఘ్నైః సిరాం వా మోక్షయే ద్ధృతం,

ఎలుక కాటును కలితో బాగుగ కడిగి పాలిందియను మూలిక, తెల్లవెక్కుడు తీగె, మారేడువేరు, తిప్పతీఁగ, అనునవి యుదకముతో నూఱి ముందుగా గాయములో నుండిరక్తమును స్రవింపంజేసి పిమ్మట పట్టించిన యెలుకవిషము హరించి వాపు గ్రంథులు శమించును.

4 వ చికిత్స.—

సింధువారస్య మూలాని బిడాలాస్థివిషం నతమ్. 212
జలపిష్టోఽగదో హంతి నస్యాద్యై రాఖుజంవిషం,

వావిలివేరు, పిల్లియెముక, వత్సనాభి, గ్రంథితగరము, ఇవి యుదకముతో నూఱి నస్యము చేయించి గాయమునకు పట్టించిన మూషకవిషము హరించును.

5 వ చికిత్స.—

విరేచనం త్రివృ న్నీలీ త్రిఫలాకల్క ఇష్యతే. 213
అంజనం గోమయరసో వ్యోషసూక్ష్మరజోన్వితః,

మూషికాదష్టులకు తెల్లతెగడచూర్ణమును గాని, నీలివేరుచూర్ణమును గాని, త్రిఫలచూర్ణమును గాని యిచ్చి విరేచనము చేయించి త్రికటుకచూర్ణము కలిపిన అవుపేడరసమును కన్నుల కంజనము వేసిన మూషికవిషము హరించును.

6 వ చికిత్స.—

ఛర్దనం నీలినీకావ్యాఖై శ్శుకాఖ్యాం కోలయో రపి. 214

కోశాతక్యాః శుకాఖ్యాయాః ఫలం జీమూతకస్య చ,
మదనస్య చ సంచూర్ణ్యం దధ్నా పీత్వా విషం జయేత్. 215

నీలివేరుకషాయము త్రాగించి వమనమును గావించి పిమ్మట, దుండిగపువేరు, ఊడుగచెక్క, బీరవేరు, చిలుకనాసవిత్తులు, డావరడంగికాయ, నల్లయుమ్మెత్తవేరు ఇవి చూర్ణించి అవుపెరుఁగులో కలిపి పుచ్చుకొనిన యెలుకవిషము హరించును.

7 వ చికిత్స.—

వచామదనజీమూతకుష్ఠం వా మూత్రపేషితం,
పూర్వకల్పేన పాతవ్యం సర్వోందురువిషాపహమ్. 216

వస, నల్లయుమ్మెత్తవేరు, డావరడంగికాయ, కోష్టు, ఇవి చూర్ణించి గోమూత్రములో కలిపి త్రాగిన సర్వవిషము మూషికాదులవిషము హరించును.

8 వ చికిత్స.—

కపిత్థగోమయరసో మధుమానవలేహనం,
తండులీయకమూలేన సిద్ధం పానే హితం ఘృతమ్. 217

వెలగపండుగుజ్జు, అవుపేడరసము, తేనె, అవునెయ్యి, చిర్రివేళ్లకల్కమును కలిపి ఘృతపక్వముగ కాచి అఘృతమును సేవించిన ఎలుకలు, చుంచెలుకలు, పందికొక్కులు కఱచినందువలన కలిగినవిషము హరించును.

9 వ చికిత్స—

ద్వినిశాకటభీరక్తాయష్ట్యాహ్వై రామృతాన్వితైః,
ఆస్ఫోతమూలసిద్ధం వా పంచకాపిత్థమేన వా. 218
సిందువారనతం శిగ్రు బిల్వమూలం పునర్నవా,
వచా శ్వదంష్ట్రాజీమూత మేషాం క్వాథం సమాక్షికమ్. 219
పిబే చ్ఛాలోన్యదనం దధ్నా భుంజానో మూషికార్దితః,

పసుపు, మానిపసుపు, ఎఱ్ఱవెక్కుడుతీగె, అతిమధురము, తిప్పతీగె, తెల్లదింటెనవేరు, కపిత్థపంచకము, వావిలివేరు, గ్రంధితగరము, మునగవేరు, మారేడువేరు, అటికమామిడివేరు, వస, పల్లేరువేరు, డావరడంగికాయ ఇవి కషాయముఁబెట్టి అందులో తేనె కల్పి పుచ్చుకొనుచు వరిఅన్నములో నావుపెరుఁగు వేసి భుజించుచుండిన మూషికాదులవిషము హరించును.

10 వ చికిత్స—

తక్రేణ శరపుంఖ్యాయా బీజం సంచూర్ణ్య వా పిబేత్. 220
అంకోలమూలకల్కం వా బస్తమూత్రేణ కల్కితః,

పానాలేపనయో ర్యుక్తః సదాఖు విషనాశనః. 221

వెంపలివిత్తులు చూర్ణించి మజ్జిగలో కలిపి త్రాగినను లేపనము చేసికొనినను, ఊడుగవేరు చూర్ణమును గోమూత్రములో కలిపి త్రాగినను లేపనము చేసినను మూషికాదులవిషము హరించును.

11 వ చికిత్స—

మార్జారపలలం పాచ్యం భక్షయే త్స ప్తవాసరం,
దీర్ఘదేహీ మూషికస్య గంధమూషీవిషాపహః. 222

పిల్లిమాంసమును వండించుకొని యేడుదినములు రేపుమాపు భక్షించిన, పందికొక్కు, చుంచెలుక, ఎలుక వీని దష్టముచే కలిగిన విషము హరించును.

12 వ చికిత్స—

శిలాతాలకకుష్ఠం చ భావ్యం నిర్గుండికాద్రవైః,
పానం మూషికదష్టానాం దత్తం తీవ్రవిషాపహమ్. 223

మణిశిల, తాళకము, కోష్టు, ఇవి సమముగ గూర్చి వావిలాకుపసరుతో నూరికల్కముచేసి పుచ్చుకొనిన చుంచెలుక యెలుక పందికొక్కువిషము హరించును.

13 వ చికిత్స—

గృహగోధీం సమాదాయ పిష్ట్వా తండులవారిణా,
లేపా దాఖువిషం హంతి పిబే ద్వా క్షీరపాచితామ్. 224

బల్లిని బియ్యపుకడుగుతో నూరి శరీరమునకు లేపనము చేసినను ఆవుపాలలో వేసి కాచి యాపాలను పుచ్చుకొనినను పందికొక్కు చుంచెలుక గఱచినవిషము హరించును.

14 వ చికిత్స—

సర్షపం కుంకుమం తక్రం సమభాగం ఘృతం పిబేత్,
విషం మూషికదష్టానాం శమ మాప్నోతి తత్క్షణాత్. 225

ఆవాలు, కుంకుమపువ్వు, మజ్జిగ ఇవి మృదువుగ నూరి ఆవునేతిలో కలిపి త్రాగిన పందికొక్కు, చుంచెలుక, ఎలుక వీని విషములు హరించును.

15 వ చికిత్స—

బింబాఫలసమాయుక్తం గృహధూమం పలార్ధకం,
పురాణాజ్యేన సప్తాహం లిహ మా ఖువిషం హరేత్. 226

చింతపండు, కరుదువ్వ అరపలము చొప్పున కూర్చి పాత ఆవునేతిలో కలిపి యేడురోజులు పుచ్చుకొనిన పందికొక్కు, ఎలుక, చుంచెలుక విషము హరించును.

16 వ చికిత్స—

సితాయాః పలమానం తు బాణపుంఖరసం పలం,
యః పిబే త్ప్రాతరుద్ధాయ మూషికస్య విషాపహమ్. 227

వెంపలిచెట్టు సమూలమును దంచి పిడిచికొనినరసము ఒకపలము, చక్కెర పలము కలిపి ప్రాతఃకాలమునందు త్రాగిన పందికొక్కు, చుంచెలుక, ఎలుక వీని కాటువల్ల కలిగిన విషము శాంతించును.

17 వ చుంచెలుకవిష చికిత్స—

ఊర్ధ్వాత్తు పతితో మూషః శ్వేతవర్ణ స్సుదారుణః,
పాతస్థానే భవే ద్గ్రంథి స్సా గ్రంధి ర్మృత్యుదాయినీ. 228
గ్రంథిం శస్త్రేణ విస్ఫాట్య ఖరస్య శకృతం క్షిపేత్,
తేన దుష్టస్య గ్రథితో వికృతే శాంతికృ ద్భవేత్. 229

చుంచెలుక పైనుండి మనుజునిశరీరమందు పడిన స్థలమందు మృత్యుదాయక మగుగ్రంధి జనించును; ఆగ్రంధిని శస్త్రముచే చిమ్మి అందు గాడిదపెంటికలను వేసి లేపనము చేసిన నాగ్రంధులు శమించి విషము హరించును.

18 వ చికిత్సా—

భల్లాతార్కఫలం ముస్తా కపికచ్ఛుఫలం తథా,
రాలసిద్ధార్థకౌ తేషాం చూర్ణధూపప్రభావతః. 230
మూషికామశకామక్షి మత్కుణా విషకీటకాః,
పలాయంతే గృహం త్యక్త్వా యథా యుద్ధేఽతికాతరః. 231

జీడిగింజలు, జిల్లేడుకాయలు, తుంగముస్తలు, తీటకోవెలకాయలు, యక్షధూపము, తెల్లావాలు వీనిని చూర్ణముచేసి గృహమందు పొగవేసిన ఎలుకలు, దోమలు, ఈగలు, నల్లులు, విషజంతువులు ఇల్లు విడిచి తొలఁగిపోవును.

19 వ చికిత్స—

కుష్ఠం వచామదనకోశవతీఫలేన
సంయోజితం తదితి చూర్ణ మిదం చతుర్ణాం,
గోమూత్రపీత మఖిలాఖువిషం నిహంతి
కోశాతకీక్వథనమాపిబతోఽథవాఽపి. 232

కోష్టు, వస, మ్రంగకాయ, చేదుబీర వీనిని సమభాగములు కూర్చి చూర్ణించి గోమూత్రములో కలిపి పుచ్చుకొనినను, చేదుబీరసమూలకషాయమును పుచ్చుకొనినను పందికొక్కు, చుంచెలుక, ఎలుక కాట్లవలన కలిగిన విషము శాంతించును.

20 వ చికిత్స—

రసం గంధం నిశాబంధూకం గృహధూమం శిరీషజం,
బీజం దినకరక్షీరై ర్మర్దయిత్వా విలేపనమ్. 233
విశేషాన్మూషికవిషం హన్యా ద్దద్యా న్నిషోద్భవాన్,

రసము, గంధకము, పసుపు, దాసానిపువ్వు, కరిదువ్వ, దిరిసెనపువిత్తులు ఇవి సమాంశములు కూర్చి జిల్లేడుపాలతో నూరి పట్టించిన మూషికాదులవిషము శాంతించును.

21 వ చికిత్స—

శిలాతాళకకుష్ఠాని పిష్ట్వా నిర్గుండిజద్రవైః. 234
పానం మూషికదష్టానాం దత్వా తీవ్రవిషం హరేత్,

మణిశిల, తాళకము, కోష్టు వీనిని వావిలాకుపసరుతో నూరి త్రాగిన తీవ్రమైనమూషికాదులవిషము శాంతించును.

22 వ చికిత్స—

శిరీషకుసుమం తక్రై ర్వత్సనాభయుతం పిబేత్. 235
విషం మూషికదష్టానాం శమ మాప్నోతి తత్క్షణాత్,

దిరిసెనపుపువ్వులు, వసనాభి మజ్జిగలో నూరి త్రాగిన మూషికాదులవిషము శాంతించును.

28 న చికిత్స—

రవిక్షీరైః కేశసూత్రం సప్తభి ర్భావితం క్రమాత్. 236
తేన దగ్ధ్వాఽర్కచూర్ణం చ క్షిపే దాఖువిషం హరేత్,

వెండ్రుకల త్రాడు నేడుమార్లు జిల్లేడుపాలలోతడిపి యెండించియుంచుకొని యా త్రాటితో కాటును కాల్చి దానిపైన జిల్లేడుచెక్క పొడుమును చల్లినట్లైన పందికొక్కు, చుంచెలుక, ఎలుక వీని విషము శాంతించును.

24 వ చికిత్స—

తోయై ర్వా నాగరం నశ్యం పిబే ద్వాఽమృతసైంధవమ్,
అర్కదుత్తూరమూలం వా జలపానే విషాపహాం. 237

సొంటి నుదకముచే నూరి నస్యముచేసినను, శుద్ధిచేసినవసనాభి, సైంధలవణము నూరి నస్యముచేసినను, జిల్లేడు, ఉమ్మెత్తవేరులు నూరి త్రాగించినను పందికొక్కు, చుంచెలుక, యెలుక విషము శాంతించును.

ఇతి మూషికవిషచికిత్సా.

———

## ⟶ గోధాదివిషజంతుగణము. ⟵

గోధి శ్చిక్రోడక శ్చైవ నకులః కృకలాసకః,
శరటాగృహగోధిశ్చ గోధ్యాదికగణం భవేత్. 238

ఉడుము, ఉడత, ముంగిస, తొండ, నలికీచు, బల్లి అనునవి గోధ్యాదిగణ మనఁబడును.

## ⟶ ఉడుమువిషచికిత్స. ⟵

ఆక్రోణతండులీమూలం తులసీమూలకం తథా,
తండులోదకపానేన గోధేరస్య విషం హరేత్. 239

ఎఱ్ఱచిట్టివేరు, తులసివేరు, ఇవి బియ్యపుకడుగుతో నూఱి త్రాగిన నుడుము కాటువిషము శాంతించును.

2 వ చికిత్స—

లాంగల్యా కటుతుంబ్యాథ దేవదారునిశాపివా,
మూలం బీజం కాంజికేన లేపో గోధేరజం హరేత్. 240

బొక్కినాకు, చేదుసొర, దేవదారు, పసపు, వీనివేళ్లుగాని విత్తనములు గాని కలితో నూఱి లేపనము చేసిన నుడుమువిషము హరించును

3 వ చికిత్స—

తిలం చ సర్షపాః కుష్ఠం బీజం కరజసంభవం,
ఉద్వర్తనాత్ప్రలేపా ద్వా గోధేరక్షతజం హరేత్. 241

నువ్వులు, ఆవాలు, కోష్టు, కానుగవిత్తులు, ఇవి మృదువుగ నుదకమున నూఱి యుడుముకాటుపై నుంచి చక్కఁగ రాచిన విషము శాంతించును.

## ⟶ ఉడుతకాటుచికిత్స. ⟵

కరంజబీజం సిద్ధార్థం తిలై స్లేపో విషాపహః,
ఏరండతైలలేపేన స్థూలదంతవిషాపహః. 242

కానుగవిత్తులు, తెల్లావాలు, నువ్వులు నూఱిపట్టించినను వంటాముదము పట్టించినను ఉడుతకాటువిషము శాంతించును.

2 వ చికిత్స—

నిశాదారునిశా చైవ మంజిష్ఠానాగకేసరం,
ఏషా మాలేపమాత్రేణ స్థూలదంతవిషాపహః. 243

పసుపు, మ్రానిపసుపు, మంజిష్టి, నాగకేసరములు, వీని నుదకముతో నూఱి పట్టించిన ఉడుతకాటువిషము హరించును.

### ముంగిసకాటువిషచికిత్స.

సమూలపత్రాం సర్పాక్షీం జలేన క్వథితం పిబేత్,
నరమూత్రేణ వా పిష్టం పిబే న్నకులజం హరేత్. 244

సర్పాక్షిచెట్టు సమూలము కషాయముఁబెట్టి త్రాగినను, నరమూత్రముతో నూఱి రసముపిడిచి పుచ్చుకొనినను ముంగిస, వెంటవకాటువిషము హరించును.

2 వ చికిత్స—

వటపత్రీం మర్దయిత్వా కర్షమాత్రం పిబే జ్జలే,
నకులక్షతగరంహంతి సర్వోరగవిషం హరేత్. 245

కుక్కపాలవేరు గాని, ఆకు గాని కర్షప్రమాణము నుదకమున నూఱి త్రాగిన ముంగిస, ఎంటవ సర్పములవిషము శాంతించును.

### వటపత్రీవిచారము.

నకులానాం భుజంగానాం కలహే నకులై స్సదా,
కాలకూటాపనోదాయ భక్ష్యతే వటపత్రికం. 246

ముంగిస సర్పములతో పోట్లాడుట కుద్దేశించినపుడు ముందుగ కుక్కపాల చెట్టున్నచోటును చూచి వచ్చి పిమ్మట సర్పములపైకి కలహమునకు పోయి వానిని తిన్నగా ఆచెట్టున్నచోటికి రానిచ్చి పాములమీఁద గలియఁబడి అవి కఱచినప్పు డెల్ల కుక్కపాలాకు కొఱికి నమిలి తినుచు విషమును పోఁగొట్టికొనుచు పాములను చంపి వేయును.

### తొండకాటుచికిత్స.

పలప్రమాణకం క్షౌద్రం పాయయే ద్వింశతి ర్దినాన్,
కృకలాసవిషం హంతి సర్వకీటవిషాపహం. 247

పూటకు పలప్రమాణముచొప్పున నిరువదిదినములు తేనె పుచ్చుకొనిన తొండ కాటు, తక్కినజంతువులకాటువిషము హరించును.

2 వ చికిత్స—

కర్షద్వయం చ గోమూత్రం పిబే ద్వింశతివాసరాన్,
కృకలాసవిషం హంతి సర్వకీటవిషాపహం. 248

దినమునకు రెండుతులములప్రమాణము ఆవుపంచితమును (ఇరువదిదినములు) పుచ్చుకొనిన తొండకాటు తక్కినవిషజంతువులకాట్లవిషము హరించును.

3 వ చికిత్స—

కృకలాస్యేనపిత్తేన భావితో మణజం రజం,

మధునా ద్విదినం భక్షేత్ కృకలాసవిషం హరేత్. 249

తొండలను కొట్టి భక్షించు 'తొండలడేగ' యనుపక్షియొక్క పిత్తమందు భావనచేసి యెండించిన మిర్యాలచూర్ణము నిష్క ప్రమాణము తేనెతో కలిపి రెండుదినములు పుచ్చుకొనిన తొండకాటువిషము శాంతించును.

## నలికీచుస్వరూపము

పృష్ఠం రౌప్యసమాకారం పుచ్ఛం విద్రుమసన్నిభమ్,
శీర్షం దర్వీకరాకారం సరటేతి ప్రకథ్యతే. 250

వీపు వెండివలె తెల్లగ నిగనిగలాడుచు తోఁక యెఱ్ఱనివర్ణము కలిగి శిరస్సు పామువలె నుండునవి నలికీచనియు, నలికిరియనియు, నలికండ్లపామనియు చెప్పఁబడును. ఇవి యిండ్లయందు విశేషముగ సంచరించుచుండును.

## నలికీచుకాటుకుచికిత్స.

అర్కమూలం వచాచూర్ణం పీత్వా శీతేన వారిణా,
తస్య సరటవిషం సద్యశ్శాంతిర్భవతినిశ్చయం. 251

జిల్లేడువేరు, వస, సమాంశములు చూర్ణించి శీతోదకముతో కలిపి పుచ్చుకొనిన నలికీచువిషము శాంతించును.

## బల్లికాటుచికిత్స

కటుత్రయం సింధుకరంజబీజం ద్వయంనిశాయాఃకపికచ్ఛబీజం,
నిహంతి పానేన విలేపనేన విషం ప్రశామ్యం గృహగోధికానాం.

సొంటి, పిప్పళ్లు, మిర్యాలు, సైంధలవణము, క్రానుగవిత్తులు, పసుపు, మానిపసుపు, దురదగొండివిత్తులు, ఇవి చూర్ణించి యుదకముతో పుచ్చుకొనిన బల్లికాటువిషము హరించును.

అన్యత్ చికిత్స.—

గృహగోధావిషం హంతి కాశ్మరీఫలనస్యతః,

నేలగుమ్ముడుకాయలరసమును నశ్యము చేసినయెడల బల్లికాటువిషము, బల్లియుచ్చపోసినందువలవ కలుగుపొక్కులు నశించును.

## సవిషమండూకాది జలచరవిషజంతుగణము.

సవిషప్లవస్తుదుర్నామా శకులీమండుకాదికం. 253

విషపుకోఁటులు గలకప్ప, వీపుమీఁద నల్లనిచార గలజలగ, బేడిసచేఁప (బేకుచేఁప) అనునవి విషజలచరగణమనంబడును.

### సవిషమండూకదష్టలక్షణము.

ఏకదంష్ట్రార్దిత శ్శూనః సరుజః పీతక స్సతృట్,
సనిద్ర శ్ఛర్దిమాన్ దష్టో మండూకై స్సవిషై ర్భవేత్. 254

విషపుకోఱలు గలకప్పయొక్క కోఱచే కాటు కలిగినయెడల శరీరము మొద్దు పాఱుట, శ్రమము దేహము పసుపురంగగుట, దాహము, నిద్ర, వమనము కలుగును.

1 వ చికిత్స—

శిరీష ఫలమూలం చ స్నుక్ క్షీరేణ చ భావితం,
చూర్ణం మృదుతరం కుర్యా త్పిబే ద్భేకవిషాపహం. 255

దిరిసెనపుకాయలు, వేళ్లు, జెముడుపాలతో భావనచేసి యెండించి చూర్ణించి యుదకమునఁగలిపి త్రాగిన మండూకదష్టవిషము హరించును.

2 అన్యత్—

త్ర్యూషణం మేఘనాదం చ భేకమత్స్యవిషాపహం,

త్రికటుకములు, చిట్టివేరు నూఱి మాత్రలుచేసి భక్షించిన విషముతోఁగూడిన కప్పకాట్లవిషము హరించును.

### సవిషమత్స్యదష్ట లక్షణము.

మత్స్యాస్తు సవిషాః కుర్యు ర్దాహం శోథం రుజంతథా. 256
మూర్ఛాతిరుధిరం పాతం పూతిమాంసంశనై శ్శనైః,
రక్త మత్యంత విస్రావం విశీర్ణం విస్మృతిర్భవేత్. 257

బేడిసచేఁప, (జేకుచేప) యనుదానికి ముక్కుపై నొకశలాకవంటి నిడుపైనకొమ్ముండును. ఆచేఁప కఱచి దానికొమ్మునఁ గొట్టెనేని యెట్టిమనుజుఁడైనను పడిపోవుటయే కాక శరీరము మంటలు, వాపు, మాంద్యము, మైకము, వివశత్వము, కలిగి గాయమునుండి శరీరమాద్యంతమునందుండురక్తము పీల్చినటుల స్రవించుచుండును. కాటుపడినచోట మాంసము కుళ్లి రాలి పోవుచుండును; ఒకవేళ దీనివలన మృతి సైతము సంభవింపవచ్చును.

3 వ చికిత్స—

శిలాజతుఘృతే పాచ్యం లేపయే త్తద్ఘృతంక్షతే,
ఖానే పానే ప్రదాతవ్యం గుంజామాత్రం శిలాజతు. 258
క్షీరేణ లేపితం నిత్యం విషమత్స్యవిషాపహం,

ఐకధ్యం పాయససురా కృసరాద్యోగజం విషం,
ఉగ్రగంధామాక్షికయోః మేళనాద్యోగజంవిషమ్. 39

పాయసము, కల్లు, నువ్వులు బెల్లము, (లేక, పులగము) ఈమూడును కలిపిన యోగజవిష మగును. వసయును, తేనెయును సమాంశములు కలిపినను యోగజవిష మగును.

మాక్షికం తిలతైలం చ మేళనం యోగజం విషం,
సారసాక్షం మాక్షికం చ మేళనం యోగజం విషమ్. 40

తేనెయు, నూనెయు సమాంశములు కలిపినను తామరవిత్తులు, తేనెయు సమాంశములు కల్పినను యోగజవిష మగును.

ద్రాక్షాసవం చ మైరేయం శార్కరం యోగజం విషం,
మంథక్షీరాన్నసంయోగం పీతం చే ద్యోగజం విషమ్. 41

ద్రాక్షసారాయి, ఖర్జూరపుసారాయి, చక్కెరసారాయి, సమాంశములు కలిపి త్రాగిన యోగజవిష మగును. క్షీరాన్నము, అంబలి సమాంశములు చేరిన విషమగును.

హారిద్రః కటుతైలేన భృష్టం చే ద్యోగజం విషం,
ఉపోదకాతిసారాయు తిలకల్కేన యోగజమ్. 42

హారిద్ర (కడపచెట్టు) శాకము ఆవనూనెతో వేచిన యోగజవిష మగును. నువ్వులకల్కముతో స్విన్నము చేయబడిన మంపుబచ్చలికూర సంయోగజవిష మగును.

బలాకా వారుణీయుక్తా కుల్మాషైశ్చ విరుధ్యతే,
భృష్టావరాహవసయా సైవ సద్యో నిహంత్యసూన్. 43

తెల్లకొక్కెరమాంసము వారుణీమద్యముతో గూడినను, గుగ్గిళ్లతోడను చేరినను, పందిచమురుతో వేయించబడినను సద్యఃప్రాణహర మగువిష మగును.

తద్వత్తిత్తిరిపత్రాస్య గోధాలావకపింజలాః,
ఐరండేనాగ్నినా సిద్ధా స్తత్తైలేన విమూర్ఛితాః. 44

తిత్తిరిపక్షి, నెమలి, ఉడుము, లావుక, కపింజలము, అనువానిమాంసములలో నేని యైనను, ఆముదపుకట్టెలనిప్పులతో కాచిగాని వండిగాని ఆముదము వేసి వేయించి కాని భక్షించిన తోడనే ప్రాణములను హరించును.

హారీతమాంసం హారిద్రశూలకప్రోతపాచితం,

హారిద్రవహ్నినా సద్యో వ్యాపాదయతి జీవితమ్. 45
భస్మపాంసుపరిధ్వస్తం తదేవ చ సమాక్షికం,

హారీతపక్షి (పసుపుపావురము) మాంసమును ఇనుపశూలమునఁ గ్రుచ్చి కాల్పఁబడినచో తత్క్షణముననే చంపునట్టివిష మగును. ఆమాంసమే, బూడిద, ధూళి, వీనిచే దుష్టమైనను తేనెతో చేరినను యోగజవిషమగును.

న జాతు కటుతైలేన భృష్టా ముద్యా దుపోదకామ్. 46
ప్రియంగుకల్కస్నిగ్ధాంగః పాయస న్న సమాచరేత్,

తైలమునఁ గాని మద్యముతోఁగాని కాల్పఁబడినదుంపబచ్చలి విష మగును. ప్రేంకణపుకల్కముచే తలంటి స్నానముచేసినవాఁడు పాయసమును భుజించిన విషమగు.

భాసో విరుధ్యతే శూల్యః కంపిల్ల స్తక్రసాధితః. 47

శూలమునఁ గ్రుచ్చి పక్వము చేయఁబడిన భాసపక్షి మాంసము విష మగును. అటులనే తక్రముచే పక్వము చేయఁబడినకంపిల్లము విష మగును.

మత్స్యనిస్తలనస్నేహసాధితాః పిప్పలీ స్త్యజేత్,
కాంస్యే దశాహ ముషితం సర్పి రుష్ణం త్వరుష్కరే. 48

మత్స్యముల వేయించఁబడిననెయ్యితో సిద్ధము చేయబడినపిప్పళ్లు విష మగును. కంచుపాత్రలో పదిదినము లుంచి పెట్టఁబడిననెయ్యి విష మగును.

## యోగజవిషచికిత్స.

పుత్రజీవఫలే నైవ రజనీ మారనాలకైః,
దేవదాసీనృమూత్రైర్వా సర్పాక్షీ చేంద్రవారుణీ. 49
గిరికర్ణీయుమూలం వా ప్రత్యేకం యోగజం హరేత్,

పుత్రజీవిఫలము, పసుపు, కలితో నూరి త్రాగినను, దాపరదంగిఫలమును గాని, సర్పాక్షిచెట్టువేరును గాని, పొట్టిపాపరవేరును గాని, గంటెనవేరును గాని నరమూత్రముతో నూరి త్రాగినను యోగజవిషము హరించును.

2 వ చికిత్స.—

మధ్వాజ్యం కాక మాచ్యాస్తు ద్రవై పిష్ట్వా విషంహరేత్. 50
గిరికర్ణినాగపుష్పీమండిపానా ద్విషాపహం,

తేనె, నేయి, నల్లకాచిపండ్లు ముద్దగా నూరి భక్షించినను, తెల్లగంటెన, నాగపుష్పి, తెల్లబోడతరము సమముగ నూరి భక్షించినను యోగజవిషము నివారణ మగును.